# విషయ సూచిక



-----oOo----

॥ ఓం శ్రీపరమాత్మనే నమః ॥

శ్రీమహాగణాధిపతయే నమః

# "గృహస్థాశ్రమంలో ఎలా ఉండాలి?"

శ్లో. రుద్రో ముండధరో భుజంగసహితో గౌరీ తు సద్భూషణా
స్కందః శంభుసుతః షడాననయుతస్తుండీ చ లంబోదరః ।
సింహక్రేలిమమూషకం చ వృషభస్తేషాం నిజం వాహన
మిత్థం శంభుగృహే విభిన్నమతిషు చైక్యం సదా వర్తతే ॥

శంకరుడు కపాలమాలను సర్పములను ధరించియున్నాడు. పార్వతి సుందరాభరణముల దాల్చియున్నది. శంకరునిపుత్రులు – కార్తికేయుడు షణ్ముఖుడు, గణేశుడికి పొడుగైన తొండము లంబోదరముగలవాడు. వీరి వాహనాలు – వృషభం, సింహం, నెమలి, మూషికములు కూడ పరస్పరం విరోధ స్వభావంకలవి. ఇలా ఉన్నప్పటికీ పరస్పర విరుద్ధస్వభావాలున్న శివపరివారంలో నిత్యమూ ఏకత్వముంటుంది. ఇలాగే కుటుంబంలో వేరువేరు స్వభావాలున్నవారుకలిసి తమ అభిమానం సుఖభోగాలు త్యాగం చేసి ఇతరుల హితమూ, సుఖమూ కాపాడుతూ పరస్పరం ప్రేమ పూర్వకంగా ఏకత్వాన్ని కలిగియుండాలి.

## 1. గృహస్థధర్మం

శ్లో. సానందం సదనం సుతాశ్చ సుధియః కాన్తా న దుర్భాషిణీ
సన్మిత్రం సుధనం స్వయోషితి రతిశ్చాజ్ఞాపరాః సేవకాః ।
ఆతిథ్యం శివపూజనం ప్రతిదినం మృష్టాన్నపానం గృహే
సాధోః సంగముపాసతే హి సతతం ధన్యో గృహస్థాశ్రమః ॥

ఇంట అందరూ సుఖంగా ఉండి పుత్రుడు బుద్ధిమంతుడై, పత్నిమధురభాషిణియై, మంచి మిత్రులు, స్వపత్నీసంగమం,

ఆజ్ఞానువర్తులైన సేవకులు, రోజూ అతిథిసత్కారం, శివారాధనం కలిగి ఉంటూ పవిత్రమూ రుచికరము అయిన అన్నపానాదులు, నిత్యసత్సాంగత్యము ఉన్న గృహస్థుని ఆశ్రమం ధన్యము!

ప్రశ్న: వివాహం ఎందుకు చేసుకోవాలి? వివాహం చేసుకోవటం అవసరమా?

సమాధానము: మనలో రెండురకాల బ్రహ్మచారులున్నారు. 1.నైష్ఠికుడు, 2. ఉపకుర్వాణుడు. ఆజీవన బ్రహ్మచర్యం పాటించే వారిని "నైష్ఠిక బ్రహ్మచారు"లంటారు. మనస్సులో భోగేచ్ఛను నశింపచేసుకోలేక కేవలం భోగేచ్ఛ నశింపచేసుకోవటానికే వివాహం చేసుకొనేవారు "ఉపకుర్వాణబ్రహ్మచారు" లనిపించుకుంటారు. అంటే ఆలోచనద్వారా భోగేచ్ఛనణచుకోలేక వివాహం చేసుకొని ఈ భోగేచ్ఛ భోగానుభవం వల్ల నశించేదికాదని అనుభవపూర్వకంగా అర్థం చేసుకుంటారన్నమాట. అందుచేత గృహస్థాశ్రమం తరువాత వానప్రస్థంలోకి సన్న్యాసాశ్రమంలోకి, వెళ్లే విధానం ఏర్పాటు చేయబడింది. ఎల్లప్పుడూ గార్హస్థ్యంలోనే ఉండి భోగాలనుభవించటం మానవత్వంకాదు.

మనస్సులో భోగేచ్ఛఉండిగాని, వంశం నిలబెట్టుకోవాలనే కోరికఉండి గాని, తనకెవరూ సోదరులు లేక భోగేచ్ఛ పోగొట్టుకోవాలనే ఉద్దేశ్యంతో మాత్రమేగాని వంశం నిలబెట్టుకోవాలనే కోరికతోగాని ఉన్నవాడు వివాహం చేసుకోవాలి. పైన చెప్పిన రెండు కోరికలూ లేకపోతే వివాహం చేసుకోవలసిన అవసరం లేదు. శాస్త్రాలలో "నివృత్తి", సర్వశ్రేష్ఠమని చెప్పబడింది – "నివృత్తిస్తు మహాఫలా".

ప్రశ్న– కలియుగములో సన్న్యసించుట నిషేధింపబడింది కదా! మానవుడు నివృత్తిమార్గమెలా స్వీకరించి ఆచరిస్తాడు?

సమాధానము: కలియుగంలో సన్న్యాసధర్మపాలనం చాలా కష్టం. కాబట్టి కలియుగంలో సన్న్యాస స్వీకారం నిషిద్ధమైంది. అది కష్టం కాబట్టి దాన్ని సరిగా పాటించలేడు. అందుచేత ప్రభుత్వపుటుద్యోగం నుంచి 'పదవీ విరమణ' చేసినట్లే మానవుడు ఇంటినుంచి రిటైరవ్వాలి. కొడుకులకీ

మనుమలకీ బాధ్యతావ్యవహారాలు అప్పచెప్పి ఇంట్లో ఉంటూనే భగవద్భజన, స్మరణం చేసుకోవాలి. కుటుంబసభ్యులు అంగీకరిస్తే అన్న వస్త్రాదులకోసం మాత్రమే వాళ్లతో సంబంధం పెట్టుకోవాలి. వారనుమతించకపోతే అన్నవస్త్రాది నిర్వహణ మాత్రసంబంధం కూడా వదులుకోవాలి. మరి "ఎలాగడుస్తుంది?" అనే చింతపెట్టుకోనక్కరలేదు. ఎందుచేతనంటే –

"ప్రారబ్ధ పహలే రచా, పీఛే రచా శరీర ।
తులసీ చింతా క్యోం కరే, భజ లే శ్రీరఘుబీర్ ॥"

తే.గీ ॥ మొదట ప్రారబ్ధమును వ్రాసి పిదప నరుని
సృష్టిచేసెను లోకాన స్రష్ట నిజము
తులసిదాసుడు చింతింప వలదటంచు
పట్టుమనియెను శ్రీరామపాదములను.

ప్రశ్న– గృహస్థునియొక్క ముఖ్యధర్మమేమిటి?

సమాధానము: బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం అను ఈ నాలుగాశ్రమాల వారినీ సేవించటం గృహస్థుని ముఖ్యధర్మం. ఎందుకంటే గృహస్థే అందరికి తల్లి, తండ్రి, పాలకుడు, సంరక్షకుడు. అంటే గృహస్థు నుంచే బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థుడు, సన్న్యాసీ పుట్టారు (పుడుతున్నారు) అతని చేతనే పాలింపబడుతూ, రక్షింపబడుతూ ఉంటున్నారు. అందుచేత చతురాశ్రమాల పాలనపోషణ బాధ్యత గృహస్థు ప్రధాన ధర్మం.

అతిథి సత్కారం చేయటం, ఆవులు, గేదెలు, గొఱ్ఱెలు, మేకలు మొదలైన వాటి సుఖజీవనానికి వీలుకల్పించటం గృహస్థుయొక్క ముఖ్యధర్మం. ఇలాగే దేవతల, మునుల సేవచేయటం, పితృదేవతలకు తిలోదక పిండప్రదానాదులివ్వటం విశేషించి భగవత్సేవ గృహస్థుని ముఖ్యధర్మం.

ప్రశ్న: గృహస్థాశ్రమములో ఎలా ఉండాలి?

సమాధానము: ఈ మనుష్యశరీరంలో కూడ గృహస్థాశ్రమాన్ని ఉద్ధరించే పాఠశాల ఉంది. భోగాలనుభవించటానికీ విశ్రాంతి పొందటానికీ కాదు మనుష్యశరీరం "ఏహి తన కర ఫల బిషయ న భాయీ" (మానస. ఉత్తర 44-1) శాస్త్రవిహితమైన యజ్ఞాదికర్మలు చేసి బ్రహ్మలోకాదులను పొందుటయే ముఖ్యమైన విషయంకాదు. అక్కడికి వెళ్లినా మళ్లీ వెనక్కి రావలసివస్తుంది. "ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినః" (గీత 8-16) కాబట్టి ప్రాణిమాత్రహిత చింతనతో గృహస్థాశ్రమంలో ఉండాలి. తన శక్తికి తగినట్లు తనువు, మనస్సు, బుద్ధి, యోగ్యత, అధికారము మొదలైన వాటిద్వారా ఇతరులకు సౌఖ్యమును కలిగించాలి. ఇతరుల సుఖసౌకర్యాలకోసం తన సుఖ, విశ్రాంతుల్ని త్యజించుటయే మనుష్యుని మనుష్యత్వం.

ప్రశ్న: గార్హస్థ్యంలో క్రియాకలాపాల నిర్వహణలో హింస సంభవిస్తుంది కదా దాని నుంచి విడుదల విముక్తి పొందుట ఎలా?

సమాధానము: గృహస్థాశ్రమంలో రోజూ ఈ అయిదు హింసలూ తరుచుగా జరుగుతునే ఉంటాయి- 1. వంట చేసేటప్పుడు నిప్పులో చీమలు మొదలైన సూక్ష్మజీవులు మరణిస్తాయి. కట్టెపుల్లల్లో ఉండే జీవాలు చస్తాయి, 2. నీళ్లు పెట్టేచోట కుండ (బిందె) ఇటూ అటూ జరపటం వల్ల జీవాలు మరణిస్తాయి, 3. ఇల్లు తుడిచేటప్పుడు, 4. తిరగలిలో ధాన్యం విసిరేటప్పుడు, 5. రోట్లో బియ్యము మొదలైనవి దంచేటప్పుడు జీవరాసులు మరణిస్తాయి. ఈ హింసలనుండి విముక్తి కోసం గృహస్థు ప్రతిదినము బలి వైశ్వదేవములను, పంచమహాయజ్ఞాలు చెయ్యాలి. సర్వవిధాలా భగవంతుని శరణుజొచ్చిన వాడికి ఈ హింసచే పాపము తగలదు. అతడు సంపూర్ణంగా పాప విముక్తుడౌతాడు.

ప్రశ్న: మనం తిరుగలితో విసురకున్న ,ధాన్యం దంచకున్నచో మనకా హింస ఉండదా?

సమాధానము: మీరు పట్టినపిండీ, దంచినధాన్యం ఉపయోగిస్తున్నారు కాబట్టి ఆ పిండి పట్టటంలోనూ, ధాన్యం దంచడంలోనూ

ఉన్న హింస మీకు తగులుతుంది.

ప్రశ్న: సేద్యంలో అనేక జీవుల్ని హింసించటం జరుగుతుంది అయితే మరి రైతు సేద్యము చేయరాదా?

సమాధానము: సేద్యం చేసితీరాలి. కాని హింస జరగకుండా ఉండాలనే ఉద్దేశ్యంపెట్టుకొని చెయ్యాలి. రైతు వృత్తి వ్యవసాయము కనుక అతనికి తక్కువ పాపం కలుగుతుంది. అతడు పాపానికి భయపడి కర్తవ్యత్యాగం చేయకూడదు. వీలయినంత వరకు హింస జరగకుండా జాగ్రత్తపడవలసిన అవసరం ఉంది.

ప్రశ్న: ఈ రోజుల్లో రైతులు పంట రక్షించుకోవటానికి విషమయమైన మందులు చల్లుతున్నారు. మరి యిది మంచిదేనా?

సమాధానము: రైతు ఈ పని ఎప్పుడూ చేయకూడదు. పూర్వము ఈ రకమైన హింస చేసేవారు కాదు, కనుక ధాన్యం చవకగా లభించేది. ఇప్పుడు హింస చేస్తున్నారు కనుకనే ధాన్యము ధర ఎక్కువవుతుంది. చూడటానికి పురుగుల్ని చంపటంవల్లనే ధాన్యం దిగుబడి ఎక్కువవుతున్నట్లు కనిపిస్తుంది. కాని, దీని పరిణామం మంచిదికాదు.

ప్రశ్న: శాస్త్రాలలో గృహస్థుమీద అయిదు ఋణాలు చెప్పబడ్డాయి. పితృఋణం, దేవఋణం, ఋషిఋణం, భూతఋణం, మనుష్యఋణం, వీటిలో పితృఋణం ఏమిటి? దానినుంచి విముక్తికి ఉపాయమేమిటి?

సమాధానము: పితృ, పితామహా, ప్రపితామహులు, మాతృ, మాతామహీ, ప్రమాతామహీ, పితామహీ, ప్రపితామహులు మొదలైన వారు మృతులైనపిదప చేసేకార్యాలన్నీ ప్రేతకార్యాలు. పరంపరగా చేసే శ్రాద్ధతర్పణాలూ పిండోదక దానాలు అనే పితరుల నుద్దేశించి చేసేకార్యాలన్నీ పితృకార్యాలు. మరణించిన తరువాత ప్రాణి, దేవ, మనుష్య, పశు, పక్షి, భూతప్రేతాది వృక్షలతాది యోనులలో వేటిలోకైనా పోతే వానికి పితృ సంజ్ఞవస్తుంది. అంటే వారిని పితరులంటారు.

మాతాపితరుల శుక్రశోణితాలతో శరీరం తయారవుతుంది. తల్లి

పాలతోటి తండ్రి సంపాదించిపెట్టిన అన్నంతోటి శరీరపోషణ జరుగుతుంది. తండ్రి ధనముతో చదువు మరియు యోగ్యత లభిస్తాయి. తల్లిదండ్రుల ప్రయత్నం వలన వివాహమవుతుంది. ఇలా కొడుకుమీద తల్లిదండ్రుల, తల్లిదండ్రులమీద తాతా నాయనమ్మలు, వారిమీద వారి తల్లిదండ్రుల ఋణం ఉంటుంది. పరంపరగా ఉండే ఈ పితౄణం నుంచి ముక్తి పొందటానికీ, పితరులకు సద్గతి కల్పించటానికి వారిపేరుతో పిండప్రదానతర్పణాదులు చేయవలెను. శ్రాద్ధతర్పణాలు నిర్వహించాలి.

పుత్రుడు తాను బ్రతికున్నంతకాలం మాతాపిత్రాదుల పేర్లతో పిండప్రదానతర్పణాదులు చేస్తాడు. కాని, తరువాత పిండప్రదానం చెయ్యటానికి సంతానోత్పత్తి చేయకపోతే అతడు పితౄణమునుండి విముక్తుడు కాడు. అంటే అతని మీద పితృదేవతల ఋణం ఉండి పోతుందన్నమాట. కాని సంతతి ఉత్పన్నమైన మీదట అతనిపై పితౄణముండదు. ఉండకపోగా ఆ పితౄణం సంతానం మీద వచ్చిపడుతుంది. పితరులు పిండాలు, తిలోదకాలు కోరుతారు. కనుక అవి లభిస్తే వారు సుఖంగా ఉంటారు. లభించకపోతే దుఃఖితులవుతారు. పుత్రునికి సంతానం లేకపోతే ఇక ముందెవరు పిండోదకాలిచ్చేవారని (ఇస్తారని) దుఃఖితులవుతారు.

ప్రశ్న: పితృదేవతల పేరుతో ఇచ్చేది వారికి చేరుతుందా?

సమాధానము: పితరుల పేరిట ఇచ్చేదేదైనా అదంతా వారికే లభిస్తుంది. వారు ఏ యోనిలోనైనా ఉందురుగాక వారి పేరిట ఇచ్చే పిండోదకాలు వారికి ఆ పుట్టుకకు తగిన పదార్థరూపంలో తినదగినత్రాగదగినవై లభిస్తాయి. ఏ విధంగా అంటే పితరులు పశుజన్మలో ఉన్నప్పుడు వారిపేరిట ఇచ్చింది అన్నమైనా వారికి గడ్డిగా తయారయి అందుతుంది. అలాగే వారు దేవయోనిలో ఉంటే అమృతమై వారికందుతుంది. అంటే ఎటువంటి పదార్థం వారికి ఉపయోగకారకమౌతుందో అటువంటి పదార్థమే వారికి చేరుతుందన్నమాట. ఇక్కడ నుంచి మనం అమెరికాలో ఉన్న వాడికి పంపే M.O. రూపాయలు అక్కడివాడికెలా అయితే డాలరు రూపంలో అందుతాయో అలాగే మనం

మన పితరులపేరిట ఇచ్చే పిండోదకాలు, దానధర్మాలు వారే యోనిలో జన్మించియుంటే దానికనువైన ఆహారపానీయాల రూపంలో ఆ పితరుల కందుతాయి.

నేడు మనకి గొప్ప ఆదరంతో అన్నవస్త్రాదులు లభిస్తున్నాయంటే అది మన పూర్వజన్మ కృత పుణ్యాలఫలము కూడా కావచ్చు. మన పూర్వజన్మకు చెందిన పుత్రపౌత్రాదులు చేసిన శ్రాద్ధతర్పణ ఫలితము కావచ్చు లేక ప్రారబ్ధమే కావచ్చు.

ఒకానొకడు బ్యాంకులో ఒక లక్షరూపాయలు జమ (డిపాజిట్) చేసి ఉంటాడు. దానిలోంచి అతడు కొంత తన పేరిట, కొంత భార్యపేర, మరికొంత కొడుకుపేర జమ చేసి ఉంటాడనుకుందాము. కాని అతడు తన పేర జమ చేసిన డబ్బు మాత్రమే తీసుకోగలుగుతాడు తన భార్య పుత్రుల పేర్ల మీద జమచేసింది అతడు తీసుకోవటానికి వీలులేదు. ఆ డబ్బు అతని భార్యకీ పుత్రుడికే లభిస్తుంది. అలాగే పితరుల పేర చేసిన పిండోదకాలు పితరులకే లభిస్తాయి. వేరొకరికి కావు. మనం జీవించి ఉండగా గయవెళ్లి మన పేరిట పిండోదకాలు ఇస్తే మరణించిన తరువాత అది మనకే లభిస్తుంది. గయలో అయినా పశుపక్ష్యాదులపేర పెట్టిన పిండోదకాలు కూడ వాటికే చెందుతాయి. ఒక సజ్జనునికి తన ఇంటనుండే ఆవుపట్ల ఎంతో వాత్సల్యముండేది. ఆ ఆవు మరణించి అతనికి కలలో దుఃఖంగా కనిపించింది. అతడు గయవెళ్లి ఆ ఆవుపేర పిండప్రదానం చేశాడు. మళ్లీ స్వప్నంలో ఆవును చూచినపుడది చాలా ఆనందముగా నున్నది.

మనం సంపాదించిన, మన దగ్గరున్న ధనంమీద మన కధికారమున్నట్లు మన దగ్గరున్నప్పటికీ మన తండ్రితాతలు సంపాదించిన ధనంమీద మనకంత అధికారములేదు. వంశ పారంపర్యంగా తండ్రి, తాత మొదలైన వారి ఆస్తిమీద వారి పుత్రులకీ, పౌత్రులకీ అధికారమున్నట్లే పితృదేవతలు వంశ పరంపరానుసారంగా పుత్రపౌత్రులిచ్చిన పిండోదకాలు పొందుతారు. కనుక పుత్రపౌత్రులకు, తండ్రి తాతలకు పిండప్రదానం చేసే బాధ్యత ఉంది.

పితృలోకమనేది ఒకటుంది, కాని నియమపూర్వకంగా అందరూ మరణించిన తరువాత ఆ లోకానికే వెడతారని చెప్పలేము. కారణమేమిటంటే తమతమ కర్మలననుసరించే అందరిగతీ ఉంటుంది.

**ప్రశ్న: ఎవరి తల్లిదండ్రులైన ముక్తులైనపిదప భగవత్సాన్నిధ్యానికి వెళ్ళి ఉంటే వారికి పెట్టే పిండోదకాల సంగతేమిటి?**

సమాధానము: తల్లిదండ్రులు మోక్షం పొందారని కొడుక్కితెలియదు. కాని, అతడు వారిపేరుతో భక్తితో చేసే పిండప్రదానం, పుణ్యదానకార్యాలూ ఆ సమస్తమూ అతని పేరిటనే జమఅవుతాయి. మరణించిన తరువాత అతనికే లభిస్తుంది. ఎవరి పేరనైనా మనం బొంబాయికి డబ్బు పంపామనుకోండి కాని ఆ వ్యక్తి అక్కడ లేకపోతే అది తిరిగి మనకు వచ్చినట్లే ఇదీనూ.

**ప్రశ్న: సంతానం కలగక పోయినా మనిషి పితృఋణవిముక్తి పొందగలడా?**

సమాధానము: పొందుతాడు. భగవంతుణ్ణి సర్వవిధాలా శరణుజొచ్చిన వాడికే ఋణమూ ఉండదు.

**దేవర్షిభూతాప్తనృణాం పితౄణాం న కింకరో నాయమృణీ చ రాజన్ ।**
**సర్వాత్మనా యః శరణం శరణ్యం గతో ముకుందం పరిహృత్య కర్తమ్ ॥**

(శ్రీమద్భాగ. 11-5-41)

రాజా! ఎవరు సర్వకార్యములూ విడిచిపెట్టి సంపూర్ణంగా శరణాగతవత్సలుడైన భగవంతుని శరణు పొందుతారో వారు దేవ, ఋషి, ప్రాణి, కుటుంబజన, పితృగణాదులలో ఎవరికీ ఋణపడటంగాని సేవకులగుటగాని జరగదు.

**ప్రశ్న: దేవఋణమేమిటి? దానినుంచి విముక్తి పొందే ఉపాయమేమిటి?**

సమాధానము: వర్షం వస్తుంది. నేల వేడెక్కుతుంది. గాలివీస్తుంది.

భూమి అన్నిటినీ భరిస్తుంది. రాత్రి చంద్రుడు, పగలు సూర్యుడూ వెలుతురునిస్తారు. దానివల్ల అందరి జీవననిర్వహణం జరుగుతుంది. ఇదంతా మన మీద దేవఋణం. హోమం, యజ్ఞం చేయటం వల్ల దేవతలకి పుష్టి కలుగుతుంది. వాని నిర్వహణం వలన మనం దేవఋణ విముక్తులమవుతాం.

ప్రశ్న: ఋషి ఋణమేమిటి? దానినుంచి విముక్తి పొందే ఉపాయమేమిటి?

సమాధానము: ఋషులు, మునులు, సాధువులు, మహాత్ములు రచించిన గ్రంథాలు, చెప్పిన స్మృతులు మనకి వెలుతురు (జ్ఞానం)నిస్తున్నాయి. విద్య లభిస్తోంది. కర్తవ్యాకర్తవ్య పరిజ్ఞానం కలుగుతోంది. అందువల్ల మనం వారికి ఋణపడి ఉంటున్నాం. వారి గ్రంథాలు చదవటం, అధ్యయనం, పఠనపాఠనాదులు చేయటం వల్ల సంధ్యావందన గాయత్రీజపాదులు చేయటం ద్వారా మనం ఋషి ఋణం నుంచి విముక్తులమవుతాం.

ప్రశ్న: భూతఋణ మేమిటి? దానినుంచి విముక్తి పొందే ఉపాయమేమిటి?

సమాధానము: ఆవు – గేదె, గొఱ్ఱె – మేక, ఒంటె – గుఱ్ఱం మొదలైన ప్రాణులద్వారా మనం మనపనులు నెరవేర్చుకొంటున్నాం. మన జీవనం కొనసాగిస్తున్నాము. వృక్షలతాదుల వల్ల మనం ఫలములు, పుష్పములు మొదలైనవి అనుభవిస్తున్నాము. ఇది మనమీద పడిన ఇతరప్రాణుల ఋణం. పశుపక్ష్యాదులకు గడ్డి, అన్నం, మొదలైనవి పెట్టడం ద్వారాను, వృక్షములకు నీరునివ్వడంద్వారాను, ఆహారమివ్వడం ద్వారా మనము ఈ భూతఋణము నుండి విముక్తులం కాగలము.

ప్రశ్న: మనుష్య ఋణము అంటే ఏమిటి? మనము దానినుండి విముక్తి పొందటమెలా?

సమాధానము: ఇతరుల సహాయ–సహకారములు లేనిదే మన జీవనము సాగదు. మనం ఇతరులచే నీరును పొందవలసిరావచ్చు.

ఇతరులు నాటిన మొక్కలను, చెట్లను ఉపయోగించుకొంటున్నాము. ఇతరుల దారిని మనముపయోగించవచ్చు. ఇతరులచే పండించబడిన ధాన్యము కానీ, ఇతరులచేత తయారుకాబడిన అన్నాది ఆహారపదార్థములు మనముపయోగించడం జరుగుతుంది. ఇవన్నీ ఇతరుల యెడ మనం ఋణగ్రస్తులం కావడానికి దోహదం చేస్తాయి. ఇతరుల సుఖసౌకర్యార్థం నూతిత్రవ్వించటం, పంపులు వేయించటం, తోటలు వేయించటం, రోడ్లు వేయించటం, చలిపందిరులు, ధర్మసత్రాలు కట్టించటం, అన్నక్షేత్రాలు, సత్రాలు నడపటం మొదలైన వాటివల్ల మనం మనుష్యఋణం నుండి విముక్తులం కాగలుగుతాము.

పితృఋణం, దేవఋణం, ఋషిఋణం, భూతఋణం మనుష్యఋణం ఈ అయిదు ఋణాలూ గృహస్థుమీద (వ్యాపించి) ఉంటాయి. సదా భగవంతుని శరణుపొందినవాడు పితృ, దేవతాదులెవరికీ ఋణపడి ఉండడు. అన్ని ఋణాల నుంచి విముక్తి పొందుతాడు.

ప్రశ్న: సంతానమేమి లేకపోతే తమ సంబంధీకులనెవరినైనా గాని అనాథబాల బాలికలను గాని పెంచుకోవాలా? అక్కరలేదా?

సమాధానము: ఈ కాలంలో బిడ్డలను పెంచుకోకపోవటమే మంచిది. ఎందుకంటే తనకు పుట్టిన బిడ్డే తనకు సేవచేయటంలేదు, మాటవినటంలేదు. అటువంటప్పుడు పెంచుకొన్నపిల్లవాడేం సేవచేస్తాడు? పోనీ పిండప్రదానాదులు చేయటానికని పెంచుకొనే విధానమున్నప్పటికి వాడా పిండప్రదానాదులు నిర్వహించనప్పుడు పెంచుకోవటం దేనికి? మనకి పిల్లవాడి అవసరమే ఉంటే భగవంతుడే ఇచ్చి ఉండేవాడు. మనకి పిల్లవాడి అవసరం లేదు. కాబట్టి భగవంతుడివ్వలేదు. కనుక మనం పెంచుకొని మనకి మనం ఆపద ఎందుకు తెచ్చిపెట్టుకోవాలి? సాధారణంగా పెంచుకొన్న పిల్లలు తల్లిదండ్రులకు దుఃఖమే కలిగిస్తూ ఉండటం కనిపిస్తోంది. వారికి సేవ చేయటంలేదు. అందుచే పెంచుకోకపోవడమే మంచిది. కాని మానవతా ధర్మంగా అనాథ బాలికలను చదివించాలి. వారిసేవ చేయాలి. వారి శరీరనిర్వహణానికి కావలసిన ఏర్పాటు చెయ్యాలి.

ప్రశ్న: పుత్రులు లేకపోతే ముసలితనంలో మనసేవ ఎవరు చేస్తారు?

సమాధానము: పిల్లలున్న తల్లిదండ్రులకు మాత్రం ఆ పిల్లలు సేవచేస్తున్నారా? ఇప్పటి పిల్లలు తల్లిదండ్రుల "ధన సంపత్తి"కే తాము వారసులం అనుకొంటున్నారు. శ్రాద్ధతర్పణం వ్యర్థం దండగ అనుకొంటున్నారంటే ఇలాంటి పిల్లలు సేవచేస్తారా? వాళ్లు కేవలం దుఃఖం కలిగించేవాళ్లే అవుతున్నారు. నిజానికి ప్రారబ్ధంవల్ల ఎటువంటి సేవ జరగాల్సివుందో ఎంతటి సుఖశాంతులు లభించాలో అవి లభించనే లభిస్తాయి. పుత్రుడుండనీ లేకపోనీ విరక్తులైన సాధువులకెంతటి సేవ జరుగుతుందో అంతటి సేవ గృహస్థుల పిల్లలు చేయకపోవటం మనం ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాం. ఇంతకీ పిల్లవాడుంటేనే సేవ జరుగుతుందనే మాటలేదు.

ప్రశ్న: పుత్రుడు లేకపోతే మరణించాక మనకి పిండప్రదానం ఎవరు చేస్తారు? అదిలేక పోతే మన గతి ఏమవుతుంది?

సమాధానము: పిండోదకదానంవల్ల దానిని గ్రహించినవారికి ముందు ముందు జనన మరణాలు కొనసాగుతాయి. బాటసారి ఆకలిదప్పికల కారణంగా ఎక్కడో ఆగినా అన్నోదకాలు దొరికిన తరువాత మళ్ళీ తనదారిన ప్రయాణిస్తున్నట్లే ప్రేతాత్మలకు (మృతాత్మలకు) పిండోదకాలు లభింపకపోతే ఒకచోట ఆగిపోవటం, అవి లభిస్తే అక్కడనుంచి నడవటం జరుగుతుంది అంటే వారి పురోగమనం ముందుగ ప్రారంభమవుతుంది. వారి జనన మరణక్రమం కొనసాగుతుంది. అంతేకాని వారికి ముక్తి శుభం జరగవు.

నిజానికి మోక్షప్రాప్తి లభించటం, శుభం జరగటం సంతానం చేతుల్లో కించిత్తుకూడలేదు. ముక్తి సంతానపుటాధీనంలోనే ఉంటే ముక్తి పరాధీనమైనదన్నమాట. మరి మనుష్యజన్మకి స్వాతంత్ర్యం ఎక్కడుంది. కళ్యాణం (మేలు = శుభం)లోను మోక్షంలోను శరీరాసక్తే బాధాకరమైనప్పుడు మరి మరణానంతరం కూడ పుత్రుడివల్ల పిండోదకాలాశించటం శుభమెలాకలిగిస్తుంది? అది బంధనంలోనే

పదేస్తుంది. అందువల్ల తన క్షేమం కోరేవాడు పుత్రేచ్ఛ లోకైషణ (లోకంలో ఆదరసత్కారాలు మాన మర్యాదలు కోరటం), ధనేచ్ఛ ఈ మూడింటినీ త్యాగంచేయాలి. ఎందుచేతనంటే ఈ మూడే పరమాత్మప్రాప్తికి బాధకాలు.

సంతతికావాలనీ పిండోదకాలు కావాలనీ కోరుకొనేవాడు జననమరణ చక్రంలోపడి ఉండాలనుకొంటున్నాడన్నమాట. ఎందుచేతనంటే ఎక్కడో జన్మ లభిస్తుంది. అక్కడ పిండోదకాలు కోరతాడు. జన్మేలేకపోతే పిండోదకాలెవరికి కావాలి?

పుత్రుడు లేకపోతే మేలు కలగదనుకోవటం బొత్తిగా తప్పు. సంతానం కలగటం వల్లనే మంచి కలిగితే పందికి పదకొండు, పాముకి నూటెనిమిది పిల్లలు పుడుతున్నాయి. వాటికి మేలు జరిగితీరాలి. ఇలాగే బహుసంతానవంతులకి శుభం శీఘ్రంగా జరగాలి కాని అది జరగటం లేదు.

సంతానంకలిగినా, లేకపోయినా మానవుని మనస్సు కేవలం భగవంతునియందే లగ్నమై యుండాలి. భగవత్పరాయణుడై భగవద్భజన చెయ్యాలి. పుత్రేచ్ఛ నశించకపోతే సంతానహీనుడు బాలరాముణ్ణి, బాలకృష్ణుణ్ణి తన పుత్రుడిగా భావించి వారిమీద తన వాత్సల్యంపెంచుకోవాలి. ఆ పుత్రుడు (భగవంతుడు) చేసేసేవ కన్నబిడ్డ చెయ్యనే లేడు. ఆ పుత్రుడిహ పరకార్యాలన్నీ చేసిపెడతాడు.

**ప్రశ్న: గార్హస్థ్యంలో పిల్లలపెంపకం, పోషణ, వివాహాదులు మొదలుకొని అనేక చింతలుంటాయి. ఆ చింతలనుంచి బయట పడటమెలాగ?**

సమాధానము: ప్రతిప్రాణీ తన ప్రారబ్ధానికనుగుణంగానే జన్మిస్తాడు. ప్రారబ్ధంలో మూడు విషయాలున్నాయి. 1. జన్మ, 2. ఆయుర్దాయము 3. భోగం. * ఈ మూడింటిలోనూ ప్రాణికి జన్మ అయితే జరిగింది. ఆ ప్రాణికి

---

***"సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః"** (యోగదర్శనం 2-13)

పరిస్థితులు కలగటం భోగం. నిజానికి పరిస్థితి ఎవరినీ సుఖవంతుణ్ణిగాని, ఎంత ఆయువుంటే అంతవరకు అది జీవిస్తుంది. ఇక అనుకూల ప్రతికూల దుఃఖితుణ్ణిగాని చెయ్యదు. కాకపోగా మానవుడే అజ్ఞానంవల్ల, పరిస్థితిచేత సుఖిగాని దుఃఖిగాని అవుతుంటాడు. కన్య పెద్దదయితే ఆ పరిస్థితుల్లో దాని వివాహాన్ని గురించి చింతించకూడదు. ఎందుచేతనంటే కన్య తన ప్రారబ్ధం తెచ్చుకొనే పుట్టింది. కనుక ఆమెకనుకూల పరిస్థితిగాని, ప్రతికూల పరిస్థితిగాని ఆమె ప్రారబ్ధానుసారమే లభిస్తుంది. తల్లిదండ్రులామె వివాహవిషయంలో ఆలోచించవలసిందల్లా తమ పిల్ల సుఖంగా ఉండే చోటికివ్వటం (అటువంటి యింటికి పంపటం) ఇటువంటి ఆలోచన తల్లిదండ్రుల కర్తవ్యం. అంతేకాని మనం దాన్ని సుఖవంతురాలినే చేస్తాం. ఆమెకు మంచి కుటుంబం లభించి తీరుతుందనుకోవటం వారి చేతిలో పనికాదు. కనుక కర్తవ్యపాలనం జరగాల్సిందే కాని చింతించకూడదు.

చింత వేరు ఆలోచన వేరు. చింత అనేది అజ్ఞానం (మూర్ఖత) నుంచి పుడుతుంది. దానివల్ల అంతఃకరణం కలుషితమౌతుంది. క్రొత్త వికాసం కలగదు. కాని విచారణ (ఆలోచన) వల్ల బుద్ధివికాసం కలుగుతుంది. కాబట్టి ప్రతిపని ఎలా చెయ్యాలి? ఏ రీతిగా నిర్వహించాలి? అనే ఇలాంటి ఆలోచన మాత్రం చెయ్యాల్సిందే. కాని, ఎప్పుడూ చింతించరాదు. (దిగులుపడరాదు) చింతలేకుండా ఆలోచిస్తే ఏదో ఒక ఉపాయం తప్పక లభిస్తుంది.

ప్రశ్న: వార్ధక్యంలో పిల్లలు సేవ చెయ్యకపోతే ఏంచెయ్యాలి?

సమాధానము: పిల్లలమీద మమకారం తొలగించుకోవాలి. వీళ్లు మనపిల్లలు కారనుకోవాలి. ఎవడూ సేవచేయక (చూడక) పోతే ఇటువంటి అవస్థలో కుటుంబీకులవల్ల సుఖసౌకర్యాలు పొందాలని ఆశపడటం దుఃఖదాయక మవుతుంది. **"ఆశా** హి పరమం దుఃఖం, నైరాశ్యం పరమం **సుఖమ్" కనుక ఆ ఆశనే త్యజించాలి (విడిచిపెట్టాలి) ఇట్టి అసౌకర్యంలో "తపో** భావన" చెయ్యాలి. ఏమని? "భగవంతుని గొప్పదయవల్ల మనకి స్వయంగా తపస్సు చేసుకొనే అవకాశం లభించింది. కుటుంబంలో వారే మనకి ఉపచారాలు చెయ్యటం జరుగుతుంటే మనం వారి మోహ

మమకారాల్లో చిక్కుకుపోయేవాళ్లం, భగవంతుడనుగ్రహించి మనల్ని అలాచిక్కుకు పోనియ్యలేదు". అని

మానవుడు మోహ మమకారాల్లో చిక్కుకుపోవటమే అతని ఆధ్యాత్మికోన్నతికి బాధాకరం. ఆ బాధను తొలగించినవాడు చేసినది ఉపకారమే. వీరు మనని బాధారహితుల్ని చేస్తున్నారనుకోవాలి. మనకి మేలుచేస్తున్నారు వారికి మన మీద చాలా గొప్పదయ ఉందని భావించాలి.

జీవితమంతా ఉపచారాలు చేయించుకోవటానికలవాటు పడితే ముసలితనంలో అసమర్థతచే కుటుంబసభ్యుల చేత పరిచర్యలు చేయించుకోవాలనే కోరిక ఎక్కువవుతుంది, కనుక మానవుడు మొదటినుంచి జాగ్రత్తగా ఉండాలి. "నేను చేయించుకోవటాని కిక్కడికి రాలేదు అందరికి సేవ చేయటాని కిక్కడికి వచ్చాను" అనుకోవాలి. ఎందుచేతనంటే మానవ, దేవ, ఋషి, ముని, పితృ, పశు, పక్షి, భగవదాదులందరికి సేవ చేయటానికే మనుష్య శరీరం ఉంది. కాబట్టి ఎవరివల్ల కూడా మనకి సుఖం, సౌకర్యం కలగాలని ఆశించకూడదు. మొదటినుంచి మనం ఎవరివలనా సుఖాలు, సౌకర్యాలు ఆశించకుండా ఉంటే ముసలితనంలో అవి లేకపోయినా దుఃఖం కలగదు. అవును మన మనస్సులో సేవా స్వీకారవాంఛ లేకపోవటంతో ఇతరుల మనస్సుల్లో మనకి సేవచెయ్యాలనే కోరిక జాగృతమవుతుంది.

ప్రతిరంగంలోను త్యాగముయొక్క అవసరం ఉంటుంది. త్యాగంవల్ల వెంటనే పరమ శాంతి లభిస్తుంది. ప్రతికూల పరిస్థితి వచ్చినప్పుడు కూడ ప్రసన్నంగా ఉండటం చాల గొప్ప తపస్సు. తపస్సువల్ల అంతఃకరణశుద్ధి యేర్పడుతుంది. సుఖసౌకర్యాలవల్ల అదిరాదు. సుఖశాంతులు కోరుకోవటంతో అంతఃకరణం కలుషితమవుతుంది. కాబట్టి మానవుడు సుఖం కోరకపోవటమే కాక తాను త్రికరణశుద్ధిగా మనసా, వాచా, కర్మణా ఇతరులకు సుఖం కలిగించాలి.

**ప్రశ్న: కుటుంబములో ఎవరైనా మృతిచెందితే మృతాత్మకి శాంతి**

కలిగించేందుకు, మన శోకం దూరం చేసుకొనేందుకు ఏం చెయ్యాలి?

సమాధానము: 1. ప్రేతాత్మకి యథావిధిగా నారాయణబలి శ్రాద్ధతర్పణాదులు చెయ్యాలి. 2. అతను గుర్తుకువచ్చినప్పుడల్లా అతన్ని భగవచ్చరణాల్లో దర్శించాలి. 3. అతనికోసం గీతాపఠనం భాగవతసప్తాహం, శ్రీరామచరితమానస్ (తులసీదాసు రామాయణం) యొక్క నవాహ్నపారాయణం, నామజపం, కీర్తనం మొదలైనవి చెయ్యాలి. 4. అతని కోసం పేదపిల్లలకి మిఠాయిలు పంచిపెట్టాలి. తీయటి పదార్థాలు లభిస్తే పిల్లలు సంతోషిస్తారు. వారు సంతోషిస్తే మరణించినవారి ఆత్మకు శాంతి కలుగుతుంది. మనకూ తృప్తి కలుగుతుంది.

సత్సంగం, హరికథలు, భజనలు, దేవాలయాలు, పుణ్యతీర్థాలు మొదలైనవాటికి వెళ్లి ఆ శోకాన్ని దూరం చేసుకోవడానికి ప్రయత్నించాలి. అంతే కాకుండా అటువంటి చోటికి తప్పకుండా వెళ్లాలి. వీటిలో కూడ సత్సంగానికి విశేషమైన మహిముంది. ఎందుచేతనంటే సత్సంగంవల్ల అన్ని విధాలైన శోకాలు దూరమవుతాయి.

## 2. ప్రవర్తన

ప్రశ్న: కుటుంబంలో పెద్దవాళ్లయెడ ఎలా మెలగాలి?

సమాధానము: పెద్దలకు సుఖ విశ్రాంతులు కలిగించటం, వారిని సేవించటం, వారికి పెద్దరికం ఇచ్చి గౌరవించటం, వారి ఆజ్ఞపాలించటం (చెప్పిన మాటవినటం), వారి అదుపులో మెలగటం, ఇది చిన్న వాళ్ల కర్తవ్యం. కాని, పెద్దవాళ్లు వారికివారే "మనం పెద్దవాళ్లం పూజనీయులం, ఆదరణీయులం" అనుకోరాదు.

ఈ రకమైన భావంతో ఉండటంవల్ల ఇతరుల హృదయంలో వారిని గూర్చిన గౌరవభావం తగ్గిపోతుంది. కాలక్రమేణ వారిమీద నిరాదరణ కలగటం మొదలవుతుంది. కాబట్టి పెద్దల భావాలు అందరినీ పెంచి పోషించాలనీ, కష్టం సహించాలనీ, చిన్న వారికి సౌకర్యాలు కలిగించాలని ఉండాలి. పిన్నలకు పెద్దలకు ఇటువంటి భావాలుండటం వల్ల, సంపూర్ణ

కుటుంబము, సమాజము కూడ సుఖంగా ఉంటుంది.

ప్రశ్న: వితంతువులయెడ అత్తమామలు, తల్లిదండ్రులు మొదలైన వారి ప్రవర్తన ఎలా ఉండాలి?

సమాధానము: కోడలుగాని, కూతురుగాని వితంతువైతే అత్తమామలు, తల్లిదండ్రులు మొదలైనవారు వారిని హృదయపూర్వకంగా ఆదరించి వారికి రక్షణ కల్పించాలి. ఆమె హితమును కోరుతూ, దుఃఖాన్ని దూరంచేసి, ప్రవర్తనలోపం కాకుండా ఉండేలా చూసుకోవాలి.

కోడలుగాని, కూతురుగాని వితంతువైతే అత్తగారు, తల్లి తమ జీవనం నిరాడంబరంగా గడపాలి. భోజనాదులు, నగలు, బట్టలు భోగబుద్ధితో సేవించకుండా జీవనం సాగించటానికి మాత్రమే ఉపయోగించాలి. ఈ విధముగా ఆచరించటంవలన కోడలిలోగాని కూతురిలోగాని సంస్కారం ఏర్పడుతుంది. కారణమేమిటంటే తల్లి, అత్తగారు భోగాలనుభవిస్తూ ఉంటే వాటి ప్రభావం ఆమె మీద పడుతుంది. అత్తగారు, తల్లి నిగ్రహంతో ఉంటే వారి ప్రభావం కోడలిమీద లేదా కూతురుమీద బాగా పడుతుంది. "ఈ వయస్సులోనే మనం నిగ్రహం పాటించకపోతే ఇంకెప్పుడు మనమలా ఉండగలం?" అని ఆలోచించుకోవాలి. ప్రపంచంలో ఇంద్రియనిగ్రహం కలవాడు త్యాగి అయిన వారిదే మహిమ. భోగి కూడబెట్టినవాడు అయిన వాళ్లదేమీ గొప్పదనంలేదు.

ప్రశ్న: వితంతువు విషయంలో సోదరులు, వారి భార్యలు ఎలా ప్రవర్తించాలి?

సమాధానము: సోదరులు, వారి భార్యలు వితంతువుని హృదయపూర్వకంగా ఆదరించాలి. తిరస్కారభావం చూపకూడదు. ఆమె నడవడిని భావములను రక్షించాలి. ఆమె యెడల ఆదరభావంతో మెలగాలి. ఆమె మేలుకోరి ఆమె మీద అధికారము, ప్రేమ రెండూ చూపాలి.

ప్రశ్న: తల్లిదండ్రులు కూతురి యింట అన్నం తినవచ్చా? కూడదా?

సమాధానము: తల్లిదండ్రులు కన్యాదానం చేశారంటే ఆ

యింటికామె యజమానురాలవుతుంది. అప్పుడు తల్లిదండ్రులకి ఆమె యింటి అన్నంతినే అధికారంలేదు. దానంచేసిన వస్తువుమీద దాతకు అధికారం ఉండదు. మేమొక కథవిన్నాం. "బరసానా" అనే గ్రామానికి చెందిన ఒక చెప్పులు కుట్టేవాడు ఉదయం ఏదో పనిమీద "నందగాం" అనే గ్రామానికి వెళ్లాడు. అక్కడే మధ్యాహ్నమై పోయింది ఏమీ తినలేదు. దాహమయినది కాని, కూతురి ఊరి నీళ్లెలా తాగటం?* ఎందుచేతనంటే మా "వృషభానుజీ" ఇక్కడికి కన్యనిచ్చాడు, అని ఆలోచించి అతడక్కడి నీళ్లు త్రాగలేదు. "బరసానా"కు తిరిగి బయలుదేరాడు. నడుస్తూ నడుస్తూ అతడు దప్పికవల్ల దారిలో పడిపోయాడు. అప్పుడు రాధ(దేవి) ఆ చర్మకారుడి కూతురి రూపం ధరించి అతని దగ్గరికి వచ్చి నాన్నా! నేను నీకోసం నీళ్లు తెచ్చాను, త్రాగు అన్నది. చర్మకారుడు అమ్మాయీ! ఇప్పుడింకా నేను "నందగాం" పరిహద్దులో ఉన్నాను. కనుక నేనిక్కడి నీరు త్రాగలేను. రాధ అంది "నాన్నా! నేను బరసానా నీళ్లు తెచ్చాను" అని. అతడానీరు త్రాగాడు. అమ్మా! నువ్వునడు, నేనువస్తున్నా" నన్నాడు. రాధ వెళ్లిపోయింది. చర్మకారుడు తనయిల్లు చేరి తనకూతుర్ని ఒళ్లో కూర్చోబెట్టుకొని అమ్మా! నీవు మంచినీళ్లిచ్చి నా ప్రాణాలు కాపాడావు నీవు నీళ్లు తీసుకొనిరాకపోతే నా ప్రాణాలు పోయేవన్నాడు. నాన్నా! నేను నీళ్లు తీసుకొనిరానేలేదం దతని కూతురు. అప్పుడు చర్మకారుడు రాధాదేవియే నా కూతురిరూపంలో వచ్చి నాకు నీళ్లిచ్చిందనుకొన్నాడు. దీన్ని బట్టి పూర్వీకులు తమ కూతురి ఊరికిచెందిన అన్నపానాలు కూడ తీసుకొనే వారు కాదని తెలుస్తోంది.

కూతురికి సంతానం కలిగేవరకు ఆమె యింటి అన్నమూ నీరు తీసుకోకూడదు. కూతురికి సంతానం కలిగితే తల్లిదండ్రులు కూతురియింట అన్నపానీయాలు స్వీకరించవచ్చును. కారణమేమిటంటే అల్లుడు కేవలం పితృఋణంనుంచి ముక్తుడవటానికే ఇతరుని కన్యను స్వీకరించాడు. దానివల్ల సంతానం కలిగితే అల్లుడు పితృఋణం నుంచి విముక్తుడవుతాడు. కనుక తల్లిదండ్రులకు కూతురి మీద అధికారం వస్తుంది. అందుచేతనే దౌహిత్రుడు

---

*బరసానా గ్రామప్రజలు రాధాజీని (రాధాదేవి) తమ కన్యగా భావిస్తారు.

(కూతురికొడుకు) తన మాతామహీ మాతామహుల (తల్లి యొక్క తల్లిదండ్రుల) శ్రాద్ధతర్పణాలు చేస్తాడు. వారు దౌహిత్రుడు పెట్టిన శ్రాద్ధ తర్పణ పిండోదకాలు స్వీకరిస్తారుకూడ. సంతానం కలిగితే కన్యాదానం సఫలమవుతుంది కనుక. కూతురి సంతానం కూతురైె కొడుకు కాకపోతేకూడ వాళ్లయింటి అన్నపానాలు స్వీకరించవచ్చు.

ప్రశ్న: మాతాపితరులు, కొడుకులు, కూతుళ్లు పరస్పరం ఎలా (ఒకరియెడల మరొకరు) ప్రవర్తించాలి?

సమాధానము: తల్లిదండ్రులు – "ఈ కొడుకులు, కూతుళ్లు మనయింటపుట్టారు కనుక మనం వీరి ఐహిక పారలౌకిక క్షేమం చూడాలి. మనం కేవలం మన సుఖశాంతులు చూచుకోవటంకాదు వీరిని బాగుచేయటమెట్లా?" అనే భావంతో సంతానం మీద అధికారం చేయాలి వాళ్లని క్రమశిక్షణలో పెట్టాలి. వాళ్లకి మంచి విద్య నేర్పించాలి. అవసరార్థం దండించవలసి వచ్చినా అది వారి మేలు కోసమే చెయ్యాలి.

సంతాన మేమనుకోవాలి? అంటే ఈ శరీరంద్వారా మనం పరమాత్మని పొందగలం. మహదానందం పొందగలం. ఈ శరీరం మనకి తల్లిదండ్రులవల్ల లభించింది. కనుక మనవల్ల వీరికి యెప్పుడూ దుఃఖం కలుగరాదు. మనవల్ల వీరి కపకీర్తి రాకూడదు. మన ప్రవర్తన వీరికి లోకంలో గౌరవసత్కారాలు పెంచేదిగా ఉండాలి. మనం చేసే తీర్థ, సేవన, వ్రతాది శుభకార్యాలు ఏ కొద్దివైనా వాటివల్ల కలిగే పుణ్యఫలం తల్లిదండ్రులకే లభించాలి. ఇటువంటి భావనవల్ల ఒకరి మీద ఒకరికి ప్రేమ పెరుగుతుంది. వర్తమానంలో కుటుంబం సుఖపడుతుంది. భవిష్యత్తులో అందరికీ శ్రేయస్సు కలుగుతుంది.

ప్రశ్న: భార్యా భర్తల పరస్పర ప్రవర్తన ఎలా ఉండాలి?

సమాధానము: భర్త, భార్య గురించి – "ఈమె తన తల్లిదండ్రులు, సోదరులు మొదలైన వారినందర్నీ విడిచి నా దగ్గరకు వచ్చిందంటే ఎంత గొప్పత్యాగం చేసింది? కనుక ఈమెకు ఏవిధమైన కష్టము కలుగ నీయరాదు. జీవనం నిమిత్తం తిండి, బట్ట, ఇల్లు మొదలైన వాటికి

లోటుండకూడదు. నాకంటె ఈమెకెక్కువ సుఖం లభించాలి" అని భావిస్తూ ఆమెయొక్క పాతివ్రత్యధర్మ విషయం కూడ దృష్టిలో ఉంచుకోవాలి. దానివల్ల ఆమె హద్దులు మీరకపోవడం శ్రేయస్సు పొందటం జరుగుతుంది.

పత్నికెటువంటి భావముండాలంటే – "నేను నా గోత్రము కుటుంబము మొదలైనవి త్యజించి వీరియింటికి వచ్చానంటే సముద్రందాటి యిప్పుడు ఒడ్డుకి చేరుకొని మునిగిపోకూడదు అంటే నేనింతటి త్యాగం చేసివచ్చాక ఇప్పుడు నావల్ల వీరికి దుఃఖం కలగకూడదు. వీరి కవమానముగాని, నిందగాని, తిరస్కారంగాని జరుగకూడదు. నావల్ల వీరికి నింద మొదలైనవి జరిగితే అది చాలా అనుచితమైన విషయం అవుతుంది. నేనెంత కష్టమైనా అనుభవింతునుగాక. కాని వీరికిమాత్రం కించిత్తైనా కష్టం కలుగరాదు." అంటూ ఆమె తన సుఖసంతోషాలు త్యాగం చేసి పతియొక్క సుఖసంతోషాలు దృష్టిలో ఉంచుకొని ఆయన యొక్క ఇహపర శ్రేయస్సు కోరుకోవాలి.

ప్రశ్న: అత్తాకోడళ్ల పరస్పర ప్రవృత్తులెలా ఉండాలి?

సమాధానము: అత్త – "ఈమె తన తల్లిని విడిచి మనయింటికి వచ్చింది. ఈమె ఇప్పుడు నా కొడుకు శరీరంలో సగభాగం. కనుక ఈమెకు తన తల్లి జ్ఞాపకం వచ్చేలాగ, అంటే, ఇక్కడ బాధకలిగి తల్లిని తలుచుకొనేలాగ ప్రవర్తించకూడదు." అని భావించాలి.

కోడలేమనుకోవాలి? నా సౌభాగ్యానికి ఈమె ముఖ్యంగా జనని. నా సర్వస్వమైన వ్యక్తి ఈ వృక్షంయొక్క పండు, ఈ చెట్టుకు కాసిన పండు కనుక ఈమెను గౌరవించాలి. ఈమెకు ప్రతిష్ఠకలగాలి. నేను కష్టపడి. ఈమెను సుఖపెట్టాలి. ఈమె నాయెడల యెంత కఠినంగా ప్రవర్తించినా అది నా మేలు కోసమే. నేను జబ్బుపడితే తల్లిలాంటి యీ అత్తగారు సేవచేసినట్టు మరెవ్వరూ చేయరనేది ప్రత్యక్షంగా కనిపిస్తూనే ఉంది. నిజానికి నాపట్ల, హితాభిలాషతో అత్తగారు ప్రవర్తించినట్లు మరెవ్వరూ సంచరించరు. అది అసంభవం కూడాను. ఈమె నన్ను "బహూరాణీ" అంది. తన ఉత్తరాధికారం కోడలురాణిగా నాకే యిచ్చింది. ఇటువంటి

అధికారం ఇంకెవ్వ రివ్వగలరు? దీనికి బదులు నేను కొన్ని జన్మలలో కూడ తీర్చుకోలేను. కాబట్టి నావల్ల వీరికి కించిన్మాత్రమూ ఏ విధమైన కష్టమూ కలుగరాదు, అనుకోవాలి. అలాగే తన సోదరీసోదరుల తోటి, అన్నావదినెలతోటి, మరిదితోటి, కోడళ్లతోటి సాదరంగా ఉండాలి. అన్నావదినెలు తల్లిదండ్రుల వంటివారు. మరిది, అతని భార్య, కొడుకు, కూతుళ్లవంటి వారు. కాబట్టి వాళ్లకి సుఖమెలా కలుగుతుంది అనే ఆలోచనతోనే ఉండాలి, వాళ్లకి సుఖం కలిగించాలి నేను కేవలం సేవ చేయటానికే వీరియింటికి వచ్చాను. కాబట్టి చిన్నపనీ పెద్దపనీ ప్రతిదీ వీరి హితముకే, సుఖశాంతులకొరకే జరగాలి. నాయెడల వీరెలా ప్రవర్తిస్తున్నారు? అనే ఆలోచనే చేయకూడదు. వీరెంత కఠినంగా ప్రవర్తించినా అది నామేలుకోసమే.

ప్రశ్న: అన్నభార్య, మరిది మధ్య పరస్పరం ప్రవర్తన ఎలా ఉండాలి?

సమాధానము: అన్నభార్య సీతలాగ మరిది భరతుడులాగ ప్రవర్తించాలి. సీత భరతుణ్ణి పుత్రుడిలా భావించేది. కైకేయి నిష్కారణముగా రాముణ్ణి వనానికి పంపింది. కాని సీత మాత్రం ఎప్పుడూ భరతుడి మీద దోషారోపణ చెయ్యలేదు. భరతుణ్ణి నిరాదరించలేదు. పైగా చిత్రకూటంలో భరతుడు సీత చరణధూళి తన శిరస్సున ధరించినప్పుడు సీత ఆయన్ని ఆశీర్వదించింది. ఇలాగే వదిన తన మరిది ఎంత నిరాదరం చూపినా, అవమానపరచినా తాను మాత్రం తన మాతృభావం హితాభిలాషిత్వం ఎన్నడు విడువకూడదు. మరిది వదినగారిని తల్లిలా గౌరవించాలి. సీత వయస్సులో అంత పెద్దదికాక పోయినప్పటికి భరత లక్ష్మణాదులకు సీతయందు మాతృ భావముండేది.

ప్రశ్న: బావ, బావమరదుల పరస్పర ప్రవృత్తి ఎలా ఉండాలి?

సమాధానము: బావగా రేమనుకోవాలంటే నాకు నా భార్య ఎలా ప్రియురాలుగా కనిపిస్తుందో అలాగే నా భార్యకు ప్రియసోదరుడవటం చేత నా బావమరదీ నాకు ప్రీతిపాత్రుడే. వీరియింటి నుంచి అడపాతడపా ఏదో ఒకటి లభిస్తూనే ఉంటోంది. కనుక లౌకిక దృష్టితో చూచినప్పటికీ లాభమే.

పారమార్థిక భావంలోనైతే త్యాగానికి ప్రాధాన్యత ఉండనే ఉంది.

బావమరది ఏమనుకోవాలంటే ఈయన నా సోదరికెంతో ప్రీతి పాత్రుడు. కాబట్టి నాకూ ఆదరణీయుడే. నా సోదరికి, కూతురికి పెట్టుకోవటం (ధన, వస్త్రాదులు)లోవున్న ఆనందం, బావగారికిచ్చినపుడు కలగాలి. బావగారు కూడా నా ప్రేమకు, ఆదరానికి పాత్రులే. హృదయపూర్వకంగా వారిని ఆదరిస్తుండాలి.

ప్రశ్న: సోదరీసోదరుల పరస్పరవ్యవహారస్వరూపమెలా ఉండాలి?

సమాధానము: సాధారణంగా సోదరుని వైపునుంచే తప్పు జరుగుతుంటుంది. సోదరివైపు నుంచి తక్కువ తప్పు ఉంటుంది. కాబట్టి "ఈమె సువాసిని (సౌభాగ్యవతి) దయాస్వరూపురాలు. ఈమె పట్ల ఎక్కువ (ఆదరణ ప్రేమలు) ప్రేమాదరాలు చూపించాల"ని సోదరుడనుకొంటూ ఉండాలి. బ్రాహ్మణునికి భోజనం పెడితే వచ్చే పుణ్యమే చెల్లెలికి, కూతురుకి పెట్టటం వల్ల వస్తుంది.

ప్రభుత్వం తండ్రి ఆస్తిలో సోదరికి భాగం కల్పిస్తూ చేసిన చట్టంవల్ల అన్నా చెల్లెళ్ల మధ్య తగువువస్తుంది (వచ్చే ఆవకాశం ఉంది). వైమనస్యం (భేదభావం) కలగటం అనేది చాల సాధారణమైన విషయం. ఆమె తన భాగం అడిగేసరికి అన్నాచెల్లెళ్ల మధ్య ప్రేమ ఉండదు. భాగాలు పంచుకోవటంలో అన్నదమ్ముల మధ్య కూడ తగువులు వస్తున్నప్పుడు అక్కాతమ్ముళ్ల (అన్నాచెల్లెళ్ల) మధ్య తగువులు వస్తాయని చెప్పేదేముంది? కాబట్టి ఈ విషయంలో ఆడపిల్లలు పూర్వపు ఆచారం పాటించాలి. తండ్రి ఆస్తిలో భాగం తీసుకోకపోవటం ధార్మికము శుద్ధమైన పద్ధతి.

ధనం మొదలైన వస్తువులేవీ ప్రాధాన్యం గలవికావు. ఇవి కేవలం వ్యవహారం కోసం. వ్యవహారం కూడ ప్రేమకు ప్రాముఖ్యాన్నివ్వటం వల్లనే బాగుంటుంది. ధనానికి ప్రాధాన్యం ఇవ్వటంవల్ల కాదు. ధనాది విషయాల ప్రాముఖ్యం వర్తమానంలో కలహం కలిగించేది, పరిణామంలో నరకానికి

తీసుకువెళ్ళునది. దీనిలో మానవత్వం లేదు. కుక్కలు వాటిలోఅవి ప్రేమతో ఆడుకుంటాయి. కాని, వాటి ఆట వాటి ముందర రొట్టె వచ్చిపడనంతవరకే. రొట్టె దొరికేసరికి వాటిలో పోట్లాట ప్రారంభమవుతుంది. మనిషి కూడ ఇలాగే ప్రవర్తిస్తే ఇక వాడిలో మానవత్వమేమున్నట్లు?

ధర్మానికి, తన కర్తవ్యానికి, భగవదాజ్ఞకు, ఋషులాజ్ఞకు, త్యాగానికి గొప్పదనాన్నివ్వటం ద్వారా ఇహపరాలు స్వతః సిద్ధ (వాటంతటవి లభిస్తాయి) మవుతాయి. కాని, దురభిమానం, గొప్పదనం, స్వార్థం మొదలైన వాటికి ప్రాధాన్యమిస్తే ఇహపరాలు రెండూ చెడిపోతాయి.

ప్రశ్న: గృహస్థు అతిథి యెడ ఎలా నడుచుకోవాలి?

సమాధానము: నిశ్చితమైన తిథి ఏదీ లేకుండావచ్చేవాడని **"అతిథి"** అనే పదానికర్థం. అతిథి సేవయొక్క ప్రాముఖ్యం గృహస్థాశ్రమంలోనే ఉంది. వాన ప్రస్థాశ్రమంలో అతనికి రెండవస్థానంలో ప్రాముఖ్యముంది. బ్రహ్మచారికి, సన్న్యాసికి అతిథియొక్క ప్రాముఖ్యంలేదు.

బ్రహ్మచారి స్నాతకుడైనప్పుడు అంటే బ్రహ్మచర్యాశ్రమ నియమాలు పాటించి రెండవ ఆశ్రమంలోకి వెళ్లటానికి సిద్ధపడుతున్నప్పుడు అతనికి ఈ దీక్షాంతోపదేశం ఇవ్వబడుతుంది **"మాతృదేవో భవ । పితృదేవో భవ । ఆచార్యదేవో భవ । అతిథిదేవో భవ ।"** (తైత్తిరీయోపనిషత్, శిక్షా. 11/2) తల్లి, తండ్రి, ఆచార్యుడు, అతిథి –వీరినిదైవస్వరూపులుగా భావించి సేవించు అని దీనిభావము. గృహస్థాశ్రమంలోకి వెళ్లేవాళ్లకివి ముఖ్యనియమాలు. కనుక గృహస్థు అతిథికి తగిన విధముగా ఆదరసత్కారాలు చెయ్యాలి.

అతిథి సేవలో కూర్చోటానికి ఆసనమివ్వటం, భోజనపానీయాలు కల్పించటం మొదలైనవి చాలా విషయాలున్నాయి. కాని ముఖ్యమైనది అన్న దానమే. వంటయ్యాక ముందు యథావిధిగా బలివైశ్వదేవం చెయ్యాలి. బలివైశ్వదేవం చెయ్యటమంటే 'విశ్వ' మాత్రానికి భోజనం సమర్పించటం. పిదప భగవంతుడికి నైవేద్యం అందించటం. ఎవరైనా

అతిథిగాని భిక్షువుగాని వస్తే అతనికి భోజనం పెట్టటం. భిక్షుకులు ఆరు రకాలనిచెప్పారు.

బ్రహ్మచారీ యతిశ్చైవ విద్యార్థీ గురుపోషకః ।
అధ్వగః క్షీణవృత్తిశ్చ షడేతే భిక్షుకాః స్మృతాః ॥

బ్రహ్మచారి, సాధు సన్న్యాసి, విద్యాభ్యాసం చేసేవాడు, గురుసేవ చేసేవాడు, పాంథుడు (బాటసారి), క్షీణవృత్తియైన వాడు (అంటే ఇంటికి నిప్పంటుకొని, దొంగలు పడి నష్టపడిన వాడు. ఏమీ జీవనాధారం లేక బాధపడేవాడు) వీరారుగురు భిక్షుకులనబడతారు. కాబట్టి ఈ ఆరుగురికి అన్నం పెట్టాలి.

బలివైశ్వదేవం చేసుకోవటానికి ముందే అతిథి భిక్షుకాదులువస్తే? సమయం ఉంటే బలివైశ్వదేవంచేసుకోవాలి, లేకపోతే ముందే భిక్షుకుడికి అన్నం పెట్టాలి. బ్రహ్మచారి, సన్న్యాసి అయితే సిద్ధమయిన వంటకి (పదార్థాలకి)యజమానులు. వీరికి భోజనం పెట్టక తాను భోజనం చేస్తే పాపం సంభవిస్తుంది. దానికి శుద్ధి చాంద్రాయణవ్రతం* ఆచరించటంవల్ల కలుగుతుంది. అతిథి యింటికి వచ్చి భోజనం చెయ్యకుండా వెడితే అతడు ఇంటియజమాని పుణ్యం తీసుకుపోతాడు. తన పాపం ఇచ్చిపోతాడు. కనుక అతిథికి తప్పకుండా అన్నంపెట్టాలి.

---

*చంద్రాయణవ్రత విధి: అమావాస్య తరువాత పాడ్యమి నాడొక ముద్ద. విదియకు రెండు ముద్దలు, ఈ క్రమంలో ఒక్కొక్క ముద్ద (రోజుకి) పెంచుకుంటు పౌర్ణమికి పదిహేను ముద్దల అన్నం గ్రహించాలి (తినాలి) తరువాత పౌర్ణమి తరువాత పాడ్యమి నుంచి ఒక్కొక్క ముద్ద తగ్గించుకుంటూ అంటే పాడ్యమి నాడు పద్నాలుగు, విదియకు పదమూడు, ఆదిగా తినటం. తాత్పర్యమేమిటంటే చంద్రకళలు పెరుగుతూ ఉంటే ముద్దలుపెంచటం, కళలు తగ్గుతుంటే ఆ ముద్దలు తగ్గించటం అనేది చాంద్రాయణవ్రతం. ఆ ముద్దలు తప్ప యింకేమీ తినకూడదు.

అతిథిని గృహస్థుడు మనస్సులో పరమాత్మ స్వరూపునిగా భావించాలి, అతని నాదరించాలి. అతనికి అన్నపానీయాలు సమకూర్చాలి. బాహ్యంగా జాగ్రత్తగా ఉండాలి. అంటే అతని కింటి రహస్యం తెలియనివ్వకూడదు. ఇల్లు చూపించకపోవటం మంచిది. ఆంతర్యంలో ఆదరం చూపిస్తున్నా అతనిని విశ్వసించరాదని అర్థం. ఎందుచేతనంటే ఈ రోజుల్లో అతిథి వేషంలో ఎవరు వస్తున్నారో చెప్పలేకపోతున్నాం తెలుసుకోలేక పోతున్నాం.

ప్రశ్న: గృహస్థధర్మం ముందు సన్న్యాసి మొదలైన వారికి భోజనం పెట్టటం. సన్న్యాసికి ధర్మం గృహస్థుడు భోజనము చేశాక భిక్షకి వెళ్లడం. అయితే ఈ రెండూ ఎలా కుదురుతాయి?

సమాధానము: గృహస్థు వంట అయ్యాక ముందు (బలి) వైశ్వదేవం చేసుకోవాలి. అప్పుడతిథివస్తే అతనికి యథాశక్తి భోజనంపెట్టాలి. అతిథి రాకపోతే ఒక ఆవునుండి పాలు తీయుటకెంత సమయము పడుతుందో అంత సేపు ద్వారంవెలుపల నిలబడి అతిథికోసం ఎదురుచూడాలి. రాకపోతే అతని భాగం వేరే ఉంచి భోజనం చేయాలి. అతిథి సన్న్యాసి ఏ కొంచెము కూడా కూడబెట్టుకోరు (నిలవ ఉంచుకోరు) కాబట్టి అతనికి ఆకలి వేసినప్పుడు భిక్షకోసం గృహస్థు ఇంటికి వస్తాడు. గృహస్థు భోజనం చేసుకొని గిన్నెలు శుభ్రం చేసుకొని వేరే ఉంచుకున్నాక అతడు భిక్షకి వెళ్లవచ్చు. అంటే గృహస్థుమీద భారం పడకూడదని అతని (వండిన) పదార్థం తక్కువ అవకూడదని. ఇంటిలో ఒకల్లిద్దరి కోసం అన్నం వండి ఉంటే అప్పుడు భిక్షుకుడు వస్తే అప్పుడన్నం తక్కువ అవుతుంది. ఆ ఇంటిలో అయిదారుగురికి వంటచేసి ఉంటే మాత్రం ఏమీ తేడారాదు. కాని, ఆ యింటికి భిక్షుకులు ఎక్కువమందివస్తే వారి మీద భారంపడుతుంది. అందువల్ల గృహస్థు భోజనం చేసిన తరువాతనే సన్న్యాసి భిక్షకి వెళ్లాలి. మిగిలినదే పెట్టినంతమట్టుకు స్వీకరించాలి. సన్న్యాసి భిక్షకోసం గృహస్తుయొక్క యింటిదగ్గర ఎక్కువసేపుండకూడదు. గృహస్థు వెళ్లమనకపోతే ఒక గోదోహన – ఒక ఆవునుండి పాలు తీయుటకెంత సమయము పడుతుందో అంత సమయము మాత్రం సన్న్యాసి గృహస్థు వాకిట భిక్షకై వేచివుండాలి. గృహస్థునకు మనస్సులో భిక్ష పెట్టేఉద్దేశ్యం

లేకపోతే అక్కడనుంచి వెళ్లిపోవాలి. అంతేకాని ఆగ్రహించరాదు. ఇలాగే గృహస్థుడు కూడ సన్న్యాసిని కోప్పడకూడదు.

ప్రశ్న: గృహస్థు తన పొరుగు వారితో ఎలామెలగాలి?

సమాధానము: పొరుగువానిని తన కుటుంబంలో వ్యక్తిగానే భావించాలి. తన, మన బేధములుండరాదు. వీడు నావాడు, వీడు పరాయివాడు అనే భావం ఇట్టి భేదము అల్పమనస్కులకుంటుంది. ఉదార హృదయం కలవారికి సంపూర్ణ భూమండలమంతా తమ కుటుంబమే*. భగవత్సంబంధంతో అందరూ మన సోదరులే. కనక ఇంటిలోని ముఖ్యులైన మనుష్యులతో ప్రవర్తించినట్లే పొరుగువారితోనూ మనం మెలగాలి. ఇంటికెప్పుడైనా తినుబండారాలుగాని, పళ్లుగాని వస్తే ఆ సమయంలో మనవాళ్లతో పాటుగా పొరుగువారిపిల్లలుగూడా ఉంటే ముందు పొరుగువాళ్ల పిల్లలకి కొంచెం ఎక్కువ ప్రశస్తమైనది పెట్టాలి. తరువాత చెల్లెలు లేదా కూతురు పిల్లలకధికంగా మంచివిగా చూచి పెట్టాలి. అప్పుడు కుటుంబంలోని వారూ, పెత్తండ్రిమొదలైన వారి పిల్లలుంటే వారికి పెట్టాలి. చివరికి మిగిలిన పదార్థం తన పిల్లలకి పెట్టాలి. ఇందులో మనపిల్లలకు తక్కువ సామాన్యమైనది లభిస్తుందేమో, మనం నష్టమే పడాలేమో?అని అనుమానం వస్తే ఇందులో హాని ఏమీలేదు. (వచ్చేనష్టమేమి ఉండదు) మనం పొరుగువారి పిల్లల్ని, చెల్లెలు పిల్లల్ని, కూతురుపిల్లల్ని పైవిధంగా చూచుకుంటే వాళ్లుకూడ మనపిల్లలయెడల అటువంటి భావమునే ప్రకటిస్తారు. అప్పుడు తూకం సమానంగా ఉంటుంది. ముఖ్య విషయమేమిటంటే ఇలా నడుచుకోవటంవల్ల పరస్పరానురాగప్రేమ పెరుగుతుంది. ప్రేమకున్న విలువ పదార్థాలకి లేదు.

పొరుగువారి ఆవో, గేదో వాకిలిలోకివస్తే వారితో పోట్లాడకూడదు. ఆ పశువుల్ని బాధకూడదు. ప్రేమపూర్వకంగా పొరుగాయనతో బాబూ

---

* **అయం నిజః పరో వేతి గణనా లఘుచేతసామ్ ।**
**ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్ ॥**
(పంచతంత్ర, అపరీక్షిత. 37)

(తమ్ముడూ) మీ ఆవు మా ఇంటిలోకి వచ్చింది. ఇకముందది రాకుండా చూచుకోమని చెప్పాలి. ఇలా మనం సౌమ్యంగా ప్రవర్తిస్తే ఎప్పుడైన మన పశువులు వాళ్ల పెరడులోకి వెళ్లితే అతడలాగే ప్రవర్తిస్తాడు. పొరుగువాడు క్రూరంగా సంచరిస్తే కూడ అతనిమీద మనం ఆగ్రహమును వ్యక్తము చేయకూడదు సరికదా మన పశువుల వల్ల పొరుగాయనకి నష్టం కలగకుండా జాగ్రతపడాలి.

మనయింట ఏదైనా ఉత్సవంగాని, వివాహాది శుభకార్యంగాని జరిగి ఆ సమయంలో ఏవైనా పిండివంటలు చేసుకోవటం జరిగితే వాటిని పొరుగువారిపిల్లలకి కూడ పెట్టాలి. ఇరుగు పొరుగువారితో సఖ్యంగా, ప్రేమగా మెలగాలి. ఇచ్చిపుచ్చుకునే ధోరణులు వ్యక్తుల మధ్య ఆత్మీయతల్ని వృద్ధిపరుస్తాయి. మన పొరుగువారి పిల్లలను, మన పిల్లలవలె ఆదరించగల మానసిక స్థితి పెంపొందించుకోవాలి. దీనివలన వ్యక్తుల మధ్య అనుబంధాలు బలపడతాయి.

**ప్రశ్న: నౌకరుతో ఎలా వ్యవహరించాలి?**

సమాధానము: నౌకరును తన పిల్లాడిలాగే చూచుకోవాలి. నౌకర్ని రెండు రకాలుగా నియోగించుకుంటాము. 1. నౌకరుకు జీతము ఇస్తాం అన్నమూ పెడతాం. 2. నౌకరుకు కేవలం జీతమే ఇస్తాం. భోజనము తన యింటనే చేస్తాడు. తనయింటనే తింటాడు. భోజనం చేస్తూ జీతం తీసుకొనే నౌకరుకు పెట్టే భోజనంలో భేదం చూపించకూడదు. సాధారణంగా యిళ్లలో నౌకర్లకి మూడోరకం, ఇంట్లో వాళ్లకి రెండోరకం, తమ భర్తకి పిల్లలకీ మొదటిరకం భోజనాలు తయారు చేస్తుంటారు. ఇలా మూడురకాల వంటలు చేయకుండా ఒకే రకం భోజనం తయారు చెయ్యాలి. భోజనం మధ్యతరగతిది చెయ్యాలి. అందరికీ పెట్టాలి. సమయానికి భిక్షుకుడు వస్తే అతనికి పెట్టాలి.

కేవలము జీతం తీసుకుని భోజనం చేయని నౌకరు తనకు నచ్చినట్టు చేసుకుతింటాడు. కాని మనయింట ఎప్పుడైనా విశేషించి పిండివంటలు చేసుకుంటే ఆ నౌకరుయొక్క పిల్లలకి కూడ పెట్టాలి.

వివాహాదులలో వాడికి నూతన వస్త్రములు ఇవ్వాలి. అతనికి జీతం మామూలుగా ఇవ్వాల్సిందే. అప్పుడప్పుడు అతనికి బహుమతులు, బట్టలు, పిండివంటలు మొదలైనవి పెడుతుండాలి. ఈ బహుమతులు మొదలైన వాటివల్ల ఉన్నంత ప్రభావం ఎక్కువ జీతానికుండదు. నౌకరుకు బహుమతులు యివ్వటంవల్ల ఇచ్చేవాడి హృదయంలో ఔదార్యమేర్పడుతుంది. పరస్పర ప్రేమ పెరుగుతుంది. దానివల్ల వాడు సమయం వచ్చినప్పుడు దొంగలు మొదలైన వారివలన మనని రక్షిస్తాడు. వివాహాది సమయంలో అతడుత్సాహంతో పని చేస్తాడు.

**ప్రశ్న: ఇంటిలోని ఎలుకలు, సాలిపురుగులూ, దోమలు, నల్లులు, మొదలైన జీవరాసులతో ఎలాగ?**

సమాధానము: ఇంటిలో ఉండే ఎలుకలు మొదలైన వాటిని కూడ మనయింటి సభ్యులుగానే భావించాలి. అవికూడ తమ గూడును మనయింటిలో ఏర్పరచుకొని ఉంటున్నాయి కనక వాటికీ మన యింటిలో ఉండే అధికారముంది. అంటే మనని రక్షించుకుంటూ వీలయినంతవరకు వాటినీ రక్షించాలి. కాని యీ రోజుల్లో జనం వాటిని హతమారుస్తున్నారు. ఇది మంచిదికాదు. మనిషికి తనని రక్షించుకొనే అధికారముంది కాని ఎవర్నీ చంపే అధికారం లేదు. మనిషి నేలమీద తన గృహమును నిర్మించుకొని ఎలా నివాసముచేస్తున్నాడో అలాగే ఎలుకలు మొదలైనవి కూడ వాటి నెలవులు అవి నెలకొల్పుకుని నివసిస్తున్నాయి. కాబట్టి వాటిని చంపకూడదు. ఇంటిలో పాము, తేలులాంటి విషజంతువులుంటే వాటిని యుక్తిగా పట్టుకొని ఇంటికి దూరంగా ఉన్న సురక్షిత ప్రదేశంలో విడిచిపెట్టాలి.

మనం శుభ్రత కాపాడుకోకుండా, శుద్ధిలేకుండా ఉండటంవల్లనే దోమలు, నల్లులు మొదలైనవి పుడతాయి. కాబట్టి యింటిలో మొదటినుంచి స్వచ్ఛత, శుభ్రత పాటించాలి. అప్పుడవి మనయింటిలో వాసమేర్పరచుకోవు. శుభ్రత కాపాడుకున్నా అవి వచ్చినచో వాటిని చంపే అధికారం మనకి లేదు.

ప్రశ్న: ఇంటి కుక్కని పెంచాలా? అక్కరలేదా?

సమాధానము: ఇంట్లో కుక్కను పెంచకూడదు. కుక్కను పెంచేవాడు నరకానికి పోతాడు. మహాభారతంలో పంచపాండవులు ద్రౌపది వీరసన్యాసం తీసుకొని ఉత్తరదిక్కుగా ప్రయాణించే సమయంలో భీమసేనాదులు అందరూ పడిపోయారు. చివరకి యుధిష్ఠిరుడు కూడ తూలిపోతే ఇంద్రుడి ఆజ్ఞతో మాతలి రథం తోలుకొని అక్కడికి వచ్చాడు. యుధిష్ఠిరుడితో – "తమరీ శరీరంతో స్వర్గానికి దయచేయండి" అన్నాడు. యుధిష్ఠిరుడు (ధర్మరాజు) తన ప్రక్క ఒక కుక్క నిలబడి ఉండటం చూచి – "ఇది నన్ను శరణుజొచ్చింది కాబట్టి యిది కూడ నాతో బాటు స్వర్గానికి వస్తుంది" అన్నాడు.

అప్పుడు ఇంద్రుడు ధర్మరాజుతో –

"స్వర్గే లోకే శ్వవతాం నాస్తి ధిష్ణ్యమిష్టాపూర్తం క్రోధవశా హరన్తి ।
తతో విచార్య క్రియతాం ధర్మరాజ త్యజ శ్వానం నాత్ర నృశంసమస్తి ॥"
(మహాభారతం, మహాప్రస్థాన 3–10)

ధర్మరాజా! కుక్కను పెంచేవాళ్లకి స్వర్గంలో స్థానంలేదు. వారికి యజ్ఞం చేసినందుకు, నూతులు, దిగుడుబావులు మొదలైనవి త్రవ్వించినందుకు వచ్చే పుణ్యం క్రోధవశులనే రాక్షసులు హరిస్తారు ఇందువల్ల ఆలోచించి పని చెయ్యి. ఈ కుక్కను విడిచిపెట్టుము ఇలా చెయ్యటంలో నిర్దయత్వమనే దేమీలేదు.

యుధిష్ఠిరుడిట్లనెను – "నేను దీనిని పెంచలేదు. ఇది నన్ను శరణుజొచ్చినన్నాశ్రయించింది. నేను దీనికి నా సగం పుణ్యం ఇస్తున్నాను. ఇందుచేతనే యిది నాకు తోడుగా వస్తుంది". యుధిష్ఠిరుడిలా చెప్పిన మీదట ఆ కుక్కలో నుంచి యమధర్మరాజు ప్రత్యక్షమై – "నేను నిన్ను పరీక్షించాను. నీవు నాపై విజయము సాధించావు. ఇప్పుడు నీవు స్వర్గానికి వచ్చుటకు అర్హతను పొందావు. "అంటే గృహస్థు ఇంటిలో కుక్క నుంచకూడదు అని అర్థం."

మహాభారతంలో –

భిన్నభాండం చ ఖట్వాం చ కుక్కుటం శునకం తథా ।
అప్రశస్తాని సర్వాణి యశ్చ వృక్షో గృహేరుహః ॥

భిన్నభాండే కలిం ప్రాహుః ఖట్వాయాం తు ధనక్షయః ।
కుక్కుటే శునకే చైవ హవిర్నాశ్నంతి దేవతాః ॥

వృక్షమూలే ధ్రువం సత్త్వం తస్మాద్ వృక్షం న రోపయేత్ ॥
(మహాభారతం. అను 127/15–16)

ఇంటిలో పగిలిన పాత్ర, విరిగిన మంచం, కోడి, కుక్క అశ్వత్థాది వృక్షాలు ఉండటం మంచిదిగా భావింపబడలేదు. పగిలినకుండలో కలి(యుగం) ఉంటుందన్నారు. విరిగిన మంచం ఉండటంవల్ల ధనహాని జరుగుతుంది. కోడి, కుక్క ఉంటే దేవతలాయింట హవిస్సు స్వీకరించరు. అలాగే ఇంటిలోపల ఏదైనా పెద్దచెట్టుంటే దాని మూలం(వేరు)లోపల పాములు, తేళ్లు మొదలైన జంతువులుండటం అనివార్యమవుతుంది. కనుక యింటిలోపల పెద్ద పెద్ద వృక్షాలు వేయకూడదు.

కుక్క చాలా అపవిత్రమైంది. దాని భక్షణపానాదులవల్ల అది అక్కడక్కడ కూర్చోటంవల్ల గృహస్థుయొక్క భక్షణపానాదులలోను, ఉనికిలోను అశుద్ధి, అపవిత్రత కలుగుతాయి. అపవిత్రతయొక్క ఫలితం కూడ అపవిత్రమే (నరకం) అవుతుంది.

**ప్రశ్న: పొలము మొదలైన వాటి రక్షణకోసం కుక్కను పెంచితే (ఉంచితే) ఏమి హాని?**

సమాధానము: కుక్కను కేవలం పొలము మొదలైనవాని రక్షణకోసమే ఉంచాలి. అప్పుడప్పుడు దానికి ఆహారమివ్వాలి కాని దాన్ని తనకు దూరంగానే ఉంచాలి. దానిని తనకూడ ఉంచుకోవడం, తనతోపాటు తిప్పటం, మర్యాద (హద్దు) లేకుండా దానిని తాకటమే నిషిద్ధం. (పనికిరాదు) అంటే కుక్కని పెంచటం దానిని కాపాడటం తప్పుకాదు. పైగా

ఏ ప్రాణినైనా పెంచటం అయితే గృహస్థుకి ముఖ్య కర్తవ్యం. కాని కుక్కతో కలిసిమెలసి ఉండటం దాన్ని వెంట ఉంచుకోవటం దానిమీద ఆసక్తి పెంచుకోవటం పతనానికి కారణం. ఎందుచేతనంటే అవసానసమయంలో కుక్కయొక్క స్మరణయే సంభవిస్తే వచ్చే జన్మలో కుక్కైపుట్టాల్సి వస్తుంది.*

ప్రశ్న: ఇంటికప్పు మీదగాని గోడమీదగాని రావి మొలిస్తే దాన్ని తొలగించాలా? అక్కరలేదా?

సమాధానము: దానిని పెల్లగించి నాల్గువీధులకూడలిలోగాని దేవాలయం ఎదుట గాని సందులో మంచిచోటగాని పాతాలి. దానికి నీరుపోస్తుండాలి. పైకప్పును గాని గోడనుగాని పగలగొట్టవలసివచ్చినా పరవాలేదు. దాన్ని మళ్లీ మరమ్మత్తు చేసుకోవాలే కాని సాధ్యమైనంతవరకు రావిచెట్టును నరకరాదు. రావి, మర్రి, మేడిచెట్టు, అడవి అత్తిచెట్టు, ఉసరిక, తులసీ మొదలైన పవిత్ర వృక్షాల్ని విశేషించి ఆదరించాలి. అవి మానవుని పవిత్రపరచేవి.

ప్రశ్న: గృహస్థు జీవనం గడపటానికి ధనమెలా గడించాలి?

సమాధానము: గృహస్థు శరీరపరిశ్రమ చేసి ఇతరుల హక్కుకు భంగం కలగకుండా జాగ్రత్తపడుతూ ధనార్జన చేయవలెను. లభించినదానిలో పదవ, పదిహేనవ లేదా ఇరవయ్యవభాగం దానమునకు పుణ్యకర్మలకు వినియోగించాలి. ధన సంపాదనలో ఏదో కొంత దోషం సంభవిస్తుంటుంది కాబట్టి ఆ దోషానికి ప్రాయశ్చిత్తనిమిత్తం డబ్బులియ్యాలి.

---

* యం యం వాऽపి స్మరన్ భావం త్యజత్యన్తే కలేబరమ్ ।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః ॥

(గీత. 8/6)

కుంతీ పుత్రుడవగు అర్జునా! ఈ మానవుడు అంత్యకాలమున ఏ భావమును స్మరిస్తూ దేహత్యాగము చేయునో, ఆయాభావమునే పొందుచున్నాడు. ఎందుకనగా అతడెల్లవేళలందా భావము చేతనే ప్రభావితుడగుచున్నాడు.

ప్రశ్న: ఈ రోజుల్లో మనం సత్యమార్గంలో డబ్బు సంపాదింప జాలనట్టుగా ప్రభుత్వపు చట్టాలున్నాయి. అందుచేత ఏంచెయ్యాలి?

సమాధానము: ప్రభుత్వపుచట్టాలనుంచి తప్పించుకొనే ఉపాయముంది. మన ఖర్చును తగ్గించుకోవటం. రకరకాలరుచులతో కూడిన తిండి, అలంకారాలు మొదలైన వాటికి ఖర్చు పెట్టకూడదు. సాధారణమైన పద్ధతిలో జీవనం గడపాలి. చాలా నిరాడంబరంగా జీవనంగడపాలి. డబ్బుసంపాదించటం చేతిలో పనికాదు కనక. డబ్బు ఎంత రావాలో అంతే వస్తుంది. కాని, ఖర్చుచేయటం చేతిలో పని. ఇందులో మనం స్వతంత్రులం.

ప్రశ్న: మనం పూర్తిగా పన్ను(tax) కడితే డబ్బయిపోతుంది అనే మాట నిజం. అది పూర్తిగా చెల్లించక దాచితే డబ్బు మిగులుతుంది. అలాదాచటం మంచిపనేనా?

సమాధానము: ఒకసారి పన్నుకట్టకపోతే డబ్బు మిగిలినట్టు కనపడుతుంది కాని చివరకి డబ్బుండదు. * మిగిలిన సొమ్ము ఉపయోగపడదుకూడ. కాని డబ్బుకోసం చెప్పేఅబద్ధం, చేసేకపటం, మోసం, అన్యాయం మొదలైన వాటికి శిక్ష అనుభవించవలసిందే. అన్యాయంగా సంపాదించిన సొమ్ము విడిచిపెట్టి మరణించవలసివస్తుంది. అర్థమేమిటంటే అన్యాయార్జితమైనవిత్తం డాక్టర్లకో, వకీళ్లకో చెల్లించవలసి వస్తుంది. దొంగలెత్తుకుపోవచ్చు. బ్యాంకులలో పడిఉండవచ్చు కాని మీకుపయోగపడదు. అందుచేత మీకుపయోగపడని సొమ్ముకోసం పాపము, అన్యాయము ఎందుకుచెయ్యాలి?

న్యాయంగా గడించటంవల్ల డబ్బు తక్కువ వస్తుందనటం సరికాదు. వచ్చేసొమ్ము ఎలాగూ వస్తుంది. ఎలా వస్తుందో తెలియదు. కాని,

---

* అన్యాయోపార్జితం ద్రవ్యం దశవర్షాణి తిష్ఠతి ।
ప్రాప్తే చైకాదశే వర్షే సమూలం తద్వినశ్యతి ॥

అన్యాయంగా సంపాదించిన సొమ్ము పదేళ్లుంటుంది. పదకొండవ సంవత్సరం వచ్చాక అదిసమూలంగా నశిస్తుంది.

రావలసిన సొమ్ము తప్పకుండా వచ్చితీరుతుంది. ధనం త్యాగం చేస్తూ, తీసుకోకుండా ఉండేవాళ్లకి డబ్బువస్తుండటం కనిపిస్తూనే ఉంటుంది. అంటే హాని, రోగం, దుఃఖం మొదలైనవి అనుకోకుండానే ప్రయత్నించకుండానే వస్తున్నట్లే కావలసిన డబ్బు సుఖము కూడ కోరుకోకుండానే ప్రయత్నించకుండానే వస్తాయి.

> సుఖమైంద్రియకం రాజన్ స్వర్గే నరక ఏవ చ ।
> దేహినాం యద్ యథా దుఃఖం తస్మాన్నేచ్ఛేత తద్ బుధః ॥
> (శ్రీమద్భాగవతం 11/8/1)

రాజా! ప్రాణులకు కోరికలేకుండానే ప్రారబ్ధానుసారం దుఃఖాలు ప్రాప్తిస్తున్నట్లే ఇంద్రియజన్య సుఖం స్వర్గంలోనూ నరకంలోనూ కూడ ప్రాప్తిస్తుంది. కనుక బుద్ధిమంతుడైన వాడు ఆ సుఖాలు కోరుకోకూడదు.

----oOo----

# 3. బాలుర విషయము

ప్రశ్న: ఆదర్శ సంతానమెలా కలుగుతుంది?

సమాధానము: తల్లిదండ్రుల ఆచరణ (నడవడి) భావాలు ఆదర్శంగా ఉన్నప్పుడే ఆదర్శసంతానం కలుగుతుంది. సంతానోత్పత్తి కేవలం పితౄణం నుంచి ముక్తి పొందటానికే కావాలి. తమ సుఖం కోసం కారాదు. ఎందుచేతనంటే సుఖాసక్తివల్ల కలిగే సంతానం తరచు తక్కువశ్రేష్ఠమై ఉంటుంది. కుంతియొక్క నడత భావాలు ఆదర్శంగా ఉన్నాయి కనుక ధర్మరాజే స్వయంగా ఆమె ఒడిలోకివచ్చాడు.

స్త్రీలు గర్భవతులైనప్పుడు (వారు) తమ సంతానాన్ని శ్రేష్ఠమైనది గాను, మంచిదానిగాను తయారుచేయాలనే కోరికతో భగవత్కథలు, భగవద్భక్తుల చరిత్రలు వినాలి. వాటినే మననం చెయ్యాలి. అటువంటి చిత్రాలే చూడాలి. ఈ విధంగా తల్లిమీద సత్సంగ ప్రభావం ఉండటంవల్ల శ్రేష్ఠమైన సంతానం కలుగుతుంది. ప్రహ్లాదుని తల్లి గర్భవతిగా ఉన్నప్పుడు నారదుడు గర్భస్థ శిశువును గూర్చి ఆమెకు భగవత్కథ వినిపించి, ఉపదేశం చేసినందువలననే రాక్షసకులంలో ఉద్భవించినప్పటికీ ప్రహ్లాదుడు శ్రేష్ఠుడయ్యాడు.

సత్కర్మ(సదాచారం) సచ్చింతనం, సచ్చర్చ, సత్సంగం ఇవినాలుగు. మంచిపని చేయటం సత్కర్మ. ఇతరులమేలుకోసం భగవంతునియొక్క చింతనం చెయ్యటం సచ్చింతనం. పరస్పరం భగవంతునియొక్క భక్తులయొక్క చరిత్రలవర్ణనం చేయటం, వినటం సచ్చర్చ. నేను భగవంతునివాడను. భగవంతుడు నావాడు. ఇలా అచంచలంగా భగవంతునితో ఉండటం సత్సంగం. ఈ నాల్గింటివల్ల సంతానము ఆదర్శము, శ్రేష్ఠము అవుతుంది.

మనుష్యుడు క్రొత్తనిర్మాణం చెయ్యగలడు. తమ ఉన్నతిని సాధించగలడు. మనుష్యశరీరంలోనే ఈ స్వతంత్రత ఉంది. తనని తాను శ్రేష్ఠుడ్నిగా చేసుకోగలడు. అందుచేత అతడు సత్పురుషుల, మహాత్ముల

సాంగత్యం చెయ్యాలి. సజ్జనులు, మహాత్ములు లభించకపోతే సాధనలో తత్పరత్వంలో మగ్నులైయున్న సాధకుల సాంగత్యం చెయ్యాలి. ఇటువంటి సాధకులు కూడ లభించకపోతే గీత, రామాయణం మొదలైన మంచిగ్రంథాల పఠనం, పాఠనం, మననం చెయ్యాలి. తన శుభాన్ని (గురించిన ఆలోచన) దృష్టిలో ఉంచుకోవాలి. దీనివల్ల అతడు శ్రేష్ఠపురుషుడు కాగలడు.

**ప్రశ్న: తల్లిదండ్రుల ఆచరణ, భావాలు మొదలైనవి మంచివే. కాని వారి సంతానం మంచిది కావటం లేదు. దీనికి కారణమేమిటి?**

సమాధానము: దీనికి ముఖ్యకారణం సాంగత్యదోషం. అంటే బాలకుడికి మంచిసాంగత్యం లభించక పోవటమే. సాంగత్యం ఋణానుబంధంవల్ల కలుగుతుంది. దుష్టసాంగత్యంవల్ల చెడిపోతున్న పుత్రుడు సత్సాంగత్యంవల్ల బాగుపడగలడు. కాని పూర్వజన్మపు బాకీ తీర్చుకోవటానికి వచ్చినవాడు మాత్రం దుఃఖం కలిగించేవాడే అవుతాడు. కనుక తమ ఆచరణ, భావాలు మంచివైనప్పటికీ ఇటువంటి సంతానం కలిగితే పూర్వపు ఋణానుబంధం అనుకొని మన ఋణం తరుగు తోందనుకొంటూ సంతోషంగా ఉండాలి.

విశ్రవసుడు బ్రాహ్మణకులస్థుడు. కాని ఆయన భార్య కైకసి రాక్షస కులస్థురాలు. ఆ కారణాన రావణుడు పుట్టాడు. ఉగ్రసేనుడు ధర్మాత్ముడు. కాని, ఒక రోజున ఒక రాక్షసుడు ఉగ్రసేనుడి రూపం ధరించి అతని పత్నితో సంగమించాడు. అందుచే కంసుడు పుట్టాడు.

**ప్రశ్న: తల్లిదండ్రుల ఆచరణలు మంచివికానప్పుడు కూడా వారి సంతానం మంచిదవుతోంది. దీనికి కారణమేమిటి?**

సమాధానము: తరచుగా తల్లిదండ్రుల స్వభావమే సంతానానికి వస్తుంది. కాని, ఋణానుబంధంవల్లగాని, గర్భాదాన సమయంలో ఏదైనా మంచి సంస్కారం కల్గటంవల్లగాని, గర్భవతిగా ఉన్నప్పుడు ఏ మహాత్ముని సాంగత్యమైనా లభించటం వలనగాని, శ్రేష్ఠమైన(ఉత్తమ) సంతానం కలుగుతుంది. హిరణ్యకశిపునికి ప్రహ్లాదుడు పుట్టినట్లే. ప్రహ్లాదుడి విషయంలో. తపస్సుకి ఆటంకం కలగటంతో హిరణ్య కశిపుడు భార్యని

కలవటాని కింటికి వచ్చాడు. గర్భాదాన సమయంలో సంభాషణలో అతనినోటివెంట కొన్నిసార్లు విష్ణునామోచ్చారణం చేయటం సంభవించింది. అతని భార్య "కయాధూ" గర్భవతిగా ఉన్నప్పుడు గర్భస్థ శిశువునుద్దేశించి నారదుడు ఆమెకు భక్తి విషయాలు వినిపించాడు. ఈ కారణాలవల్ల ప్రహ్లాదునిలో భక్తి సంస్కారం కలిగింది. నీటిరుచి మధురమైనప్పటికీ నేలయొక్క సంపర్కముచేత నీటిరుచి మారి వేరువేరయినట్లే (వేరువేరు నూతులనీరు వేరువేరుగా ఉంటుంది) సాంగత్యం కారణంగా మనిషిభావాలు మారిపోతాయి.

ప్రశ్న: తండ్రియొక్క ఆత్మయే పుత్రునిరూపంలో వస్తుందంటారు దీని తాత్పర్యమేమిటి?

సమాధానము: ఎలా అయితే, ఒకరు ఒక బ్రాహ్మణుణ్ణి తన కులగురువుగా భావించడం, వేరొకరు యజ్ఞోపవీతం ఇచ్చినవారిని గురువుగా భావించడం. ఆ గురుపుత్రుని ఆ స్థానంలో గౌరవించడం జరుగుతుందో అదే విధంగా తండ్రియొక్క సర్వకార్యాలకు ప్రతినిధిగా పుత్రుని పేర్కొనడం జరిగింది. తండ్రి ధనమునకు అతడు మరణించిన తదుపరి పుత్రుడే వారసుడవుతాడు. తండ్రిస్థానంలో పనిచేసే వాడవుతాడు. అందువలనే తండ్రి ఆత్మయే పుత్రుడు అంటారు.* తండ్రిస్థానంలో పనిచేసే వాడవుతాడు.

ఇక్కడ ఆత్మ అనే పదం గౌణార్థంలో ఉంటుంది. అంటే ఆత్మ అనే మాట శరీరవాచకం. శరీరమునుంచి శరీరం పుడుతుంది. కనుక వ్యవహారంలో పుత్రుడు తండ్రికి ప్రతినిధి అవుతాడు. కాని, పరమార్థంలో (శుభంలో) పుత్రుడేమీ కారణం కాదు.

---

*అర్జునుడు అశ్వత్థామను బంధించి ద్రౌపది ముందుకు తెచ్చినప్పుడు ద్రౌపది అశ్వత్థామను విడిచి పెట్టమని పట్టుపట్టి అర్జునునితో అంటుంది, ఎవరి కృపవలన మీరు సంపూర్ణ శస్త్రాస్త్రపరిజ్ఞానం పొందారో ఆ ద్రోణాచార్యులే పుత్రరూపంలో (అశ్వత్థామ) మీ ముందునుంచున్నాడు "స ఏష భగవాన్ ద్రోణః ప్రజారూపేణ వర్తతే" (శ్రీమద్భాగవతం 1/7/45)

ప్రశ్న: బాలకులకు వారు శ్రేష్ఠులయ్యేలా ఎలా శిక్షణ ఇవ్వాలి?

సమాధానము: బాలురు సాధారణంగా చూచి నేర్చుకుంటారు. కనుక వారి ముందు తల్లిదండ్రులు తమ నడత మంచిగా ఉంచుకోవాలి. తమజీవనాన్ని సంయమంతోను పవిత్రంగానూ సాగించాలి. ఇలా చేయటంవల్ల పిల్లలు మంచివిషయములు నేర్చుకుంటారు, ఉత్తములవుతారు.

బాలుర ఉన్నతికోసం తల్లిదండ్రులు తమ నడత మంచిగా ఉంచుకోవటం ఒక్కటి, రెండవది వారికి మంచిమాటలు చెప్పాలి. ఉత్తమ విద్య వారికందేలా కృషి చెయ్యాలి. భగవచ్చరిత్ర వినిపించాలి. బాలుడు వ్యవహారంలో పరమార్థకళ నేర్చుకొనేటట్టు చేసేదే ఉత్తమ విద్య అవుతుంది. ఈ విషయంలో కొన్ని సూచనలు - తల్లిదండ్రులెక్కడికైనా బయటికి వెళ్లవలసి వచ్చినప్పుడు పిల్లలతో మీరిక్కడే ఉండండంటారు. అలా అంటే వారంగీకరించరు. వస్తామని పట్టుపడతారు. దానివల్ల తల్లిదండ్రుల మనస్సుకి బాధకలుగుతుంది పిల్లలు దుఃఖితులవుతారు. ఇంట్లో అశాంతి నెలకొంటుంది. కాబట్టి పిల్లలకి ముందే చెప్పాలి- "మేమెక్కడికైనా వెళ్లేటప్పుడు కూడావస్తామని పట్టుపట్టకూడ" దని, మేము చెప్పినట్లు చేస్తుండాలని, రోజుకి రెండు మూడు సార్లిలా చెప్పటంవల్ల పిల్లలు మన భావములను అర్థంచేసుకోగలుగుతారు. మళ్లీ ఎక్కడికైనా వెళ్లేటప్పుడు పేచీపెట్టరు.

ఇంటిముందు తినుబండారాలు వచ్చినప్పుడు, పళ్లు వచ్చినపుడు పిల్లలు వాటిని తీసుకుంటామని పేచీ పెడతారు. కాబట్టి అవి ఎదుటలేనప్పుడు పిల్లవాడితో రోజుకి రెండు మూడు పర్యాయాలు తినేవస్తువుంటే ముందు దాన్ని ఇతరులకి పెట్టాలి మనకి మిగిలింది తినాలని చెప్పాలి. మళ్లీ మంచి వస్తువు ఎదుటికి వచ్చినప్పుడు వాడు పేచీపెడితే అప్పుడు వాడితో - "చూడు బాబూ! అలా పేచీ పెట్టకూడదు. ఇంకొకళ్లకి పెట్టి మరీ మనం తినాలి. అలాచేస్తే వైకుంఠానికి వెళ్లవచ్చు" అని చెప్పాలి. ఇంకవాడు గొడవపడడు. అలా చేస్తే పుణ్యం అన్నట్లు. ఈ విధంగా మీరు పిల్లలకు నేర్పవలసిన విషయాలు రోజుకి

రెండుమూడుసార్లు చెపుతూ ప్రేమపూర్వకంగా వారు వాటిని విని నేర్చుకునేటట్టు చెయ్యాలి.

పిల్లలకు మంచిమంచి విషయాలు నేర్పాలి. ఎలాగంటే "చూడు! బాబూ, ఎప్పుడూ ఏవస్తువూ దొంగిలించకూడదు. అమ్మనడిగి తీసుకోవాలి. ఇవ్వకపోతే ఏడ్చి తీసుకోవాలి, కాని దొంగతనం మాత్రం చెయ్యకూడదు. తమ్ముళ్లు చెల్లెళ్లు అంటే ప్రేమగా ఉండాలి. వారికి తినే వస్తువులు పెడుతూ ఆడించాలి. శ్రీరాముడు భరతాదులతో ఎలా ప్రేమగా ఉండేవాడో చక్కగా ప్రేమగా వాళ్లకి అర్థమయ్యేలా చెప్పేవాడో, అలాగే నువ్వుకూడ నీ తమ్ముళ్ళతో, చెల్లెళ్లతో ప్రేమగా ఉండాలి. వాళ్లతో పోట్లాడకూడదు. మీలో వాదం వస్తే వాళ్ల మాటమన్నించు. నీ మాటే నెగ్గాలని పట్టుపట్టకు. తల్లితండ్రులు చెప్పినట్టు విని యింటిపనులు చెయ్యి. కాలం వృధాగా పోగొట్టుకోకు. మంచి పనుల్లో నిమగ్నమైఉండు. ఇతరుల హక్కు చెడగొట్టకు. ఇతరుల వస్తువు సీదనుకోకు. ఏ వస్తువులనైనా మంచిమంచి పనులకుపయోగించు" ఇత్యాదిగా. ఈ విధంగా పిల్లలకేవేవి నేర్పాలో అవి రోజుకి రెండుమూడుమార్లు వారికి చెప్పాలి. అలాచెయ్యటంవల్ల ఆ మాటల ప్రభావం వారిపై ఉంటుంది.

అంటే ఒకటి పిల్లలకు మంచి ఆచరించి చూపించటం, రెండోది వాళ్లకి మంచి శిక్షణ (విద్య) గరపటం. ఈ విషయాలలో తల్లిదండ్రులు కృష్ణభగవానుని యీ మాటలు మననం చేసుకోవాలి.

న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥

యది హ్యాహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః ।
మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః ॥

ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః ॥
(గీత. 3/22–24)

అర్జునా! నాకీ మూడులోకములలోను కర్తవ్యమంటూ కించిన్మాత్రము గూడలేదు, నేను పొందదగిన వస్తువు కాని, నేను పొందనిదికాని లేదు. అయినప్పటికి నేను కర్మచేయుటయందే నిరతుడనై ఉన్నాను. పార్థా! ఒకవేళ కదాచిత్తుగా నేను సావధానుడనై కర్మాచరణము చేయనిచో ఎంతో హాని కలుగగలదు. ఎందుకనగా, మనుజులందరు అన్ని విధాల నామార్గమునే అనుసరింతురు. ఇందువలన, నేను కర్మాచరణము చేయనిచో, ఈ మానవులందరు నష్టమును పొంది భ్రష్టులగుదురు. నేను సాంకర్యముగావించిన వాడనగుదును. అంతేకాదు ఈ ప్రజలందరను నాశముగావించిన వాడనగుదును.

**ప్రశ్న: ఈ కాలములో పాఠశాల(లో) వాతావరణం బాగాలేదు. అందువల్ల పిల్లల విద్యావిషయంలో ఏంచెయ్యాలి?**

సమాధానము: గృహస్థు ప్రతిరోజూ పిల్లవాడికి విద్య చెప్పాలి. పిల్లలకు చెప్పేకథలలో ఎవరు తల్లిదండ్రులు చెప్పేకథలువిని అభివృద్ధిలోనికి వచ్చారో, ఎవరు తల్లితండ్రులు చెప్పే మాటలు వినక చెడిపోయారో, మొదలైనవి వారి మనసుకు నచ్చేవిధంగా చెప్పాలి. పిల్లవాడు చదువుకోవటాని కలవాటుపడ్డాక అతనికి భక్తుల చరిత్రలు చదువుకోటానికివ్వాలి. పిల్లవాడితో "బాబూ! ప్రతిపిల్లవాడితోను స్వేచ్ఛగా స్నేహంచెయ్యకు. ఎక్కువగా కలిసిమెలిసి మాటలాడకు. ఏదైనా తినాలనుకుంటే అమ్మచేత చేయుంచుకు తిను. బజారు సరుకులు తినకు. దుకాణదారునికి ధనార్జనమీద ఉన్న మక్కువ సరుకుతయారు చేయడములో ఉండదు. కాబట్టి అతడు సరుకు బాగా తయారు చెయ్యడు. చిన్నప్పుడు జీర్ణశక్తి బాగా ఉంటుంది కనక ఇప్పుడు బజారు సరుకు కూడ బాగా జీర్ణమవుతుంది. కాని దాని ప్రభావం ముందుముందు తెలుస్తుంది."

గృహస్థు డబ్బు సంపాదించటం మీదకంటె పిల్లల నడవడి మీద ఎక్కువ దృష్టి ఉంచాలి. సంపాదించిన సొమ్ము పిల్లలకే ఉపయోగపడుతుంది. పిల్లలు చెడిపోయే దశలో ఉంటే డబ్బు వాళ్లనింకా పాడు చేస్తుంది. ఈ విషయంలో మంచి వాళ్ల మాట "**పూత్ సపూత్ తో క్యోఁ ధన సంచై?, పూత్ కపూత్ తో క్యోఁ ధన్ సంచై?** అంటే

సత్పుత్రుడైతే ఆతనికి డబ్బులోటుండదు. కుపుత్రుడైతే కూడబెట్టినదంతా నష్టమవుతుంది. మరి యింక డబ్బు కూడబెట్టటందేనికి?

ప్రశ్న: పిల్లలకు క్రైస్తవ పాఠశాలల్లో (మిషన్ స్కూళ్లలో) చదువు చెప్పించాలా? కూడదా?

సమాధానము: మిషన్ స్కూళ్లలో పిల్లల్ని చదివిస్తే వాళ్లు ఇంట్లో ఉంటూకూడ క్రైస్తవులయిపోతారు. అంటే మీ పిల్లలు పైకి హిందువులు లోపల క్రైస్తవులు అవుతారు. వేలమైళ్లదూరంలో ఉండేవాళ్లు వచ్చి ఇక్కడ మీ పిల్లల్ని క్రైస్తవులుగా తయారు చేస్తున్నారంటే ఇది చాల సిగ్గుపడవలసిన విషయం. మీరు మీ పిల్లల్ని కూడ హిందువులుగా (తయారు చేసి) ఉంచలేక పోతున్నా మీ పిల్లలే మీ దేశంయొక్క ముఖ్య సంపద. వాళ్లని రక్షించండి.

పెద్దలు తమ సొంత పాఠశాలలు, కళాశాలలు నిర్మించుకొని వాటిలో చక్కని క్రమశిక్షణ పిల్లలకి మంచివిద్య నేర్పే ఏర్పాటు ఉండేలా చూచుకోవాలి. చదువు చెప్పేవారి నడవడికూడ మంచిదై ఉండాలి. సత్ప్రవర్తనగల ఉపాధ్యాయులు లభించటం కష్టమైనప్పటికీ ప్రయత్నిస్తే లభిస్తారు. ఇటువంటి స్కూళ్లలోనూ, కాలేజీలలోను మన ధర్మము, గీత, రామాయణాది గ్రంథాలు కూడ పిల్లలకు బోధించాలి. ధార్మిక విద్యకోసం ఒక గంట తప్పనిసరిగా కేటాయించాలి.

మీకు మీరు నిరాడంబరంగా ఉండండి. పిల్లలకి ఆడంబరం లేకుండా ఉండటం నేర్పండి. మీరు ఆహారవిహారాల్లో విలాసజీవనం గడపక అవి విడిచిపెట్టి మంచిమంచి పనుల్లో లగ్నమై ఉంటే ఆ ప్రభావం పిల్లలమీద కూడ బాగా పడుతుంది. ఇంటిలో దేవుడి మందిరముండాలి దేవుడి పూజ జరుగుతుండాలి. భగవంతుడి పాదతీర్థం చిన్న, పెద్ద తేడాలేక అందరూ స్వీకరించాలి. ఇంటిలో భగవత్సంబంధమైన చర్చ, భగవన్నామకీర్తనం, మంచి మంచి పాటలు పాడటం జరుగుతుండాలి. మీరెంత మంచివాళ్లయితే పిల్లలూ అంత మంచివాళ్లుగా తయారవుతారు. **మాటలకంటె చేతల ప్రభావం ఎక్కువగా ఉంటుంది.**

ప్రశ్న: కొడుకుల, కూతుళ్ల పెళ్లిళ్లకోసం తల్లిదండ్రులేంచెయ్యాలి?

సమాధానము: కొడుకు, కూతురు అదృష్టమెలా ఉంటే అలా ఉంటారనేది ముఖ్యవిషయం. కాని, తల్లిదండ్రుల కర్తవ్యమేమిటంటే కొడుకుపెళ్లి చెయ్యాలంటే అమ్మాయి స్వభావం చూడాలి. ఎందుచేతనంటే జీవితపర్యంతం స్వభావము యొక్క అవసరముంటుంది. ఆమె ఆరోగ్యవంతురాలా? కాదా? స్వభావరీత్యా ఆమె తల్లి ఎలాంటిది? మొదలగు విషయములను పరిగణనలోకి తీసుకోవాలి. ఆడపిల్ల పెళ్లి చేయవలసివస్తే (ఆ పిల్లవెళ్లే) అమ్మాయి వెళ్లే ఇల్లు బాగుండాలి, వరుని సౌందర్య, గుణ, యోగ్యత మొదలైన విషయాలు విచారించి తెలుసుకున్న తర్వాతే పిల్లనివ్వాలి. శాస్త్రంలో వరుడి విషయంలో చూచుకోవలసినవి ఏడు విషయాలు చెప్పబడ్డాయి.

కులం చ శీలం చ వపుర్యశశ్చ విద్యాం చ విత్తం చ సనాథతాం చ ।
ఏతాన్గుణాన్సప్త పరీక్ష్య దేయా కన్యా బుధైః శేషమచిన్తనీయమ్ ॥

వరుని కులము (వంశము), శీలము, శరీరము, కీర్తి, విద్య, ధనము, పెద్దవాళ్ల అండ. ఈ ఏడు గుణాలు పరీక్షించి (చూచుకుని) తమకన్యనివ్వాలి. వాస్తవానికి వరుడు మంచివాడయి అతని తల్లి మంచిదయితే అక్కడ అమ్మాయి సుఖపడుతుంది. కన్యను మరీదగ్గరగానూ మరీ దూరంగానూ ఇవ్వకూడదు. దగ్గరలో ఇస్తే పోట్లాటలు ఎక్కువ (వచ్చే అవకాశముంది) రావచ్చు.* దూరమిస్తే తల్లిదండ్రులు పిల్లని చూడటం కష్టమవుతుంది. దీని ఉద్దేశమేమిటంటే తన సంతానం సుఖంగా సౌకర్యంగా ఉండాలి. ఆమెకేవిధమైన కష్టము కలుగకూడదు. వంశం వృద్ధిపొందాలి. ఈ భావంతో సంతానానికి వివాహం చెయ్యాలి.

---

*దగ్గరయితే పిల్లవచ్చి అక్కడి కష్టాలు ఒక్కొక్కటీ తనతల్లితో చెప్పవచ్చు. తల్లి అది సహించక పిల్ల అత్తగారు మొదలైన వారితో గొడవ పడవచ్చు. దానితో పిల్ల అత్తవారింట్లో పోట్లాట జరుగుతుంది. పిల్లకూడ తన ఇబ్బంది (కష్టం) ఎవరికీ చెప్పకూడదు. ఇంటి సంగతి యింటిలోనే ఉంచాలి. లేకపోతే తనకే అప్రతిష్ఠ కలుగుతుంది. దానిమీద ఆపద సంభవిస్తుంది. రాత్రింబవళ్లు తానుండవలసిన ఇంట్లో అశాంతి చెలరేగుతుంది.

ప్రశ్న: కట్నం తీసుకోవటం పాపమా?
సమాధానము: అవును పాపమే.

ప్రశ్న: పాపమైతే శాస్త్రాలలో దీని విధానమెందుకుంది?
సమాధానము: శాస్త్రాలలో కేవలం కట్నమిచ్చే విధానముంది. తీసుకొనే విధానం లేదు. కట్నం తీసుకోక పోవటం చాలా మంచిది. కారణమేమిటంటే కట్నమివ్వటం చేతిలోపని. కాని కట్నం తీసుకోవటం చేతిలోపనికాదు.

కోరటం రెండు రకాలు – 1. మనవస్తువు మనకి లభించాలి. అనుకోవటం న్యాయం. కాని, పరమాత్మ ప్రాప్తికి ఈ కోరిక కూడ బాధాకరమే. 2. ఇతరుల వస్తువు మనకి రావాలి అని కోరటం నరకలోకాలకి తీసుకెడుతుంది. ఇలాగే కట్నం తీసుకోవాలనుకోవటం నరకానికి తీసుకెడుతుంది. కట్నం ఎక్కువరావచ్చు. తక్కువరావచ్చు, అసలు రాకపోవచ్చు. ఇది ప్రారబ్ధం మీద ఆధారపడి ఉంటుంది. కాని, అన్యాయముగా ఇతరులసొమ్ము తీసుకోవాలనే కోరిక ఉందే అది ఘోరనరకాల్లోకి తీసికెళ్లేది. మనుష్యశరీరం పొంది ఘోర నరకాలలోకి పోవటం ఎంతనష్టం? ఎంతపతనం? అందువల్ల మానవుడు కనీసం ఘోర నరకానికి తీసుకుపోయే కోరికను, పరధనాభిలాషను త్యజించాలి.

నిజానికి ధనం ప్రారబ్ధానుసారముగా లభిస్తుంది. ఇచ్ఛామాత్రంచేత కాదు. (కోరుకొన్నంత మాత్రాన రాదు) డబ్బేకనుక కోరినంత మాత్రాన లభించేటట్లయితే నిర్ధనుడంటూ ఎవడూ ఉండడు. ధనేచ్ఛ ఎప్పుడూ ఎవరికీ తీరలేదు. తీరదు. తీరజాలదు కూడ. దానినైతే త్యజించవలసిందే. ధనం లభించేదయితే కోరకుండానే తేలికగా లభిస్తుంది. కోరితే కఠినంగాను, పాపపూర్వకంగా అన్యాయపూర్వకంగా వస్తుంది. గీతలో అర్జునుడు – మనుష్యుడు తాను కోరుకోకుండానే (వాంఛించకుండా ఉండికూడ) పాపం ఎందుకు చేస్తూంటాడు అని అడుగుతాడు. భగవంతుడు – కామనయే (కోరిక = వాంఛ) అన్ని పాపాలకి మూలమన్నాడు (గీత.3/36.37)

పూర్వకాలంలో కట్నరూపంలో పిల్లవాడికి అత్తవారియింటి నుండీ వచ్చేధనం బయటే దానం చేయబడుతుండేది. తమ యింటిలో ఉంచుకొనే వారు కాదు. ఇతరులు కన్యను దానమిస్తే తీసుకున్నామని అందుకు ప్రాయశ్చిత్తరూపంలో యజ్ఞ, దాన, బ్రాహ్మణ భోజనాదులు చేస్తుండేవారు.

కారణమేమిటంటే ఇతరుల కన్యను దానమిస్తే (దానంలో) తీసుకోవటం కూడా ఋణసంబంధమే అవుతుంది. కాని, గృహస్థాశ్రమంలో కన్యను దానం చేస్తేనే తీసుకోవాలి అనే ఉద్దేశ్యం కలుగుతుంది. మన యింట కన్య ఉంటే మనం కూడా కన్యాదానం చేద్దామనే ఉద్దేశ్యం కలుగుతుంది.

విధివిధానముతో గోవు మొదలైనవాటిని దానమిస్తే తీసుకొనే బ్రాహ్మణులు కూడ దానికి ప్రాయశ్చిత్తంగా యజ్ఞం, గాయత్రీ జపం చేస్తుండటం మనం చూశాం. ఇతరులసొమ్ము తీసుకోవటం దోషమైనప్పుడు కట్నరూపములో ధనమాశించటం కూడా తప్పే అవుతుంది. ఎవరైనా కట్నం స్వీకరించవలసివస్తే కేవలం ఇచ్చేవారి తృప్తికోసం, సంతోషంకోసమే తీసుకోవాలి. ధనాశ కొంచెంకూడ ఉండకూడదు. కేవలం ఇచ్చేవాడి సంతోషంకోసమే, కొంచెం తీసుకున్నాకూడా ఈ తీసుకోవటం ఇవ్వటంతో సమానమే.

----oOo----

# 4. సంతాన కర్తవ్యము

మాతా చ కమలా దేవీ పితా దేవో జనార్దనః ।
బాంధవా విష్ణు భక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥

వాస్తవానికి లక్ష్మీనారాయణులే అందరికీ తల్లిదండ్రులు. ఈ దృష్టితో ప్రపంచంలో మన తల్లిదండ్రులు సాక్షాత్తూ లక్ష్మీనారాయణ స్వరూపులు. కనుక తల్లిదండ్రులసేవలోనే నిమగ్నమై ఉండటం పుత్రుని కర్తవ్యం. శరీరాదులను తనవిగా కాకుండా తల్లిదండ్రులవిగా భావించేవాడే నిజమైన పుత్రుడౌతాడు. ఎందుచేతనంటే శరీరం తల్లిదండ్రులనుంచే ఉత్పన్నమైంది. శరీరం స్థూలమైనా, సూక్ష్మమైనా ఆఖరికి కారణ (శరీర)మైనాసరే వాటన్నిటిమీద అధికారం తల్లిదండ్రులదే అంటారు. తనదికాదు. మనువుకూడ పుత్రుడు తీర్థ, వ్రత, భజన, స్మరణాది శుభకార్యాలేవి చేసినా అవన్నీ తల్లిదండ్రులకే అర్పణ చెయ్యాలని * చెప్పాడు. తల్లిదండ్రులు బ్రతికుంటే శ్రద్ధగా తదేకదృష్టితో వారి ఆజ్ఞ పాలించాలి. వారి మనస్సుకి సంతోషం కలిగించాలి. మరణించాక వారికి పిండప్రదానం, శ్రాద్ధతర్పణం చెయ్యాలి. వారిపేరిట తీర్థవ్రతాదులు ఆచరించాలి. ఇలా చేయటంవల్ల వారి ఆశీర్వాదం లభిస్తుంది. దానివల్ల ఇహపరలోకాలు బాగుపడతాయి.

భీష్ముడు తండ్రి సుఖసంతోషాలకోసం తన సుఖసంతోషాలను త్యాగం చేశాడు. ఆజన్మబ్రహ్మచారిగా ఉంటానని ప్రతిజ్ఞచేశాడు. ఆయన కాంతాకనకములనే రెంటినీ త్యాగం చేశాడు. అందుకు ప్రసన్నుడై తండ్రి ఆయనకు స్వచ్ఛంద మరణమనే వరమిచ్చాడు. ఆయన ఇచ్ఛామృత్యువును పొందగలిగాడు. అంటే ఆయన ఎప్పుడు మరణించాలనుకుంటే అప్పుడే మరణిస్తాడు. ఆయనకిటువంటి శక్తి

---

* తేషామనుపరోధేన పారత్ర్యం యద్యదాచరేత్ ।
తత్తన్నివేదయేత్తేభ్యో మనోవచనకర్మభిః ॥
(మనుస్మృతి. 2/236)

పితృసేవవల్ల ప్రాప్తించింది. శ్రీరాముడు పితృవాక్పాలన కోసం రాజ్యం, వైభవం, సుఖం, విశ్రాంతి మొదలైనవన్నీ త్యాగం చేశాడు. వాల్మీకిరామాయణంలో శ్రీరాముడు – "తండ్రిమాట ప్రకారం నేను అగ్నిలో ప్రవేశించగలను, విషభక్షణంకూడ చేయగలను, సముద్రంలో కూడ దూకగలను గాని నేను తండ్రి ఆజ్ఞ మీరజాలను". (ఉల్లంఘించలేను) * అని స్వయంగా చెప్పాడు. శ్రీరాముడు ఆజ్ఞాపాలకుడు. అంటే తండ్రి ఏంచెప్పాడు? ఎక్కడ చెప్పాడు? ఎప్పుడు చెప్పాడు? ఏ అవస్థలో ఏ పరిస్థితిలో చెప్పాడు? అంటూ ఇటువంటి ఆలోచనచేయక ఆయన తండ్రి ఆజ్ఞ పాలించాడు. వనవాసానికి వెళ్ళాడు, కాబట్టి తల్లిదండ్రుల ఆజ్ఞ పాలించటంలో శ్రీరాముడందరికీ ఆదర్శపాత్రుడయ్యాడు. గోస్వామి తులసీదాసు మాటలలో–

**అనుచిత ఉచిత విచారు తజి జే పాలహిఀ పితు బైన ।**
**తే భాజన సుఖ సుజస కే బసహిఀ అమరపతి ఏన ॥**

ఉచితానుచితముల విచారించక ఎవ్వరైతే పిత్రాజ్ఞను పాలిస్తారో, వారు సుఖమును, సుయశమును పొంది స్వర్గమున నివసిస్తారు.

తాత్పర్యమేమనగా పుత్రుడు శ్రీరాముడిలాగ తన నడవడిని తీర్చిదిద్దుకోవాలి. "ఈ పరిస్థితిలో, ఈ అవస్థలో ఇప్పుడు నా స్థానంలో శ్రీరాముడేకనక ఉంటే ఏం చేస్తాడు" ఈ విధమైన ధ్యాసతో పని చెయ్యాలి.

పుత్రుడు తల్లిదండ్రులకెంత సేవచేసినా వాళ్ళ ఋణం తీరదు. కారణమేమిటంటే ఈ మనుష్యశరీరము వలననే తనకు శ్రేయస్సు కలుగగలదు. దీనివల్లనే జీవన్ముక్తి లభించగలదు. భగవదనుగ్రహప్రాప్తి కలుగగలదు. భగవంతుని కిరీటంలో మాణిక్యం కాగలిగినంత ఉన్నత స్థానం లభించగలదు. అటువంటి ఈ మానవశరీరం మనకి తల్లిదండ్రులిచ్చారు. దానికి పుత్రుడెలా బదులు తీర్చుకోగలడు? తీర్చుకోలేడు.

---

* **అహం హి వచనాద్ రాజ్ఞః పతేయమపి పావకే ।**
**భక్షయేయం విషం తీక్ష్ణం పతేయమపి చార్ణవే ॥**
(వాల్మీకి. అయోధ్య. 18/28–29)

**ప్రశ్న: తల్లిదండ్రుల సేవయొక్క తాత్పర్యమేమిటి?**

సమాధానము: తల్లిదండ్రుల సేవయొక్క తాత్పర్యం కృతజ్ఞతలో ఉంది. తల్లిదండ్రులు పిల్లవాడి కోసం అనుభవించిన కష్టాల ఋణం కొడుకు మీద ఉంది. ఆ ఋణాన్ని కొడుకెప్పుడూ తీర్చలేడు. తల్లి కొడుకుకెంత సేవచేసిందో అంతే సేవ కొడుకు చేయలేడు. ఎవడైనా కొడుకు "నేను నాచర్మంతో నా తల్లికోసం చెప్పులు కుట్టించిస్తా" నంటే మనం " ఈ చర్మం నీవెక్కడి నుంచి తెచ్చా" వనడుగుతాం. ఇదీ తల్లే ఇచ్చింది. ఆ చర్మాన్నే చెప్పులు చేసి తల్లికిస్తే గొప్పేముంది? కేవలం ఇస్తాననే అభిమానం మాత్రమే చూపించటమవుతుంది. ఇటువంటి శరీరమే ముఖ్యంగా తండ్రి అంశం. తండ్రియొక్క ప్రయత్నంవల్లనే కొడుకు చదువుకొని యోగ్యుడవుతాడు. అతనికి ఆహారపానీయాదులు, వస్త్రములు లభిస్తాయి. అదెలా (బదులు) తీర్చుకుంటాం? కాబట్టి కేవలం తల్లిదండ్రుల సేవ చేయటంవల్ల, వారి సంతోషాన్ని పొందటంవల్ల ఆ ఋణమయితే తీరదు. కాని కృతజ్ఞత చూపినట్లవుతుంది. (క్షమింపబడునట్లు).

**ప్రశ్న: "నాకిలాంటి కొడుకు కలగాలి. వాడికి శ్రేయస్సుకలగాలి" అనే ఉద్దేశంతో తల్లిదండ్రులు సంగమించటం జరగలేదు. వారు తమ సుఖంకోసం కలిశారు. మనం జన్మించాము. మరి మన మీద వారి ఋణం ఎట్లా?**

సమాధానము: కేవలము సుఖాసక్తితో సంగమించిన స్త్రీపురుషులకు సాధారణంగా శ్రేష్ఠులైన పుత్రులు పుట్టరు. శాస్త్రం ఆజ్ఞాపించిన దానిననుసరించి కేవలం పితృఋణముక్తి కోసమే సంతానోత్పత్తి చేసినవారు (తమ సుఖంకోసం కాకుండ) అసలైన తల్లిదండ్రులు. కాని, పుత్రుడికి మాత్రం వారెటువంటివారైనా ఎలాఉన్నా వారు పూజ్యులే. ఎందుకంటే వారు మానవశరీరమిచ్చి కొడుకుని పరమాత్మ ప్రాప్తికధికారిని చేశారు. ఉపనిషత్తుల్లో వస్తుంది విద్యార్థి విద్య నభ్యసించి స్నాతకుడై గృహస్థాశ్రమంలో ప్రవేశించటానికి గురువుగారి ఆజ్ఞ (అనుమతి) తీసుకొనేటప్పుడు గురువుగారు అతనినాజ్ఞాపిస్తారు **"మాతృదేవోభవ, పితృదేవోభవ"**, అని. అర్థమేమిటి? నీవు తల్లిదండ్రులను సాక్షాత్తు భగవత్స్వరూపులుగా భావించి వారి ఆజ్ఞపాలించు. వారిసేవ చెయ్యి. ఇది

ఋషులయొక్క దీక్షాంతశిక్షణ (విద్య). దానిని పాలించటంలోనే మనశ్రేయస్సు ఉంది. కనుక పుత్రుడికి ఎవరివల్ల శరీరం లభించిందో వారికతడు కృతజ్ఞుడై ఉండవలసిందే.

**ప్రశ్న: తల్లిదండ్రులు మనకి జన్మనిచ్చి సంసారబంధనంలో పడేశారు. ఆపత్తులో పడేశారు. మరి మనమీద వారి ఋణమెలా ఉంది?**

సమాధానము: ఇది చాలా తప్పు. తల్లిదండ్రులయితే మనుష్యశరీరమిచ్చి సంసారబంధనం నుంచి, జననమరణ చక్రంనుంచి బయటపడేందుకు చాలగొప్ప అవకాశం కల్పించారు. తల్లిదండ్రులు కొడుకుని బంధనంలో పడెయ్యలేదు. తమపుత్రుని బంధనంలో, ఆపత్తులో పడెయ్యాలనే ఉద్దేశ్యం వారికి లేదు. వారు సర్వకాలసర్వావస్థలలో తెలిసిగాని తెలియకగాని సర్వదా పుత్రుడిక్షేమమే కోరుతారు. మంచే చేస్తారు. కాని, మనం వస్తువులయందు. భోగాలయందు, పరిస్థితులయందు, వ్యక్తులయందు మమకారం పెంచుకొని వాటివల్ల సుఖం అనుభవించాలనే కోరికతోనే బంధనాలలో ఆపదలో పడుతున్నాము. అంటే తన సుఖేచ్ఛ, సుఖభోగం, సుఖించాలనే ఆశ త్యజించి పుత్రుడు మాతాపితరులసేవ పరమాత్మ ప్రాప్తికి సాధనమనుకొని తత్పరతతో వారిసేవచెయ్యాలి. అలాచేస్తే అతనికి సంసారంతో బంధనం విచ్ఛిన్నమై పరమాత్మప్రాప్తి కలుగుతుంది.

పుత్రుడు తల్లిదండ్రులకర్తవ్యంమీద దృష్టి పెట్టుకోకూడదు. అతడు కేవలం తనకర్తవ్యమే చూచుకోవాలి. తన కర్తవ్యం సంగతి చూచుకోకుండా తల్లిదండ్రులకర్తవ్యాన్ని గురించి చింతించేవాడు తనకర్తవ్యం నుంచి చ్యుతు (పతితు)డవుతాడు. కర్తవ్యపాలననుండి పతితుడవుతాడన్నమాట. ఏ శాస్త్రము ఎవరికీ తల్లిదండ్రుల గురుజనుల కర్తవ్యాలను చూచే అధికారం ఇవ్వలేదు. వెనుకటితరంవారు (పూర్వీకులు) ఎవరి కర్తవ్యాన్నీ చూచేవారు కాదు. తమ కర్తవ్యమేమిటో తాము చూచుకుంటుండేవారు. తమ కర్తవ్యం పాలించేవారు. అందువల్లనే వారు జీవన్ముక్తులు, భగవద్భక్తులు అవుతుండేవారు. వారు ఇతరుల కర్తవ్యంచూస్తూ తమ స్వార్థమే చూచుకొనేవారయితే ఈనాటి సమాజంలాగే అప్పటి మానవసమాజమూ

ఉండేది. తమ కర్తవ్యాన్ని గమనించి దానిని పాలించిన మహాత్ముల్ని, ధర్మాత్ముల్ని, భారతప్రజ ఎంత ఆదరదృష్టితో చూస్తుంది. కాబట్టి మానవుడు ఎప్పుడూ తన కర్తవ్యాన్ని పరిత్యజించకూడదు.

కర్తవ్యం విషయంలో ఒక రహస్యముంది. కేవలం కర్తవ్యంగా భావించి దానిని పాలించటంవల్ల అంతటితో ఆ సంబంధం తెగిపోతుంది. తల్లిదండ్రులను సేవించటం కేవలం తన కర్తవ్యం అనుకొని చేసేవాళ్లకి తల్లిదండ్రులతో సంబంధం విచ్ఛేదం అవుతుంది. వారికి పితృపాదులమీద ప్రేమ ఉండదు. కాని, తన శరీరము తల్లిదండ్రులదే అనుకొని లగ్నచిత్తంతో గౌరవప్రేమపూర్వకంగా సేవచేసే వారికే తల్లిదండ్రులమీద ప్రేమ ఉంటుంది. మనిషి భోజనం చేయటం, నీళ్లు త్రాగటం తన కర్తవ్యమనుకొన్నట్లే, ప్రాణాధారమనుకొన్నట్లే మాతాపితృసేవ కూడ ప్రాణాధారమనుకోవాలి. వారిసేవే తన జీవన మనుకోవాలి. తన ముఖ్యమైన పని అనుకోవాలి.

సేవహిఀ లఖను సీయ రఘుబీరహి ।
జిమి అబిబేకీ పురుష సరీరహి ॥
(మానస. అయోధ్యా. 142/1)

లక్ష్మణుండును సీతయు రామసేవ ।
చేసినవివేకి దేహంపు సేవవోలె ॥

ఈ విధముగా మాతపితరుల సేవ తన ప్రాణాలకి, జీవాధారంగా భావించి చెయ్యటంవల్ల "నేను", "నాది" అనే భావం నశించిపోతుంది. ఎందుచేతనంటే శరీరం తల్లిదండ్రులదే అని భావించి వారిసేవకే దాన్ని అర్పించటం శరీరంమీద మనకేమి అధికారం లేదనుకోవటంవల్ల, అహంకార మమకారాలుండవు.

ప్రశ్న: మానవుడు తల్లిదండ్రులసేవను భగవత్ప్రాప్తికి సాధనముగా భావిస్తాడు. సాధ్యమనుకోడు. తల్లిదండ్రులను సేవించడమే సాధ్యపడుతుందనుకుంటే తన ప్రాణాధారమదే అనుకొంటే అతనికి తల్లిదండ్రుల పాదాలమీదే ప్రేమ ఉంటుంది. మరి అతనికి భగవత్ప్రేమ,

భగవత్ప్రాప్తి ఎలా కలుగుతుంది?

సమాధానము: ఇందులో మూడు విషయాలున్నాయి. 1. తల్లిదండ్రుల సేవనే సాధనమూ, సాధ్యమూ అనుకొని వారి సేవ చేసేవాడు వారిసేవయే తన ప్రాణాధారమనుకొనేవాడు తల్లిదండ్రులమీద ప్రేమ, భక్తి కలవాడై చివరకి పితృలోకానికి వెడతాడు. 2. పరమాత్మప్రాప్తి కోసమనే ఉద్దేశం పెట్టుకొని తల్లిద్రండుల సేవను తన కర్తవ్యంగా భావించి చేసేవాడికి తల్లిదండ్రులతో సంబంధం విచ్ఛిన్నమై పరమాత్మప్రాప్తి కలుగుతుంది. 3. సాక్షాత్తు తల్లిదండ్రులే భగవత్స్వరూపులనుకొని వారిసేవ చేసేవాడికి భగవత్ప్రాప్తి కలుగుతుంది.

పతివ్రతయైన స్త్రీ భగవంతునియొక్క, శాస్త్రాలయొక్క, మహాపురుషుల యొక్క ఆజ్ఞప్రకారం తనువుతోను, మనస్సుతోను పతిసేవచేసి పతిలోకాన్ని పొందుతుంది. అంటే పతిలోకమే పతివ్రత లోక మవుతుందన్నమాట. అంతేకాని దురాచారవంతుడవటం వల్ల పతికి నరకలోకం ప్రాప్తిస్తే పతివ్రతలోకంకూడ నరకలోకమే అవుతుందని కాదు దీని తాత్పర్యం. పతిసేవ తన ధర్మమనుకొని పాతివ్రత్యధారణ చేసిన స్త్రీ నరకలోకానికెలా వెడుతుంది? వెళ్ళదు. ఆమె పాతివ్రత్యం ఆచరించింది. అందువల్ల ఆమెకు లభించిన (ఉత్తమ) లోకమే ఆమె భర్తకీ ప్రాప్తిస్తుంది. పాతివ్రత్య తపోబలంచేత ఆమెకు, ఆమె భర్తకు ఉభయులకూ శ్రేయస్సే కలుగుతుందని తాత్పర్యం. అలాగే తల్లిదండ్రులను సేవించటమే సాధనము, సాధ్యమని భావించి వారిసేవ చేసినవాడికి వారి తల్లిదండ్రులకి భగవత్ప్రాప్తి కలుగుతుంది. పుత్రలోకమే పితృలోకం కనుక.

**ప్రశ్న: ఈ శరీరము మన కర్మలవలన భాగ్యం(అదృష్టం)వలన లభిస్తుందని చెపుతారు "బడే భాగ మానుష తను పావా" భగవంతుడు కృపచేత మనుష్యశరీరం లభించినది. "కబహుంక కరి కరునా నరదేహీ, దేత ఈస బిను హేతు సనేహీ" అయినప్పుడు ఈ శరీరం తల్లిదండ్రులవల్ల లభించిందనటం ఎంత వరకు ఉచితం?**

సమాధానము: ఈ శరీరం లభించటంలో ప్రారబ్ధము(కర్మ) భగవత్కృప నిమిత్తకారణము. తల్లిదండ్రులు ఉపాదాన కారణము. కుండ

మట్టితో తయారవుతున్నప్పుడు, మట్టి కుండకు ఉపాదాన కారణం, కుమ్మరి నిమ్మిత్తకారణం అయినట్టే. ఉపాదాన కారణం (ముఖ్యకారణం) అంటే పరిణతి చెందటానికి కారణమయ్యేదాన్ని ఉపాదాన కారణమంటారు. నిమిత్తకారణాలు చాలా ఉంటాయి. కుండ తయారవటానికి కుమ్మరి, చక్రం కట్టమొదలైనవనేక నిమిత్తకారణాలున్నాయి. కాని, కుమ్మరి ముఖ్య నిమిత్తకారణం. ఇలాగే శరీరం ఉత్పన్నంకావటంలో తల్లిదండ్రులే ముఖ్యమైన ఉపాదాన కారణం. వారి రజోవీర్యాలవల్లనే కదా శరీరం తయారయ్యేది?

జన్మ ఆయుర్దాయం కలగటానికి, అలాగే అనుకూలప్రతికూల పరిస్థితులేర్పడటానికి కర్మలు నిమిత్తకారణం. ఏ కర్మకెప్పుడెక్కడ ఏ ఫలితం వస్తుంది? ఎటువంటి పరిస్థితిలో కలుగుతుంది? ఈ విధముగా కర్మఫలవ్యవస్థ ఏర్పరచటంలోను కర్మఫలం ఇవ్వటంలోను భగవత్కృప నిమిత్తకారణం. అంటే ఇదంతా భగవదిచ్ఛవల్ల, భగవంతుని విధానంవల్లనే జరుగుతుంది. ఎందుచేతనంటే కర్మలు జడాలు కనక స్వయంగా కర్మఫలం ఇవ్వలేవు. కర్మఫలవిధానం జీవులయొక్క చేతుల్లోనే ఉండేటట్టయితే వారు శుభకర్మలఫలితాలే తీసుకుంటారు. అశుభ కర్మఫలాలెందుకు తీసుకుంటారు? ప్రపంచంలో చూస్తున్నాం –"మానవుడు శుభకర్మఫలం స్వయంగా స్వీకరిస్తాడు అశుభకర్మల (దొంగతనం, లూటీ) ఫలం(శిక్ష) స్వయంగా స్వీకరించక పోతుంటేనే దానికి రాజకీయ వ్యవస్థద్వారా శిక్ష (దండన) వేయబడుతుంది".

తల్లి పిల్లవాడికోసం ఎంత కష్టమనుభవిస్తుంది? వాణ్ణి గర్భంలోధరిస్తుంది. ప్రసవవేదననుభవిస్తుంది. తనపాలు త్రాగిస్తుంది. ఎంతో ప్రేమతో పెంచిపోషిస్తుంది. ఆహారపానీయాలు, లేవటం కూర్చోటం, నడవటం తిరగటం మొదలైనవి నేర్పుతుంది. ఇటువంటి తల్లిఋణం బిడ్డ తీర్చుకోలేడు. కనుక పుత్రులు తల్లికి కృతజ్ఞులై ఉండవలసిందే. ఇలాగే తండ్రి చెప్పకుండానే పుత్రుణ్ణిపెంచి పెద్దచేయటానికి పూర్తి ఏర్పాటు చేస్తాడు. విద్య గరిపి యోగ్యుణ్ణి చేస్తాడు. జీవితాన్ని నడిపించుకునే చదువు నేర్పుతాడు. పెళ్ళిచేస్తాడు. ఇటువంటి తండ్రి ఋణం తీరదు. కాబట్టి

తల్లిదండ్రులకు కృతజ్ఞుడైయుండి బ్రతికి ఉండగా వారి ఆజ్ఞపాలించటం (చెప్పినట్టు వినటం) వారిని సేవించటం వారిని సంతోషంగా ఉండేటట్టు చేయటం, మరణించిన తరువాత వారికి పిండతిలోదకాలు తర్పణాదులు చేయటం మొదలైనవి పుత్రునికి ముఖ్యకర్తవ్యాలు.

ప్రశ్న: తల్లిదండ్రులు చిన్నతనంలోనే పిల్లలకు మంచి శిక్షణ ఇవ్వలేదు. కనుక పుత్రులు తల్లిదండ్రులసేవ చేయకపోతే ఇందులో పుత్రుల దోషమేముంది?

సమాధానము: తల్లిదండ్రులు మంచి శిక్షణయివ్వక (మంచి చదువుచెప్పించక) పోతే అందుకు దోషులువాళ్లు. వారు తమకర్తవ్యపాలన చేయలేదు కనుక. కాని తల్లిదండ్రుల దోషములెంచటము పుత్రుడికర్తవ్యం కాదు. అతడు తనకర్తవ్యం చూచుకోవాలి. ఇతరుల తప్పులెన్నటంద్వారా మానవుడు తనకర్తవ్యాన్నుంచి పతితుడౌతాడు. ఇతరుల తప్పులెన్నటమే భయంకరమైన దోషం (తప్పు). గీతకూడ తనను తానుద్ధరించుకోవాలనీ తనను తాను సంస్కరించుకోవాలని చెప్పింది * ఎందుచేతనంటే మంచి విద్యలభించినప్పటికీ దాన్ని తానే నిలబెట్టుకోవాలికదా! మంచి విద్యలభించిన మీదట బాలుడు దానిని ధారణచేయకపోతే, చెడిపోతే ఆదోషం స్వయంగా ఆ బాలుడిదే. కనుక తన ఉద్ధరణగాని పతనంగాని ముఖ్యంగా తనమీదే ఆధారపడి ఉంటుంది.

ప్రశ్న: తల్లిదండ్రులు పుత్రునియెడల కఠినంగా ప్రవర్తిస్తే. పక్షపాతం

---

* ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥

(గీత. 6/5)

తననుతానే సంసారసాగరమునుండి ఉద్ధరించుకొనవలెను. తనను, తానే అధోగతిలోనికి త్రోసికొనరాదు. ఎందుకనగా ఈ మనుష్యుడు తనకుతానే బంధువు (మిత్రుడు), మరియు తనకు తానే శత్రువు అగుచున్నాడు.

చూపిస్తే ఆ పుత్రుడేమి చెయ్యాలి?

సమాధానము: ఆ పుత్రుడు తల్లిదండ్రుల కర్తవ్యం పట్టించుకో కూడదు. తన కర్తవ్యమే తాను చూచుకోవాలి. విశేషించి ఉత్సాహంతో తల్లిదండ్రుల సేవ చేయాలి. రామచరితమానస్ లో (తులసీరామాయణం) ప్రతివాణ్ణి గురించీ చెప్పబడింది "మంద కరత జో కరఇ భలాఈ" (5 /41/7)

తల్లిదండ్రులు పుత్రుని ఆదరిస్తే ఆదరణలో పుత్రుని సేవ ఖర్చయిపోతుంది. అమ్ముడుపోతుంది. కాని, వారాదరించక పుత్రుని నిరాదరిస్తే పుత్రుడు చేసిన సేవ పూర్తిగ ఉండిపోతుంది. ఖర్చవ్వదు. వారు కష్టం కలిగిస్తే దానితో పుత్రునికి అంతఃశుద్ధి అవుతుంది. సహనశీలత పెరుగుతుంది. తపస్సు వృద్ధిపొందుతుంది. గొప్పదనం పెరుగుతుంది. కనుక తల్లిదండ్రులు పెట్టిన కష్టాన్ని పరమతపస్సనుకొని సంతోషంగా సహించాలి. నా మీద తల్లిదండ్రులకి చాలా దయ ఉంది. దానివల్ల నా సేవ కించిత్తుకూడ వ్యయమవకుండా నాకు శుద్ధమైన సేవయొక్క, శుద్ధతపశ్చర్య యొక్క లాభం కలుగుతుంది అని భావించాలి. (అర్థంచేసుకోవాలి) ఇటువంటి సావకాశం ఎవరో భాగ్యశాలికే లభిస్తుంది. ఇది నా అదృష్టం వారు నా సేవ స్వీకరిస్తున్నారంటే అంతకంటె మరేమికావాలి? వారు తానుచేసేసేవ స్వీకరించకపోయినప్పటికీ, కొడుకు పని వారికి సేవచేయటమే. సేవలో ఏదైనాలోటుగాని దోషంగాని తెలియజేస్తే అప్పుడే దాన్ని సరిచేసుకోవాలి. సేవలోనే తత్పరుడై ఉండాలి.

ధనము, పొలము, ఇల్లు మొదలైనవి పొందాలనే ఆశతో తల్లిదండ్రులసేవ చేసేవాడు వాస్తవానికి ధనాదులకే సేవ చేస్తున్నాడు. తల్లిదండ్రులకు కాదు. పుత్రుడు కేవలం సేవతోనే సంబంధంపెట్టుకోవాలి. అతడు తల్లిదండ్రులతో – మీ దగ్గరున్న ఆస్తిపాస్తులు (ధనసంపదలు) నా సోదరుడికిగాని నా సోదరికిగాని మీకెవరికిష్టమైతే వారికి (అన్నయ్యకిగాని, అక్కయ్యకిగాని, తమ్ముడికిగాని. చెల్లెలికిగాని) ఎవరికివ్వాలనుకొంటే వారికి ఇవ్వండి కాని ఉపచారం నా చేత చేయించుకోండి అని చెప్పాలి. తల్లి దండ్రులతని సేవను పొందటం తన భాగ్యమనుకోవాలి.

ప్రశ్న: తల్లిదండ్రులు అనుచితమైనదిగాని నిషిద్ధమైనదిగాని (పని) చెయ్యమని ఆజ్ఞాపిస్తే కొడుకేంచెయ్యాలి?

సమాధానము: అనుచితమైన ఆజ్ఞ రెండురకాలుగా ఉంటుంది. 1. 'ఫలానావాణ్ణి చంపు' వంటి ఇతరులకు అనిష్టంకలిగించే ఆజ్ఞ ఇవ్వటం. 2."నీవు ఇల్లువిడిచి అడవికి వెళ్ళు" ఈ విధమైన ఆజ్ఞనివ్వటం. ఇందులో రెండవ ఆజ్ఞయితే పాలించాలి. కాని, మొదటి ఆజ్ఞపాలించరాదు. అందులో తండ్రిసామర్థ్యం చూడాలి. తండ్రి సమర్థుడైతే ఆ ఆజ్ఞపాలించటంలో ఏమి హానిలేదు.

ఉదా: జమదగ్ని తన పుత్రుడైన పరశురామునితో "నీ తల్లి నీతి తప్పినది. నీ సోదరులు నేను చెప్పినమాట వినటంలేదు. (చెప్పినట్లు చెయ్యటంలేదు) కనుక వీరిని చంపు" అన్నాడు. పరశురాముడు వారి కంఠాలు నరికేశాడు. జమదగ్ని ప్రసన్నుడై (సంతోషపడి) వరం కోరుకోమన్నాడు. పరశురాముడు "తల్లినీ సోదరుల్నీ బ్రతికించు, నేను చంపిన సంగతి వారికి జ్ఞాపకముండకూడదు" అన్నాడు. జమదగ్ని "తథాస్తు" అన్నాడు. అందరూ పునర్జీవితులయ్యారు.

తండ్రి సమర్థుడుకాక అనుచితమైన ఆజ్ఞిస్తే కొడుకు దానిని ఆచరించకూడదు. కారణమేమిటంటే కొడుకు ఆ అనుచితమైన ఆజ్ఞపాలిస్తే తండ్రికి నరకము సంభవిస్తుంది. తండ్రిని నరకము, దుఃఖమూ పొందేటట్లు చేసే ఆజ్ఞాపాలనం చేయకూడదు. "నేను నరకానికి పోయినాసరే తండ్రి మాత్రం నరకానికి పోరాదు" అనే భావం ఉండటంవల్ల పుత్రునకీ నరకంరాదు, తండ్రికీ రాదు. దీని తాత్పర్యమేమిటంటే, తండ్రిని నరకంనుంచి రక్షించేందుకు (ఆయన) ఆజ్ఞాభంగం చెయ్యాలిగాని అనుచితమైన పనిమాత్రం చెయ్యకూడదు.

తండ్రి సమర్థుడుకాక అనుచితమైన పని చేయుమని ఆజ్ఞాపిస్తే కొడుకింతవరకు (తనజీవితంలో) తండ్రియొక్క ఆజ్ఞను ఉల్లంఘించకపోతే ఆ అనుచితమైన (చెడ్డ) ఆజ్ఞను పాటించటంలో తొందరపాటుచూపక దాన్ని గురించి ఆలోచించి భగవద్ధ్యానం చెయ్యాలి. ఉదా: గౌతముడు తన

"చిరకారి" అనే కొడుకుతో "నీ తల్లి వ్యభిచారిణి. ఈమెను హతమార్చు" అని చెప్పి అడవికి వెళ్ళిపోయాడు. చిరకారి కత్తితీశాడు. తండ్రి చేసిన ఆజ్ఞను గురించి ఆలోచించటం మొదలుపెట్టాడు. అక్కడ గౌతముడి మనస్సులో ఆమెను చంపటమెందుకు? ఆమెను వదలిపెట్టవచ్చుగదా అనిపించి ఆయన తిరిగి వచ్చాడు చూస్తే చిరకారి చేతిలో కత్తితీసుకొని నుంచున్నాడు. కనుక అతడు నీ తల్లిని చంపవద్దని చిరకారిని వారించాడు.

**ప్రశ్న: గోస్వామి తులసీదాసు మాటలలో ప్రహ్లాదుడు తండ్రిని, విభీషణుడు అన్నని, భరతుడు తల్లిని, బలి గురువుని, గోపికలు పతులను త్యాగంచేశారు కదా! వారికి దోషం కలుగలేదా?**

సమాధానము: ఇక్కడ ఒక విషయము గమనించాలి. వారు తండ్రి మొదలైన వారిని ఏ విషయంలో విడిచిపెట్టారు. ఏ అంశంలో త్యాగంచేశారు? హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి చాలబాధించాడు. కాని, ప్రహ్లాదుడు దాన్ని సంతోషంగా సహించేవాడు. అతడు ఈ శరీరం తండ్రిదని భావించేవాడు కనుక ఈ శరీరాన్ని ఎలా ఉంచినాసరే దీనిమీద ఆయనకి పూర్తి అధికారముంది. అందువల్ల ఆయన తండ్రిని మీరు నన్నెందుకు కష్టపెడుతున్నారు? అని ఎప్పుడూ అడగలేదు. కాని నేను సాక్షాత్తూ పరమాత్మయొక్క అంశాన్ని. అందుచేత నేను భగవత్సేవలో భగవద్భజనలో లగ్నమైయున్నాను. తండ్రి దీనికి బాధకలిగిస్తున్నారు. నన్నడ్డుకుంటున్నారు. ఇది తగినదికాదు అని భావించాడు, ప్రహ్లాదుడు తండ్రియొక్క ఆ ఆజ్ఞని త్యజించాడు. దానివల్ల ఆయనకి నరకం కలుగకూడదని ఆయన తండ్రిమాటపాటించి భగవద్భక్తిని పరిత్యజిస్తే దానికి శిక్ష తండ్రి అనుభవించవలసి వచ్చేది. కొడుకువలన తండ్రి శిక్షననుభవించవలసిన దుస్థితి రాకూడదని ఆయన తండ్రి ఆజ్ఞమన్నించక తండ్రికి మేలు చేశాడు. తండ్రిని త్యజించలేదు.

రావణుడు విభీషణుణ్ణి దండించి, నగరమునుండి బహిష్కరించాడు. విభీషణుడు రాముణ్ణి శరణుజొచ్చాడు. కనుక విభీషణుడు సోదరత్యాగం చెయ్యలేదు దానికి బదులుగా అతని అన్యాయాన్ని త్యజించాడు. అన్యాయాన్ని సమర్థించటంగాని అనుమతించటంగాని చెయ్యలేదు.

విభీషణుడు రావణునితో హితవాక్యమే చెప్పాడు. అతనికి మేలే చేశాడు.

భరతుడి తల్లి రాముణ్ణి వనానికి పంపి, దుఃఖం కలిగించింది. కనుకనే భరతుడు తల్లిని విడిచిపెట్టాడు. భరతుడిట్లనెను– "అమ్మ కౌసల్యా నామీద రాముడిమీద కంటే ఎక్కువ ప్రేమ చూపిస్తున్నట్లే నీవు కూడ రాముడి మీద నాకంటె ఎక్కువ ప్రేమ చూపించాలి. కాని, రాముణ్ణి నీవడవికి పంపావు. నీవు రాముడికి కూడ తల్లివిగా ఉండనప్పుడు నాకు తల్లివెలా అవుతావు? ఈ విషయంలో నిన్ను దండించటం నాకు ఉచితంకాదు. కాని నేను నిన్ను 'తల్లి' అని పిలువను. ఇంతకుమించి నేనేం చేయగలను.

బలి – సాక్షాత్తు భగవంతుడే బ్రాహ్మణవేషంలో వచ్చి నన్ను యాచిస్తుంటే గురువుగారు దానమివ్వటానికి నాకు అడ్డుపడుతున్నారు.. కాబట్టి నేను గురువుగారి మాటమన్నించను. బలి గురువుయొక్క హితార్థమే గుర్వాజ్ఞను పాటించలేదు. బలి దానమివ్వటానికి సిద్ధంగానే ఉన్నాడు. అప్పుడాయన గురువుమాట పాటించినట్లయితే ఆ దోషం గురువుగారికే తగిలేది. కావున ఆయన గురువుయొక్క శాపం స్వీకరించాడు. ఆ దోషం నుంచి అహితం(అనర్థం)నుంచి గురువును కాపాడాడు. తాను స్వయంగా శిక్ష అనుభవించాడు. కాని, గురువుని దండననుంచి రక్షించాడంటే ఇది గురుసేవే అయింది.

భర్తలు భగవంతుని దగ్గర ఉండటాన్ని అడ్డగిస్తున్నారు. తద్విషయములో గోపికలు పతులను విడిచిపెట్టారు. వారు భర్తృవాక్యం మన్నించి ఉంటే పతులు పాపులయ్యేవారు. కాబట్టి పతులాజ్ఞ మన్నించక వారు (గోపికలు) పతులను పాపమునుండి కాపాడారు.

తాత్పర్యమేమిటంటే – మనుష్యశరీరంయొక్క సార్థకత పరమాత్మను పొందటంలోనే ఉంది. అందుచేత అందరకు సహాయపడేవాడు మనకి హితం చేస్తున్నాడన్నమాట. అందుకు ఆటంకం కలిగించేవాడు మనకు కీడుచేస్తున్నట్టు లెక్క. ప్రహ్లాదాదులు పరమాత్మ ప్రాప్తికి

బాధకలిగించే వారినే విడిచిపెట్టారు. తండ్రి మొదలైన వారినికాదు. ఇందువల్ల వారికి శుభమే కలిగింది.

ప్రశ్న: మాతృస్థానము గొప్పదా? లేక పితృస్థానమా? ఉన్నతమగుటకు కారణమేమి?

సమాధానము: ఉన్నతస్థానము తల్లిదే, తల్లిస్థానం తండ్రికంటే వందరెట్లు అధికమని చెప్పబడింది. "సహస్రం తు పితౄన్మాతా గౌరవేణాతిరిచ్యతే" (మను. 2/145) రాముడు వనవాసానికి వెడుతూ తల్లిదగ్గరకు వెళ్ళి పాదాలమీదపడి – "అమ్మా! నాకు వనవాసానికి ఆజ్ఞ అయింది" అన్నాడు. తల్లి – "కేవలం తండ్రి ఆజ్ఞే ఇటువంటిదయితే మరితల్లి అంతకంటె ఎక్కువదని తెలుసుకొని నీవు వనానికి వెళ్లకు" అంటుంది. నీ పినతల్లి, తండ్రి నిన్ను అడవికి వెళ్ళమని ఆజ్ఞాపిస్తే, ఆ వనమే నీకు వంద అయోధ్యలసాటి.

జౌఁ కేవల పితు ఆయసు తాతా ।
తౌ జని జాహు జాని బడి మాతా ॥
(మానస, అయోధ్య. 56/1)
తండ్రిమాటగావనముల దరల వలదు,
మిన్న యైనది నామాట మీరరాదు.

జౌ పితు మాతు కహేఉ బన జానా ।
తౌ కానన సత అవధ సమానా ॥
(మానస, అయోధ్య. 56/2)
అడవికంపుట తలిదండ్రుల యాజ్ఞయేని,
వంద అయోధ్యలకుసాటి వనమె నీకు.

---

* అమ్మ కౌసల్య తనకంటె కూడ ఎక్కువగా పినతల్లి (సవతితల్లి) నెక్కువ ఆదరిస్తుందని చెప్పబడినమాట అది ఆయన ఉదారభావం. కౌసల్య అందరికి కూడ తల్లికంటె సవతితల్లి నెక్కువ ఆదరించాలనే శిక్షణ ఇచ్చింది. దానివల్ల కుటుంబంలో పరస్పర ప్రేమనెలకొని ఉంటుంది.

ధనసంపత్తి మొదలైన వాటితో తండ్రి కొడుకును పోషిస్తాడు. కాని తల్లి తన శరీరమిచ్చి కొడుకుని పెంచుతుంది. ధనం, సంపద మొదలైనవైతే మమతకు చెందిన వస్తువులు. శరీరం అహంకారానికి చెందినది. మమకారంకంటే అహంకారం దగ్గరగా ఉంటుంది. మమతకుచెందిన వస్తువులు వస్తూ పోతూ ఉంటాయి. శరీరం అపేక్షాకృతమై ఉంటుంది. కనుక తల్లియొక్క స్థానం ఉన్నతంగా ఉండవలసిందే.

తల్లి తన యౌవనం నాశనం చేసుకుంది. తన శరీరమిచ్చి తన పాలిచ్చి పోషించింది. తల్లి "దాది" పని, మంగలిపని, చాకలిపని, దర్జీపని, గురువుపని కూడ చేసింది. ఇంకా చెప్పేదేముంది? మలమూత్రాదులెత్తి కూడరాని పనులెన్నో చేసింది. ఆ పనులుకూడ భారంగా భావించికాదు. మహాప్రేమతో, మమకారంతో ఉత్సాహంతో చేసింది. దాని బదులుగా ఏదో తీసుకోవాలనే భావంతో చెయ్యలేదు. బిడ్డజబ్బుపడితే తల్లి శరీరపుబలం తగ్గిపోతుంది. కాబట్టి ప్రపంచంలో తల్లితో సమానంగా బిడ్డను పోషించే వారింకెవరు? "మాత్రా సమం నాస్తి శరీరపోషణం" ఇందువల్లనే తల్లిస్థానం గొప్పది ఉన్నతమైనది. శాస్త్రాలలో పుత్రుడు సన్న్యాసి అయినప్పటికీ తల్లి ఎదురైతే అతడు తల్లికి సాక్షాత్తూ సాష్టాంగనమస్కారం చెయ్యాలని చెప్పబడింది. ఇంత ఉన్నతస్థానం ఇంకెవరికుండగలదు?

ప్రశ్న: తల్లిదండ్రుల సేవచేసినందువల్ల కలిగే లాభమేమి?

సమాధానము: - తల్లిదండ్రులసేవవల్ల ఇహపరలోకాలు రెండు ప్రాప్తిస్తాయి. భగవంతుడు ప్రసన్నుడవుతాడు. తల్లిదండ్రులసేవ చేయనివారిని భగవంతుడు నమ్మడు. తన తల్లిదండ్రులకే సేవ చేయనివాడు నాపట్ల భక్తి కలవాడెందుకవుతాడు? అని భావిస్తాడు.

పుండరీకుడు తనువుతో మనస్సుతో తత్పరభావంతో తల్లిదండ్రులసేవ చేశాడు. అతని సేవకు ప్రసన్నుడై భగవంతుడు పిలవకుండానే పుండరీకుని యింటికివచ్చి - "పుండరీకా! నీ మాతాపితృభక్తికి సంతోషించి నేను స్వయంగా నీ దగ్గరకు దర్శనమివ్వటానికి వచ్చాను" అన్నాడు. ఆ సమయంలో పుండరీకుడు

మాతాపితరులసేవలో నిమగ్నుడై ఉన్నాడు. అందుచేత ఆయన భగవంతుడితో - "మాతా పితృసేవ కారణంగానే తామిక్కడికి నాకు దర్శనమివ్వటానికి వచ్చారంటే, ఆ సేవను నేనెందుకు త్యజించాలి? ఇంకా నేను మాతాపితృసేవలోనే మునిగి ఉన్నాను. సేవపూర్తయిన తర్వాతనే నేను తమ దర్శనం చేసుకోగలను. అంతవరకు తమరు వేచివుండదలిస్తే ఈ ఇటికమీద నిలబడి ఉండండి" అని చెప్పి రెండిటికలు వెనుక ప్రక్కకు వేసినాడు. భగవంతుడు వాటిమీద నిలబడ్డాడు. ఇటుకలమీద నిలబడిన కారణముచే భగవంతుడి పేరు "విఠల్" అయింది. భగవంతుని ఈ రూపాన్నెవరైనా దర్శించాలనుకుంటే పండరిపురం (మహారాష్ట్ర)లో ఆ రూపాన్ని దర్శించవచ్చు. ఇలాగే మహాభారతంలో మూక చండాలుడి ప్రస్తావన ఉంది - మూక చండాలుడి మాతాపితృభక్తి చూచి భగవంతుడు స్వయంగా అతని యింటిదగ్గరుండే వాడు. మాతాపితృ సేవవల్ల లౌకిక పారలౌకిక సర్వవిధ లాభాలు ఉంటాయని అర్థం.

ప్రశ్న: మాతాపితృ సేవకింత మాహాత్మ్యం ఉంటే మరి వారి సేవ విడిచిపెట్టి మానవుడు సన్న్యాసి అవుతాడెందుకు?

సమాధానము: ఎవడైనా మరణిస్తే, వాడు మాతాపితృసేవ విడిచిపెట్టే చనిపోతున్నాడు. అందుచేత వాడు దోషికాడు. ఇలాగే ప్రపంచంలో వాస్తవమైన వైరాగ్యం కలవాడుకూడ దోషభూయిష్ఠుడు కాడు. ఇలాగే సర్వవిధాలా భగవంతుని శరణుజొచ్చిన వాడికి కూడ ఏ దోషమూ కలుగదు. ఎందుచేతనంటే అతని మీద ఎవరి ఋణమూ ఉండదు.

దేవర్షిభూతాప్తనృణాం పితౄణాం న కింకరో నాయమృణీ చ రాజన్ ।
సర్వాత్మనా యః శరణం శరణ్యం గతో ముకుందం పరిహృత్య కర్తమ్ ॥
(శ్రీమద్భాగ. 11/5/41)

రాజా! సర్వకామములు విడిచిపెట్టి సంపూర్ణంగా శరణాగతవత్సలుడైన భగవంతుని శరణు పొందినవాడు దేవ, ఋషి, ప్రాణి, కుటుంబజన, పితృగణాలలో ఎవరికీ ఋణపడడు. సేవకుడుకాడు. దీనర్థమేమిటంటే - మనుష్యజన్మయొక్క వాస్తవిక ధ్యేయమైన

భగవంతునియందు లగ్నచిత్తుడై ఉన్నవాడు మాతాపితృసేవనుగాని పరివారాన్నిగాని త్యాగం చేసినా అతనికి దోషం అంటదు.

ప్రశ్న– ఇద్దరుముగ్గురు పిల్లలుంటే వారిలో ఎవడో ఒకడు సన్న్యాసి అయినా పర్వాలేదుకాని ఎవరికైనా ఒక్కడే కొడుకుండి అతడు సన్న్యాసి అయి కూర్చుంటే వాడి తల్లితండ్రులెవరి అండన బ్రతకాలి?

సమాధానము: ఆ కొడుకు తన తల్లిదండ్రులు బ్రతికి ఉన్నంతవరకు వారి సేవ చేస్తుండాలి. వారిని విడిచిపెట్టకూడదు. ఎందుచేతనంటే భగవత్ప్రాప్తికి సాధువవటం ఏమీ కారణంకాదు. పైగా సంసారంమీద విరక్తి భగవంతునిమీద భక్తి ఉండటమే కారణం. కనుక అతడు తల్లిదండ్రులసేవ చేస్తూనే భజన, స్మరణాదులు నిర్వహిస్తే అతనికి భగవత్ప్రాప్తి కలగటంలో ఏ బాధ ఉండదు. పైగా తల్లిదండ్రుల ప్రసన్నతవల్ల భగవత్ప్రాప్తిలో సహాయమే లభిస్తుంది. అంటే, తల్లిదండ్రుల ఋణం తీర్చుకోనిదే వాళ్లని త్యజించకూడదు. కాని తీవ్రవైరాగ్యం కలిగి భగవచ్చరణాలమీద అనన్యభక్తి కలిగినట్లయితే ఇటువంటి స్థితిలో తల్లిదండ్రుల సేవ భగ్నమయితే అందువల్ల అతనికి దోషం కలగదు.

ఇంట్లోకూర్చుని తల్లిదండ్రుల సంగతి పట్టించుకోక కేవలం భార్యాపుత్రుల పోషణలోనే మునిగి పోయేవారికి పాపం కలిగే తీరుతుంది. ఇలాగే తల్లిదండ్రుల్ని, కుటుంబాన్ని, గృహాన్ని, విడిచి సన్న్యాసియై ఇల్లు, ఆశ్రమము నిర్మించుకొని డబ్బుప్రోగుచేసి; శిష్యుల్ని, శిష్యురాండ్రనీ సమకూర్చుకొని విలాసంగా ఉండేవాడికి తల్లిదండ్రులసేవ చేయని పాపం తగిలే తీరుతుంది.

ప్రశ్న: ఎవడైనా సన్న్యాసియై డబ్బు పోగుచేసుకొని తల్లిదండ్రులకు భార్యాపుత్రులకు డబ్బు (ధనము) పంపిస్తూ వారిని పోషిస్తుంటే అతనికి దోషం కలుగుతుందా?

సమాధానము: సన్న్యాసియై తల్లిదండ్రాదులకి డబ్బుపంపేవాడు పాపాత్ముడే. ఇంకా వాడిచ్చిన సొమ్ముతో బతికే వాళ్ళూ పాపభుక్కులే. ఎందుచేతనంటే వాళ్లిద్దరూ కూడ శాస్త్రవిరుద్ధమైన పనులుచేస్తున్నవాళ్లే.

తల్లిదండ్రులసేవ అయితే వారు గృహస్థాశ్రమంలోనే ఉండి చేస్తారు కాని వారు విధివిహితం కాని పనిచేసి సన్న్యాసాశ్రమాన్ని కలుషితం చేస్తున్నారు కనుక అలా చేస్తే వారికి పాపం వచ్చేతీరుతుంది. వారు పాపం నుండి రక్షింపబడజాలరు.

ప్రశ్న: ఇంటిలో తల్లిని పోషించేవాడు గృహకార్యములను నిర్వర్తించేవాడు ఎవడూ లేకపోతే ఆ స్థితిలో సన్న్యాసి అయిన వాడు (కొడుకు) తల్లియొక్క పోషణ చేయవచ్చా? లేదా?

సమాధానము: తల్లికెవరూ ఆధారంలేనప్పుడు సాధువైనప్పటికీ అతడు తల్లిని పోషించవచ్చు. పోషించాలికూడాను. అసమర్థస్థితిలో ఇతరుల సేవకూడ చేయవలసి ఉండగా మరి తల్లి శరీరమిచ్చిందాయెను. ఆమె అసమర్థస్థితిలో ఉంటే ఆమెను సేవించటంలో ఆమెకు ఉపచారం చేయటంలో ఏమీ దోషంలేదు.

ప్రశ్న: కూతురైతే భర్త యింటికి వెళ్ళిపోతుంది. ఆమె తల్లిదండ్రులసేవ ఎలా చేయగలదు? సేవచెయ్యనిదే తల్లిదండ్రుల ఋణమెలా తీరుతుంది?

సమాధానము: ఎలాగయితే – ఎవడికైనా ఋణం తీర్చాలని ఉన్నప్పటికీ అది అధికమై తీర్చలేనిస్థితిలో ఉన్నప్పుడతడు ఋణదాత దగ్గరకు వెళ్ళి – "నేను, నాభార్యా పుత్రులు, ఇల్లు, పొలం మొదలైనవన్నీ మీకు సమర్పితమైనాయి. ఇప్పుడు మీరు వీటినెలా ఉపయోగించుకో దలచితే అలాచేసుకోవచ్చు" అని చెపుతాడో (చెప్పవలసివస్తుందో) అప్పుడతని మీద ఋణభారము లేకుండా ఋణం రద్దయిపోతుందో, అటులనే కన్య చిన్నప్పటినుంచి తల్లిదండ్రుల అధీనంలో ఉంటుంది. ఆమె తనకిష్టమయినదంటూ ఏదీ ఉంచుకోదు. తల్లిదండ్రులామెకు పెండ్లి చేసి ఎక్కడకు పంపితే అక్కడికి సంతోషంగా వెళ్ళిపోతుంది. తాను తన గోత్రాన్నికూడ పతిగోత్రంతో కలిపేస్తుంది. ఇటువంటి త్యాగంచేసిన ఆమె మీద తల్లిదండ్రులఋణమెలా ఉంటుంది? ఉండదు.

ప్రశ్న: తల్లిదండ్రులకే అండలేకపోతే ఇటువంటి స్థితిలో

**వివాహితపుత్రిక తల్లిదండ్రుల పోషణచేయవచ్చా? లేదా?**

సమాధానము: ఆమె నిస్సహాయులైన తల్లిదండ్రులసేవ చేయవచ్చు. వివాహితపుత్రికకు సంతానముంటే తల్లిదండ్రులామె యింటి అన్నోదకాలు స్వీకరించవచ్చు. ఆమె యింట ఉండవచ్చు. కాని ఆమెకు సంతానం లేకపోతేమాత్రం తల్లిదండ్రులకామె యింటి అన్నోదకాలు గ్రహించే అధికారం లేదు.

తల్లిదండ్రులు కన్యాదానం చేశారంటే ఇప్పుడువారు ఆమెయింటి అన్నం తినజాలరు. దానమిచ్చేసిన వస్తువుమీద దాతకధికారముండదుకదా! కాని కన్యకు సంతానం కలిగిన మీదట తల్లిదండ్రులు కన్యయింట అన్నం తినవచ్చు. కారణం అల్లుడు కేవలం పితౄణం నుంచి ముక్తుడవటానికే ఇతరుల కన్యను స్వీకరించాడు. ఆమెవల్ల సంతానం కలిగాక అతడు పితౄణంనుంచి ముక్తుడవుతాడు. కాబట్టి సంతానం కలిగాక తల్లిదండ్రులకు కన్యమీద అధికారం వస్తుంది. అందుచేతనే గోత్రం ఒకటి కాకపోయినా దౌహిత్రుడు (కూతురు కొడుకు) తన అమ్మమ్మకీ తాతయ్యకీ శ్రాద్ధతర్పణాదులు చెయ్యగలుగుతున్నాడు.

తల్లిదండ్రులు అసహాయస్థితిలో ఉండి వారికి సేవచేసే వారెవరూ లేకపోతే వారికి సేవచేసే బాధ్యత కూతురు మీదే ఉంటుంది. అందువల్ల తనకు సంతానం లేకపోయినప్పటికీ వివాహితపుత్రిక వారికి సేవచెయ్యాలి. రెండో విషయం - ఇప్పటి చట్టంలో తండ్రి ఆస్తిలో కొడుక్కి కూతురికి సమానమైన హక్కున్నట్టు భావింపబడింది. కనుక ఇప్పటి చట్టం దృష్టితో కూడ చూచినట్లయితే పుత్రికకు ఆస్తియిచ్చే అధికారమున్నప్పుడు ఆమెచేత సేవ చేయించుకొనే అధికారం కూడ తల్లిదండ్రులకుంటుంది.

----oOo----

# 5. స్త్రీ సంబంధ విషయాలు

ప్రశ్న: కన్య స్వయంవరం చేసుకోవచ్చా?

సమాధానము: శాస్త్రాలలో స్వయంవరం విషయం వస్తుంది. కాని స్వయంవరం చేసుకొన్నవారు కష్టాలే అనుభవించారు. సీత, ద్రౌపది, దమయంతి మొదలైనవారు దుఃఖితులే అయ్యారు. ఇప్పుడు స్వయంవరం చేసుకునే కన్యలు తామే పతినెన్నుకొంటున్నారు. తమ మనస్సుకు నచ్చినవారిని వివాహం చేసుకొంటున్నారు. వారేం సుఖపడుతున్నారు? వారూ దుఃఖమునే అనుభవిస్తున్నారు. దారితప్పి తిరుగుతున్నారు.

స్వయంవరం చేసుకొన్న కన్యయొక్క బాధ్యత ఆమె మీదే ఉంటుంది. తండ్రి కన్య మేలుకోరేవాడై ఉంటాడు. హితాభిలాషిగానే అతడు కన్యకోసం వరుణ్ణి వెదుకుతాడు. ఆమెకు సంబంధము స్థిరపరుస్తాడు. కనుక ఆ సంబంధం బాధ్యత తండ్రి మీదే ఉంటుంది. కన్యది కాదు. తండ్రిద్వారా సంబంధం జరిపించినప్పుడు కన్యవల్ల ఎక్కడైనా తప్పుజరిగినప్పటికీ అది క్షమింపబడుతుంది. కాని స్వయంవరం చేసుకొన్న కన్య తప్పు క్షమింపబడదు. కొడుకు తల్లిదండ్రుల సేవ తక్కువ చేసినా అంత దోషముండదు. ఎందుకంటే అతడు తల్లిదండ్రులవల్ల పుట్టాడు. అతడు తెలిసి సంబంధం కుదుర్చుకోలేదు. కాని తల్లి ఒడి విడిచిన కొడుకు తల్లిదండ్రుల సేవచేయకపోతే దానికి విశేషమైన దండన అనుభవించవలసి వస్తుంది. ఎందుకంటే అతడు తెలిసి సంబంధం కుదుర్చుకున్నాడు. ఎవడైనా ఎవరి దగ్గరైనా నౌకరీ చేస్తూ అందులో తప్పుచేస్తే దానికి క్షమాపణ ఉండదు. వాడు నౌకరి స్వయంగానే ఒప్పుకొన్నాడు కనుక. ఆః దయాళువైన యజమాని అతన్ని క్షమించవచ్చు. కాని అతడు క్షంతవ్యుడు కాడు. ఎవరైనా ఎవరినైనా తన గురువుని చేసుకుంటే అతడు గుర్వాజ్ఞ పాలించటం అతని విశేష బాధ్యత. అతడు గురువుయొక్క ఆజ్ఞ పాలించక గురువును తిరస్కరిస్తే, నిందిస్తే అతడు భయంకరమైన దండన అనుభవించాలి. అతణ్ణి భగవంతుడు కూడ క్షమించలేడు. భగవంతుడు కోపిస్తే మాత్రం గురువు క్షమించగలడు. కాని గురువాగ్రహిస్తే మాత్రం భగవంతుడుకూడ క్షమింపజేయలేడు. కనుక స్వయంవరం చేసుకొనే కన్యమీద విశేషమైన బాధ్యత ఉంటుంది.

[ 733 ] गृ० कैसे रहे ( तेलगू ) ३—

ప్రశ్న: కన్య పెండ్లిచేసుకోక భజనలోను, సాధనలోనే జీవనం గడపదలచుకోవటం మంచిదేనా?

సమాధానము: కన్య వివాహం చేసుకోకపోవటం మంచిది కాదు. ఎందుకంటే ఆమె స్వతంత్రంగా తన జీవనం గడపటం చాలకష్టం. వివాహం చేసుకొనకపోతే ఆమె జీవితము దుర్భరమవుతుంది. తల్లిదండ్రులున్నంత కాలం బాగానే ఉంటుంది. తల్లిదండ్రులు లేకపోతే సాధారణంగా సోదరులు తమభార్యలకు వశులై ఉండటంవల్ల సోదరినాదరించరు దానికిబదులుగా తిరస్కరిస్తారు. ఆమెను హీనదృష్టితో చూస్తారు. వదినెలు కూడ ఆమెను తిరస్కారదృష్టితో చూస్తారు. దీనివల్ల కన్య మనస్సులో పరాధీనత అనుభవమవుతుంది. కాబట్టి పెళ్లి చేసుకోవటం మంచిది.

వివాహానికి ముందునుంచే మేము స్త్రీ పురుష సంబంధం పెట్టుకోకుండా కేవలం సాధన భజననే చేస్తామని ప్రతిజ్ఞచేసి వారు తమ ప్రతిజ్ఞ పాలించుకుంటూ వచ్చిన స్త్రీ పురుషుల్ని కూడ మనం చూచాం. ఈ కాలంలో కేవలం సాధనకోసం, భజనకోసం మాత్రమే వివాహం చేసుకునే కుర్రవాళ్లు లభించటం కష్టమైనప్పటికీ అసంభవంకాదు.

మీరాబాయిలాగ చిన్నప్పటినుండీ భగవద్భజనలోను, భగవత్ స్మరణంలోను మునిగిపోయి ఉండేవాళ్ళ సంగతివేరు. కాని అది పద్ధతి కాదని భావం. ఈ భావంలో కూడా కాఠిన్యం కలుగుతుంది. మీరాబాయి జీవితంలో చాలా కష్టములనెదుర్కొన్నది. కాని భగవంతునిమీద ఉన్న దృఢమైన విశ్వాసంయొక్క బలంతో ఆ కష్టాలన్నీ గడచిగట్టెక్కింది. ఇటువంటి దృఢవిశ్వాసం చాల తక్కువ ఉంటుంది. ఇటువంటి దృఢవిశ్వాసమున్న వారే వివాహము చేసుకోవాలనే విధానమేదీ లేదు. చేసుకోకూడదని కూడా లేదు. శాస్త్రమేదీలేదు. భగవంతుడిమీద భక్తివిశ్వాసమున్న మనుష్యుడెక్కడ ఉన్నా అతడు శ్రేష్ఠుడే అవుతాడు.

ప్రశ్న: స్త్రీ సాధురాలుగాను సన్న్యాసినిగాను అవటం మంచిదా?

సమాధానము: సంసారంనుంచి వైరాగ్యం కలిగితే ఇల్లు మొదలైనవి విడిచి విరక్తుడై భగవద్భజనం, స్మరణం చేయటానికి పురుషుడికి

అధికారముంది. కాని స్త్రీలకిటువంటి ఆజ్ఞ ఎక్కడా చూడలేదు. అందువల్ల స్త్రీ సన్న్యాసిని కావటం తగదు. ఆమె ఇంటిలోనే ఉండి తన కర్తవ్యపాలనం చెయ్యాలి. ఇంటిలోనే త్యాగపూర్వకంగాను సంయమనంతో ఉండటంలోనే ఆమె మహిమ ఉంటుంది.

వాస్తవానికి త్యాగవైరాగ్యంలో ఉన్న తత్త్వం సన్న్యాసిని కావటంలో లేదు. ఆంతర్యంలో లౌకిక పదార్థాలకి దాసురాలుకాని స్త్రీ యింటిలో ఉన్నప్పటికీ సాధ్వియే సన్న్యాసినియే.

ప్రశ్న: పతివ్రత అని, సాధ్వీ అని, సతి అని ఎవరినంటారు?

సమాధానము: నిఘంటువు ప్రకారం పతివ్రత, సాధ్వి, సతి అనే మూడు మాటలు ఒకే అర్థం కలవైనప్పటికీ మూడింటిలోను తేడా చూడవలసివస్తే భర్త ఉండగా తన నియమం దృఢంగా పాటించే ఆవిడ పతివ్రత. పతిలేనప్పుడు తన నియమంలోను, త్యాగంలోను, పట్టుదలగా ఉన్నామె సాధ్వి. సత్యం పాటిస్తూ పతితో దృఢమైన సంబంధముండి పతి మరణించిన తరువాత అతనితోపాటు సహగమనం (అగ్నిలోపడటం) చేసిన స్త్రీని సతి అంటారు.

ప్రశ్న: పతికావటం (సతీసహగమనం) అనే ఆచారం మంచిదా? కాదా?

సమాధానము: సతీసహగమనమనేది ఆచారం కానేకాదు. భర్తతోపాటు శారీరకంగా కాలిపోవటం 'సతీ' అవటంకాదు. మానసికమైన శక్తి విశ్వాసములతో ఆ సమయంలో స్త్రీ నిప్పులేకుండానే దగ్ధమైపోతుంది. ఆపై ఆమె శారీరకంగా దగ్ధంకావటం ఏమీ కష్టంకూడ కాదు. ఆమె ఇలాగే చెయ్యాలి అని ఏ ఆచారం లేదు(నియమంలేదు) పైగా ఇది ఆమె శక్తి ధర్మముపై శాస్త్రమర్యాదపైనున్న నమ్మకంపై ఆధారపడివుంది.

"హరదోఈ" జిల్లాలో "ఇకనోరా" అనే గ్రామముంది. అక్కడ ఒకపిల్ల తన తాతగారి (తల్లి తండ్రి) యింటిలో ఉండేది. భర్త జబ్బుపడి అతడు చనిపోయాడు. ఆమెకు భర్త చనిపోయినవార్త అందింది. ఆమె మామతో

ఇట్లనెను – "సతి సులోచనకు పతియొక్క శిరస్సు లభించకపోతే ఆమె ఏమిచేసి ఉండేది?" అని.

**మామగారు** – "నాకేం తెలుసు" అన్నాడు.

**కోడలు** – "మామా! నేను సతిసహగమనము చేస్తాను" అంది.

**మామ** – "అలా చెయ్యవద్దమ్మా" అన్నాడు.

**కోడలు** – "నేను చేయటంలేదు. అవుతోంది" అని దీపంవెలిగించి దానిమీద వేలుంచేసరికి ఆ వేలు మైనపువత్తిలాగ కాలటం మొదలుపెట్టింది. ఆమె మామతో మీరు నాకు సతి కావటానికి ఆజ్ఞ ఇస్తున్నారా? లేదా? ఇవ్వకపోతే మీయీ ఇల్లుమొత్తం భస్మమైపోతుంది.

**మామగారు** –"సరే! నీయిష్టం వచ్చినట్లు చెయ్యి" అన్నాడు.

ఆమె మండుతున్న వ్రేలిని ఒక గోడకి రాసి ఆర్పేసింది. ఇంటినుండి బైటికి వెళ్లి ఒక రావి(పీపల్) వృక్షంక్రింద నిలబడి మామతో –"నాకు పుల్లలు ఇవ్వండి" అంది. మామ – "మేము పుల్లలివ్వం, నిప్పివ్వం" అన్నాడు. ఊరిజనం అక్కడ ప్రోగయ్యారు. ఆమె చేతులు జోడించి సూర్యభగవానుణ్ణి ప్రార్థించి – "ఓ నాథా! మీరు నిప్పివ్వండి" ఇలా అంటూనే ఆమె అక్కడ నిలబడినది. నిలబడే తనంతటతాను కాలిపోయింది. ఆ అగ్నిలో (పీపల్) రావి వృక్షపు ఆకులు కాలిపోయాయి. ఇదంతా ఊరిజనమందరూ తమకళ్లతో చూచారు. అక్కడి మహమ్మదీయులనడిగితే వాళ్లుకూడ – "ఇదంతా మా యెదుట జరిగింద"న్నారు. "కరపాత్రీ జీ" మహారాజు కూడ అక్కడికి వెళ్ళాడు. వారు గోడమీదనల్లటి మచ్చచూచారు. ఆమె అంటుకొని కాలుతున్న వేలు ఆర్పుకొన్న గోడమీద రావి వృక్షపు కాలిన ఆకులూ చూచారు.

ఇంతకి దీని ఉద్దేశ్యమేమిటంటే "సతి" అనేది ఆచారం కాదు. ఇది ఆమెయొక్క సొంతధార్మికోత్సాహం మాత్రమే. ఈ విషయంలో ప్రభుదత్త బ్రహ్మచారి "సతీధర్మ హిన్దూధర్మ కీ రీఢ్ హై" * అనే

---

* ఈ పుస్తకం లభించే చిరునామా –

సంకీర్తన భవన్, ధార్మిక ట్రస్ట్, ప్రతిష్ఠానపుర్ (ఝూసీ), అలహాబాద్.

పేరుతో హిందీలో పుస్తకం వ్రాశారు అది చదవాలి.

ప్రశ్న: పతివ్రత భావాలు, ఆచరణలు ఎలా ఉంటాయి?

సమాధానము: ఆమెలో ధార్మికభావాల ప్రాబల్యం ఉంటుంది. దానివల్ల ఆమె తనువుతోను మనస్సుతోను పతిసేవ చేస్తుంది. పతియొక్క మనస్సులోనే తనమనస్సు కలిపేస్తుంది. తనదంటూ ఏమీ ఉంచుకోదు. ఆమె మనస్సు పతిలోనే ఆకర్షితమై ఉంటుంది. ఆమెయొక్క ఈ పాతివ్రత్యమే ఆమెను రక్షిస్తుంది.

సాధారణంగా పతివ్రతయొక్క సంబంధం పూర్వజన్మకు చెందిన పతితోనే ఉంటుంది. అక్కడక్కడ చిన్నతనంలో కన్యకు మంచిశిక్షణ, మంచి సాంగత్యం లభించటం ద్వారా ఆమె భావాలు మంచివిగా ఏర్పడి ఉండటం చేతకూడ వివాహమయ్యాక పతివ్రతవటం కద్దు.

ప్రశ్న: పతివ్రతను గుర్తించడమేలా?

సమాధానము: పతివ్రత యింట శాంతినెలకొని ఉంటుంది. అందరు తమతమ ధర్మములు (కర్తవ్యాలు) నిర్వర్తించే వారుగా ఉంటారు. ఆమె సంతానంకూడ శ్రేష్ఠమైనది, తల్లిదండ్రులయెడ భక్తికలది అయివుంటుంది. ఇరుగు పొరుగు వారిమీద, ఆ పేటలోవారిమీద కూడ ఆమె భావాల ప్రభావం పడుతుంది.

పతివ్రతని చూచేవారికి దుర్భావం నశిస్తుంది. కాని అంతటా ఈ నియమం (వ్యాపించి) ఉండదు. ఎందుచేతనంటే పతివ్రతను చూచి తమలోపల మంచి భావాలు కూడ జాగృతమవుతాయి. లోపల సద్భావాలు, ఉత్తమసంస్కారం లేనివారి మీద పతివ్రత ప్రభావం అంతగా ఉండదు. ఉదా:- ఒక బోయవాడు దమయంతిని సర్పము నోటినుండి విడిపించాడు. కాని వాడు ఆమె రూపం చూచి మోహించాడు. అతనిలో దుర్భావం పుట్టింది. దమయంతి శాపంవల్ల వాడక్కడే భస్మమయ్యాడు. యుధిష్ఠిరుడు గొప్పధర్మాత్ముడు, సాత్త్విక పురుషుడు. కాని దుర్యోధనుడి

మీద ఆయన ప్రభావమేమీ పడలేదు.

ప్రశ్న: ప్రస్తుతకాలంలో పాతివ్రత్య ధర్మపాలనం సాధ్యపడుతుందా?

సమాధానము: పాతివ్రత్యధర్మపాలన చెయ్యటానికి ప్రస్తుతకాలం ఏమీ అడ్డంకికాదు. తమధర్మం పాటించటానికి అందరికీ ఎల్లప్పుడూ స్వాతంత్ర్యం ఉంటుంది. ధర్మవిరుద్ధమైన పనులు చెయ్యటంలోనే శాస్త్రము, ధర్మము, మర్యాద మొదలైనవి బాధకారకాలవుతాయి.

ప్రశ్న: పతి పత్నీత్యాగం చేయవచ్చా?

సమాధానము: పత్ని మంచిది, సుశీలవతి, కాని అంతగా రూపసి కాదు. అత్తగారితో ఆమె సఖ్యముగా ఉండదు. అత్తగారి మాటకు విలువ ఇవ్వదు. ఆ పరిస్థితిలో అతని తల్లి ఆమెను విడిచి వేయమని సలహా ఇస్తుంది. ఆ సలహాను పాటించిన యెడల ఆ వ్యక్తి ఘోరమైన అన్యాయమును చేస్తున్నట్లుగా భావించవలెను. అట్టియెడల అతడు నరకానికి వెళ్తాడు. నేటి యువకులు భార్యను దోషిగా నిర్ణయిస్తున్నారంటే ఎప్పటికీ వారు స్వచ్ఛముగానే యున్నారని భావమా? కాబట్టి భార్య నెప్పటికీ విడువరాదు.

ప్రశ్న: పత్ని దుశ్చరిత్ర కలది, వ్యభిచారిణి అయితే ఆమెను విడిచిపెట్టాలా? వద్దా?

సమాధానము: ఇప్పటి కాలప్రభావాన్ని బట్టి భార్యను పరిత్యజించరాదు. అట్టియెడల తమ సామర్థ్యాన్ని బట్టి, శాసించి అయినా, ఆమె బాగుకొరకై ప్రయత్నించవలెను. ఒకవేళ ఆమెను శిక్షించవలసిన పరిస్థితి ఏర్పడితే మాట్లాడుట, ఆమె చేతివంట తినుట మానుకోవాలి.

ప్రశ్న: పతియొక్క సగం పుణ్యం పత్నికి, పత్నియొక్క సగం పాపం పతికి లభిస్తుంది. ఇలా ఎందుకు?

సమాధానము: పత్ని తన తల్లిదండ్రుల్నీ, అన్నవదినల్నీ మొదలైన వాళ్లనందర్నీ వదలి త్యాగం చేసింది. పుణ్యం త్యాగంవల్ల కలుగుతుంది. ఆమె తన గోత్రంకూడ త్యజించి పతియొక్క మనస్సుతో తన మనస్సు

కలిపింది. అందువల్ల ఆమె పుణ్యం పొందేదవుతుంది. పతి సంధ్యావందనం, గాయత్రీ జపం మొదలైనవి చేస్తున్నాడంటే దానియొక్క సగం ఫలం పత్నికి లభిస్తుంది. ఇందువల్లనే పతికి రెండు యజ్ఞోపవీతాలుంటాయి. (జంధ్యాలు – ఒకటి బ్రహ్మచారిగా పొందింది. రెండవది వివాహానంతరము లభించినది. ఒకటి తనది, మరొకటి పత్నిది.

స్త్రీకి చిన్నతనంలో విద్యాభ్యాసాది శిక్షణలిచ్చుట (చదువుచెప్పించటం) తల్లితండ్రులు, సోదరులు మొదలైనవారి చేతుల్లో ఉంటుంది. పరిణయానంతరం శిక్షగరపటం పతిచేతిలో ఉంటుంది. భర్త మంచి శిక్షణ ఇవ్వకపోవటంవల్ల భార్య పాపంచేస్తే దాని సగం పాపం పతికి తగులుతుంది.

పతి మంచిశిక్షణ ఇచ్చినప్పటికీ భార్య భర్త చెప్పింది వినక పాపంచేస్తే దాని సగభాగం పతికి తగలదు. ఎందుచేతనంటే ఆమె తన బాధ్యత తనమీదే వేసుకుంది. ఇలాగే పతి ఆజ్ఞను పాటిస్తూ పతియొక్క అధీనంలో ఉండే స్త్రీ భర్తయొక్క సగంపుణ్యము పాలుపంచుకొనే దవుతుంది. పతి ఆజ్ఞానుసారము నడుచుకొనని స్త్రీ పతియొక్క అర్ధపుణ్యానికి హక్కుదారుకాదు.

**ప్రశ్న: అన్య మతస్థుడు (మతభ్రష్టుడుగాని) ఏ స్త్రీనైనా అపహరించి తీసుకుపోతే ఆమె ఏంచెయ్యాలి?**

సమాధానము: ఆమె వీలయినంతవరకు అక్కడనుంచి తప్పించుకునేందుకు ప్రయత్నించాలి. అదనుదొరికినప్పుడు అక్కడినుండి పారిపోవాలి. ఏ ఉపాయమూ ఫలించకపోతే భగవంతుణ్ణి ప్రార్థించాలి. భగవంతుడేదో విధంగా విడిపిస్తాడు.

ఒకస్త్రీని నోట్లోగుడ్డలు క్రుక్కి, రెండుచేతులూ వెనక్కి (విరిచి) కట్టి పైనుంచి బురఖాకప్పి పరమతస్థులు రైల్లోతీసుకుపోతున్నారు. లక్నో స్టేషన్‌లో టి.టి (ట్రావెలింగ్ టికట్ ఎగ్జామినర్)టిక్కెట్టుచూడటానికని ఆమె దగ్గరకి వచ్చి నిలబడ్డప్పుడు ఆ స్త్రీ తన కాళ్లతో టి.టి కాలుతొక్కి పెట్టింది.

టి.టి ఈమె నాకాలు ఎందుకు తొక్కిపెట్టిందా? అని ఆలోచించాడు. ఇందులో ఏదో రహస్యముంది. అతడు రైల్వేపోలీసుని పిలిచాడు. పోలీసు పరీక్షించి ఆ స్త్రీని విడిపించాడు. ఆమె నపహరించిన వాళ్లని పట్టుకున్నాడు. ఇలాగే "నోవాఖాలీ"లో అన్యమతస్థుడు ఒకస్త్రీని పట్టుకుంటే ఆమె భగవంతుణ్ణి పిలిచింది (ప్రార్థించింది) ఇంతలో మరొక విధర్మి (అన్యమతస్థుడు) వచ్చి ఈమెను నేను నా భార్యగా చేసుకుంటాననటం మొదలుపెట్టాడు. ఈ విషయంలో వాళ్ళిద్దరిమధ్య పోట్లాటజరిగింది. వారిద్దరూ పరస్పరం పోరాడుకొని చచ్చిపోయారు. ఆ స్త్రీ రక్షింపబడింది.

ప్రశ్న: అన్యమతస్థులచేత అపహరింపబడిన స్త్రీయొక్క పురుషుడి (భర్తయొక్క) కర్తవ్యమేమిటి?

సమాధానము: ఆ పురుషుని కామెను రక్షించేశక్తి ఉండి మనఃపూర్వకంగా ఆమె తనదనే నమ్మకముంటే సంతోషముగా ఇంటికి తీసుకుని రావాలి. ఆమె బలాత్కరింపబడి, శీలము కోల్పోయినది కాని ఇచ్ఛాపూర్వకముగా ధర్మభ్రష్టురాలు కాలేదు కనుక ఆమె పాతివ్రత్యము చెడినట్లు భావించకూడదు. అందుచేత ఆమె తిరిగివచ్చినప్పుడు గీత, రామాయణ, భాగవతాది పాఠంద్వారాను అలాగే గంగాస్నానం చేయించటం ద్వారాను శుద్ధిచెయ్యాలి. ఇదంతా చేశాక ఆమె రజస్వల అయినప్పుడు (ముట్టయినప్పుడు) సర్వధా శుద్ధురాలవుతుంది. "రజసా శుద్ధ్యతే నారీ".

జమదగ్నిఋషి పత్ని రేణుక ప్రతిరోజూ తన పతివ్రతాధర్మ ప్రభావంవల్ల బట్టలోనీరునింపి తెస్తుండేది. ఒకనాడామెకు నదీతీరంలో బంగారంలా ప్రకాశించే అందమైన జుట్టు (వెంట్రుక) కనిపించింది. ఈ వెంట్రుకలే ఇంత అందంగా ఉన్నాయంటే ఆ పురుషుడెంత అందంగా ఉంటాడు?" అని ఆమె మనస్సులో అనిపించింది. ఇలా మనోవికారం కలుగగానే ఆమెధర్మం నశించింది. ఇంక వెనుకటిలాగ బట్టలోనీరు మూటకట్టి తేలేకపోయింది.

ఇంద్రుడు గౌతమ మహర్షిరూపం ధరించి అహల్యని భ్రష్టపరచినా ఆమె ధర్మం భ్రష్టంకాలేదు. కాని ఆమె పాతివ్రత్యం నశించింది.

పతివచ్చి కోపంతో ఆమెను రాతినిచేసినప్పటికీ శ్రీరాముడు ఆమె నుద్ధరించాడు. ఎందుచేత? ఆమె తన ధర్మంలో దృఢంగా ఉంది.

గీతాప్రెస్ సంస్థాపకులు శ్రీజయదయాల్ జీ గోయన్దకా గారు చిత్తశుద్ధి పవిత్రతల విషయంలో చాల భావాలు కలిగి ఉండేవారు. ఆయన ఇట్లనెను – "అన్యమతస్థులు బలాత్కారము చేసి భ్రష్టపరచిననూ స్త్రీలధర్మం భ్రష్టంకాదు" అని. కాబట్టి వారు హిందూధర్మంలోకి రావాలనుకొంటే వారిని తిరిగి తేవాలి. గంగాస్నాన, గీత, రామాయణ పారాయణాదులతో శుద్ధిచెయ్యాలి. ఆయన ఇది కూడ చెప్పారు. ఇతరధర్మాన్ని పాటించేవ్యక్తి హిందూ మతమును స్వీకరించదలిస్తే సహకరించాలి. అంటే – అతడూ హిందువుకాగలడు. హిందూమత పద్ధతి ప్రకారం జప ధ్యానపూజా పారాయణాదులు చేసుకోవచ్చు" అని.

ప్రశ్న: పత్ని తాను బుద్ధిపూర్వకంగానే ఎక్కడకో పోయి మళ్లీ తిరిగి వస్తే ఏం చెయ్యాలి?

సమాధానము: ఆమెను తన పత్నిగా భావించరాదు. ఆమెతో భార్యలాగ వ్యవహరించకూడదు. ఉదా:– సంత్‌కూబాజీమహారాజ్ పత్ని ఆయన్ని విడిచిపెట్టి వేరెవరిదగ్గరికో వెళ్లిపోయింది. అక్కడ ఆమెకు సంతానంకూడ కలిగింది. కాని ఆమె రెండవ భర్త మరణించాడు. ఇక ఆమె జీవితము దుర్భరమైనది. కాబట్టి ఆమె మళ్లీ కూబాజీ దగ్గరకు వచ్చింది. కూబాజీ ఆమె బ్రతకటానికి అన్నవస్త్రాదుల యేర్పాటు చేశారు. కాని ఆమెను తన పత్నిగా స్వీకరించలేదు.

ప్రశ్న: భర్త దుశ్చరిత్రుడైతే భార్య ఏం చెయ్యాలి?

సమాధానము: చెడునడతగల భర్తని భార్యవిడిచిపెట్టకూడదు. పైగా తన పతివ్రతాధర్మం పాటిస్తూ ఆయనకు బోధించాలి. తెలియజెప్పాలి. మందోదరి రావణుడికి ధర్మబోధ చేసినదికాని అతనిని పరిత్యజించలేదు.

వివాహ సమయంలో స్త్రీపురుషులిద్దరూ పరస్పరం ప్రతిజ్ఞ చేసుకుంటారు. ఆ ప్రకారం పతికి సలహా ఇవ్వటానికీ పతితో తన

మనస్సులో మాట చెప్పుకోవటానికీ పత్నికధికారముంది. గాంధారి ఎంతటి ఉన్నతస్థాయి పతివ్రత. తనతో పెళ్లయ్యేనాటికి ఆయనకి కళ్ళులేవని విని ఆమె తన కళ్లకి గంతలు కట్టుకుంది. భర్తకులేని కంటిచూపు (గుడ్డితనము) తనకూ అక్కరలేదు. కాని సమయం వచ్చినప్పుడు ఆమె కూడ "మీరు దుర్యోధనుని మాటవినకూడదు. వినినచో కులనాశనము తప్పదు." అని భర్తకు (ధృతరాష్ట్రుడికి) తెలియజెప్పింది. ఇలాంటి సలహా ఇచ్చే పూర్తి అధికారం పత్నికుందన్నమాట.

శాస్త్రాలలో – మనస్సుతోను తనువుతోనూ పతిసేవచేస్తూ తన ధర్మంపాలిస్తున్న పతివ్రత మృత్యువు తరువాత పతిలోకానికి (పతిదగ్గరకు) వెడుతుందని ఉంది. పతి చరిత్రహీనుడైతే అతనిలోకం నరకం కావాలి. కనుక పతివ్రతయొక్క లోకంకూడ నరకమేకావాలి. కాని పతివ్రత నరకానికి వెళ్ళదు. ఎందుచేత? ఆమె శాస్త్రంయొక్క, భగవంతునియొక్క మహాత్ములయొక్క ఆజ్ఞను పాటించి పతివ్రతాధర్మపాలనం చేసింది. కనుక ఆమె తన పతివ్రతధర్మప్రభావంచేత భర్తనుద్ధరిస్తుంది. అంటే పత్నికివచ్చిన (ఉత్తమ) లోకమే పతికీ వస్తుంది. తన కర్తవ్యపాలనంచేసే వ్యక్తి ఇతరుల్ని కూడ ఉద్ధరించగలవాడవుతాడని తాత్పర్యం.

ప్రశ్న: భర్త భార్యను వ్యభిచారం చేయమని ప్రేరేపిస్తే భార్య ఏం చెయ్యాలి?

సమాధానము: తన భార్యను పరులకు దానమిచ్చుటకు భర్తకధికారము లేదు. ఎందువలనంటే ఆ కన్యను కన్యాదాతనుండి తనొక్కడే గ్రహించాడు. అదియునుగాక కన్య యనగా వస్త్రములవలె ఒకపదార్థముకాదు, తన కవసరము లేనిచో వేరొకరికిచ్చుటకు. ఇట్టి పరిస్థితి ఎదురైన యెడల ఆ కన్యకు ప్రశ్నించే అధికారము కూడ ఇవ్వబడినది. కావున ఆ సమయములో ఆమె భర్త మాటను మన్నించక పోయినను తప్పులేదు. పాపమును ప్రోత్సహించిన వ్యక్తి కూడా పాపియగును. భర్త నరకమునకు పోయిన ఆ దోషమునకు బాధ్యురాలు భార్యకూడా యగును. అందువలన అది భర్త ఆజ్ఞే అయినప్పటికీ పాటించడం తగదు.

భర్త తానుకూడ శాస్త్రనియమానికి విరుద్ధంగా స్త్రీసంగమం చేస్తే అతడన్యాయముగా పాపము చేస్తున్నట్లుగా భావించాలి. ధర్మయుక్తమైన కామం భగవత్స్వరూపం. "ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ" (గీత. 7/11) అందుచేత ఇందులో దోషమును, పాపమును లేదు. పైగా ధర్మవిరుద్ధంగా స్త్రీని స్వేచ్ఛగా (కామంలో) ఉపయోగించుకోవటం అన్యాయము. మానవుడెల్లప్పుడూ ప్రత్యేకమైన పనులను శాస్త్రమర్యాదకనుగుణంగానే చెయ్యాలి. (గీత. 16/24)

**ప్రశ్న: భర్త మద్యమాంసాలు సేవిస్తుంటే భార్య ఏం చెయ్యాలి?**

సమాధానము: నిషిద్ధకార్యాచరణ నుండి భర్తను మరలించాలి. వినకున్నను తెలియచెప్పుట స్త్రీ ధర్మము. ఆ అధికారమామె కివ్వబడినది. వీలుకాకున్న తన ఆహారాదులనైనను పవిత్రముగా కాపాడుకోవాలి.

**ప్రశ్న: పతి దండిస్తూ దుఃఖం కలిగిస్తుంటే పత్ని ఏం చెయ్యాలి?**

సమాధానము: పత్ని ఇది నాపూర్వజన్మకృతమే. ఋణం ఈ రూపేణ తీరుతోందనుకోవాలి. నా పాపం తరుగుతోంది నేను శుద్ధురాలను అవుతున్నాననుకోవాలి. పుట్టింటి వారికీ సంగతి తెలిస్తే ఆమెను వారు తమ యింటికి తీసుకుపోవచ్చు. ఎందుకంటే వారు హింసించుటకు తమ పిల్లనివ్వలేదు.

**ప్రశ్న: పుట్టింటివారుకూడ ఆమెను తమయింటికి తీసుకొని వెళ్ళకపోతే ఆమె ఏం చెయ్యాలి?**

సమాధానము: అలా అయితే ఆమె తన పూర్వకర్మ ఫలమనుభవించాలి. అంతకంటే పాపమామేమి చేస్తుంది? ఆమె భర్త పెట్టేబాధలు ధైర్యంగా సహించాలి. సహించటంవల్ల పాపాలు తరిగిపోతాయి. తర్వాత భర్త ప్రేమించటంకూడ సంభవించవచ్చు. ఆమె భర్తపెట్టే బాధలు సహించలేకపోతే అతనితో చెప్పి వేరు పడిపోవాలి. వేరే ఉండి తన జీవిక గడుపుకొనే పనులు చేసుకుంటూ భగవద్భజన, స్మరణము చేసుకుంటూ నిర్భయంగా ఉండాలి.

పురుషుడెప్పుడూ స్త్రీమీద చెయ్యి చేసుకోకూడదు. శిఖండి భీష్ముణ్ణి చంపటానికే పుట్టాడు. కాని అతడు యుద్ధంలో భీష్ముడి ముందుకు వచ్చినప్పుడు భీష్ముడు బాణ ప్రయోగం ఆపివేశాడు. కారణం? శిఖండి పూర్వజన్మలో స్త్రీ. ఈ జన్మలోకూడ స్త్రీరూపంతోనే పుట్టాడు. తర్వాత అతనికి పురుషత్వం ప్రాప్తించింది. కాబట్టి భీష్ముడతన్ని స్త్రీగానే భావించి అతని మీదకి బాణప్రయోగం చెయ్యలేదు.

ఆపత్కాలం పాపం కారణంగానే సంప్రాప్తిస్తుంది. అప్పుడు ఉత్సాహపూర్వకంగా భగవత్స్మరణం, భజన చెయ్యటంవల్ల రెట్టింపు ఫలితం కలుగుతుంది. ఒకటి పాపం నశించటం. రెండవది భగవదారాధనవల్ల భగవంతునిమీద విశ్వాసం పెరగటం. అందువల్ల ఆపదవచ్చినప్పుడు స్త్రీలు ధైర్యం కోల్పోకూడదు.

ఆపదవచ్చినప్పుడు ఆత్మహత్య చేసుకోవాలనే ఆలోచనకూడ మనస్సులోకి రానివ్వకూడదు. ఆత్మహత్య చేసుకుంటే మహాపాపం వస్తుంది. ఎవరినైన హత్యచేస్తే వచ్చే పాపమే ఆత్మహత్యవల్ల కలుగుతుంది. మానవుడు ఆత్మహత్య చేసుకుంటే తన దుఃఖం పోతుందని సుఖవంతుణ్ణవుతానని భావిస్తాడు. కేవలం ఇది మూర్ఖత్వం. ఎందుచేతనంటే పూర్వపాపాలయితే తరగలేదు. ఇంకా క్రొత్తపాపం చేసుకున్నాడు. ఆత్మహత్యాప్రయత్నంచేసి బతికినవారివల్ల ఆత్మహత్య చేసుకోవటంలో చాల పెద్దకష్టముందనే పశ్చాత్తాపం కలుగుతుందని, (ఇలా చెయ్యకపోతే బాగుండేది. ఇప్పుడేం చెయ్యను?) వింటాం. ఆత్మహత్య చేసుకొనేవాళ్లు సాధారణంగా భూతప్రేతాలవుతారనీ అక్కడ ఆకలి దప్పికలతో ఉంటారని, దుఃఖపడతారనీ అంటారు. అర్థమేమిటంటే ఆత్మహత్య చేసుకొనేవారు గొప్పదుర్గతి పాలవుతారు.

ప్రశ్న: భర్త పరిత్యజిస్తే స్త్రీ ఏం చెయ్యాలి?

సమాధానము: ఆమె తన తండ్రియింట ఉండాలి. తండ్రి యింటిలో ఉండటం కుదరకపోతే అత్తవారి యింట గాని పుట్టింటికిగాని లేదా స్వతంత్రజీవనము గడపాలి. మర్యాదతో సంయమంగా బ్రహ్మచర్యంతో తన

ధర్మం పాటించాలి. భగవద్భజనం చెయ్యాలి. తండ్రినుంచిగాని అత్తవారి యింటినుంచిగాని లభించినదేదైనా ఉంటే దానితో జీవనం గడపుకోవాలి. ధనమేది లేకపోతే ఇంటిలోనే ఉండి తన చేతనైన పనిచేస్తూ (నూలువడకడము, పూలుగ్రుచ్చడము, కుట్టుపని మొదలగునవి) జీవనం గడపుకోవాలి. ఇది కష్టమే. మరి తపస్సులో కష్టమే ఉంటుంది. సుఖంలేదు. ఈ తపస్సువల్ల ఆమెలో ఆధ్యాత్మిక తేజస్సు పెరుగుతుంది. ఆమె అంతఃకరణం శుద్ధమౌతుంది.

కూతురు (చెల్లాయి) ధర్మమూర్తి. ఈమెను పోషించటంవల్ల చాల పుణ్యం వస్తుందని తల్లిదండ్రులకి, అన్నావదినలకి మొదలైన వారికి అనిపించేలాగ వారికి విశేషదృష్టి కలిగించాలి. వారు యీ మాటలు అక్షరాల చరితార్థం చేసుకోవాలి. "బిపతి కాల కర సతగున నేహా" (మానస. కిష్కింధా. 7/3) ఆపత్సమయంలో సోదరి కూతురు మొదలైనవారితో వందరెట్లు స్నేహంగా ఉండాలని అర్థం. ఒక వేళ వారిలా చెయ్యలేకపోతే అమ్మాయి - "అడవిలో ఉండే ప్రాణుల్ని భగవంతుడు పోషిస్తున్నాడు. అలాంటప్పుడు నన్ను పోషించడా! అందరికీ ప్రభువైన భగవంతుడుండగా నేననాథనెట్లవుతాను?" అనుకోవాలి. ఈ విషయం దృఢంగా మనస్సులో పెట్టుకొని భగవంతుడిమీద భారంవేసి నిస్పందేహంగా, నిర్భయంగా, శోకంలేకుండా, నిశ్చింతగా ఉండాలి ఒక వితంతువుంది. ఆమె దగ్గర ధనములేదు. అత్తవారు ఆమె నగలుకూడ తీసేసుకున్నారు. "నాకు చింతలేదు. జానెడు పొట్టకోసం మరిచింత దేనికి?" అని ఆమె అంటుండేది.

ఆడపిల్లలకు చిన్నప్పటినుండి నూలు వడకటం, పూలుగుచ్చటం, కుట్టుపనులు, అల్లికలు, చదవటం, చదివించటం మొదలగు వాటిలో శిక్షణ నిప్పించాలి. పెళ్లయిన తరువాత పతిసేవలో లోటుంచకూడదు. కాని లోపల భారం భగవంతుడిమీద ఉంచాలి. అసలైన అండ దేవుడే. ఇటువంటి అండ పతిదికాదు. పుత్రుడిదికాదు. శరీరానిది కూడ కాదు. ఇది అక్షరాల నిజం. అందువల్ల భర్తవిడిచిపెడితే భయపడకూడదు. తన తప్పేమీ లేకపోతే పూర్తిగా నిర్భయంగా ఉండాలి. హృదయంలో బలహీనతనేది తన ఆలోచన, ఆచరణ సరిగా లేకపోతేనే కలుగుతుంది. తన ఆలోచన ఆచరణ

సరిగా ఉంటే హృదయంలో బలహీనత ఎప్పుడూరాదు. కాబట్టి తన భావాల్ని నడతలనీ ఎల్లప్పుడూ శుద్ధముగా పవిత్రముగా ఉంచుకుంటూ భగవద్భక్తి కలిగి ఉండాలి. భగవంతుడి మీద భారముంచి ఏ విషయానికీ చింతించరాదు.

ఈనాటి యువకులు స్త్రీలను విడిచిపెట్టకూడదు. స్త్రీని త్యజించుట మహాపాపం. చాల అన్యాయం. ఇలా చేసేవారు భయంకర నరకానికి పోతారు.

ప్రశ్న: పురుషుడు రెండవపెళ్ళి చేసుకోవచ్చా? కూడదా?

సమాధానము: మొదటిభార్యవల్ల సంతానం కలగకపోతే పితృఋణం నుంచి విముక్తిపొందటానికి, కేవలం సంతానోత్పత్తికోసం పురుషుడు శాస్త్రవిధి ప్రకారం ద్వితీయ వివాహం చేసుకోవచ్చు. అతడు సుఖభోగాలకోసం రెండవపెళ్లి చేసుకోకూడదు. ఎందుచేతనంటే ఈ మనుష్యశరీరం తన సుఖభోగాలకోసంకానే కాదు.

పునర్వివాహం తన మొదటిభార్య ఆజ్ఞతోను, సమ్మతితోనే చేసుకోవాలి. పత్నికూడ అతడు పితౄణంనుంచి విముక్తుడు కావటానికే పునర్వివాహానికనుమతి(ఆజ్ఞ) ఇవ్వాలి. పునర్వివాహం చేసుకున్నాకూడ పతి తన పూర్వపత్నియొక్క అధికారాన్ని సురక్షితంగా ఉంచాలి. ఆమెను తిరస్కరించటం నిరాదరించటం ఎప్పుడూ చేయకూడదు. పైగా ఆమెను పెద్దదానిగా భావించి యిద్దరూ ఆమెను గౌరవించాలి.

సంతానం కలిగిన తరువాత భార్య మరణిస్తే అతడు పునర్వివాహం చేసుకోవలసిన అవసరమే లేదు. అతడు పితౄణం నుంచి ముక్తుడైనాడు కనక భోగాసక్తి నశించనివాడు చేసుకోవాలి. ఎందుచేతనంటే అతడు పునర్వివాహం చేసుకోకపోతే వ్యభిచార ప్రవృత్తి కలిగియుంటాడు. వేశ్యాగామి అవుతాడు. దానివల్ల అతనికి భయంకరపాపం సంభవిస్తుంది. కాబట్టి ఈ పాపంనుంచి రక్షింపబడటానికి (తప్పించుకోవటానికి) మర్యాదగ ఉండటానికి అతడు శాస్త్రవిధిననుసరించి పునర్వివాహం చేసుకోవాలి.

ప్రశ్న: పూర్వం రాజులు అనేక వివాహాలు చేసుకొనేవారు. అలా చెయ్యటం (అప్పుడు) మంచిదా?

సమాధానము: తమ సుఖభోగాల (విలాసాల)కోసం ఎక్కువ వివాహాలు చేసుకొనే రాజులు ఆదర్శంగా పరిగణింపబడేవారు కారు. రాజయినంత మాత్రాన ఎవరూ ఆదర్శంకారు. శాస్త్రప్రకారం మెలగుతూ ధర్మంగా పాలించేరాజులే ఆదర్శంగా భావింపబడతారు.

వాస్తవానికి వివాహం చేసుకోవటం ఉన్నతస్థాయి విషయమేమీ కాదు. ఆవశ్యకమూ కాదు. పరమాత్మప్రాప్తి నందుకోవటం ఆవశ్యకం. ఇందుకని మనుష్య శరీరం లభించినది. వివాహం చేసుకోవటానికి కాదు. ఈ విశ్వములో దేవతలు మొదలుగా భూత, ప్రేత, స్థావరజంగమాది జీవులందరు సృష్టికార్యమును నిర్వర్తించవలసినదే. ఇది గొప్ప విషయమేమి కాదు. కాని పరమాత్మప్రాప్తియొక్క సమయమూ అవసరమూ అధికారము యోగ్యత మొదలైనవి మాత్రం మనుష్యజన్మలోనే ఉన్నాయి. మానవుడు పరమాత్మ ప్రాప్తికి పుట్టుకతోనే అధికారి. ఆలోచన ద్వారా తన విషయాసక్తిని భోగాసక్తిని విడిచిపెట్టలేని బలహీనతగల మనుష్యులకోసమే వివాహవిధి యేర్పడింది. భోగాలనుభవించి వాటినుంచి విరక్తులవటానికే, వాటియందు అరుచి యేర్పడటానికే గృహస్థాశ్రమంలో ప్రవేశించాలి. విషయాసక్తిని విడువలేని వారిమీదే పితౄణం ఉంటుంది. అంటే – "ఉపకుర్వాణ బ్రహ్మచారిమీదే వంశ పరంపరను నడపవలసినబాధ్యత ఉంటుంది. నైష్ఠిక బ్రహ్మచారిమీద భగవద్భక్తుడిమీద ఉండదు. అంటే భోగాసక్తిని నశింపచేసుకోలేని వాడిమీద పితౄణముంటుంది. భోగాసక్తి లేనివాడిమీద ఏ ఋణమూ ఉండనే ఉండదు. వాడు కర్మయోగికానీ, జ్ఞానయోగికానీ, భక్తియోగి మొదలైన వాడెవడైనా అగుగాక. "ఆదాయము" మీదే "పన్ను" విధిస్తారు. సరుకుమీదే సుంకంపడుతుంది. "ఆదాయము" లేనివాడిమీద "పన్ను" దేనికి? సరుకేలేకపోతే సుంకమెందుకు?

ప్రశ్న: స్త్రీ పునర్వివాహమెందుకు చేసుకోకూడదు?

సమాధానము: తల్లిదండ్రులు కన్యాదానం చేశారంటే ఇక ఆమెకు

కన్య అనే పేరులేదు. అందుచేత ఆమెను మళ్లీ దానం చెయ్యటమెలా కుదురుతుంది? ఇప్పుడామెకు పునర్వివాహం చెయ్యటం పశుధర్మమే.

సకృదంశో నిపతతి సకృత్కన్యా ప్రదీయతే ।
సకృదాహ దదానీతి త్రీణ్యేతాని సతాం సకృత్ ॥
(మనుస్మృతి 9/47; మహాభారతం-వనపర్వం. 294/26)

కుటుంబంలో ధనము మొదలైన వాటిపంపకం ఒకసారే జరుగుతుంది. కన్య ఒక్కసారే దానం చేయబడుతుంది. "నేను ఇస్తాను". అనే వాగ్దానం కూడ ఒకసారే చెయ్యబడుతుంది. సత్పురుషుల ఈ మూడు పనులు ఒకేసారి జరుగుతాయి.

శాస్త్రీయ, ధార్మిక, శారీరక, లౌకిక దృష్టిలు నాల్గింటితోను స్త్రీకి పునర్వివాహం చెయ్యటం అనుచితం. శాస్త్రీయ దృష్టితోచూస్తే శాస్త్రంలో స్త్రీకి పునర్వివాహాని కాజ్ఞ లేదు. ధార్మిక దృష్టితో చూస్తే పితౄణమనేది పురుషుడిమీదే ఉంటుంది. స్త్రీ మీద పితౄణాది ఋణమేదీ ఉండదు. శారీరక దృష్టితో చూస్తే స్త్రీలో కామశక్తి నణచుకొనే సత్తువ ఉంది. మనోబలముంది. వ్యావహారిక దృష్టితోచూస్తే పునర్వివాహం చేసుకొన్నాక ఆమెయొక్క పూర్వ సంతానమెక్కడికెడుతుంది? వారి మంచిచెడ్డలు చూచేవారెవరు? ఆమెను పెళ్లిచేసుకొన్నవాడు ఆ సంతానాన్ని స్వీకరించడు. అందుచేత స్త్రీజాతి పునర్వివాహం చేసుకోకుండ సంయమంతో బ్రహ్మచర్యం పాటించాలి.

అయిదారుగురు సంతానముండీ పతిమరణించిన తరువాత బ్రహ్మచర్యం పాటించినట్లయితే ఆమె నైష్ఠిక బ్రహ్మచారిగతిని పొందుతుందనికూడ శాస్త్రంలో చెప్పబడింది. సంతానంలేక పతిమరణానంతరం బ్రహ్మచర్యం పాటిస్తే ఆమెకు నైష్ఠిక బ్రహ్మచారిగతి లభిస్తుందని వేరే చెప్పేదేముంది?

ప్రశ్న: యువతియైన స్త్రీ వితంతువయితే ఆమె ఏంచెయ్యాలి?
సమాధానము: జీవించి ఉండగా భర్త ఏ విషయాలు ఇష్టపడేవాడో

ఏ విషయా లాయనకనుకూలంగా ఉండేవో, ఆయన మరణానంతరంకూడ వితంతువైన స్త్రీ వాటికనుగుణమైన ఆచరణమే చేస్తుండాలి. భగవంతుడు కల్పించిన యీ ప్రతికూలత నా తపస్సు కోసమే. తెలిసిచేసిన తపస్సుకంటె ఈ తపస్సు చాల ఉన్నతమైనది. దైవవిధానాన్ననుసరించి చేసే తపస్సుకి, సంయమానికి చాల ఎక్కువ మహిమ ఉందనుకోవాలి. ఇలా ఆలోచించుకొని ఆమె మనస్సులో ఎల్లవేళలా ఉత్సాహం నిలబెట్టుకోవాలి. నేనెంత అదృష్టవంతురాలిని! భగవంతుడు నాకిలాంటి తపస్సు చేసే చక్కని అవకాశం కల్పించాడనుకోవాలి. భాగవతంలో –

తత్తేనుకంపాం సుసమీక్షమాణో భుంజాన ఏవాత్మకృతం విపాకమ్ ।
హృద్వాగ్వపుర్భిర్విదధన్నమస్తే జీవేత యో ముక్తిపదే స దాయభాక్ ॥
(శ్రీమద్భాగ. 10/14/8)

క్షణక్షణమూ చాల ఉత్సాహంతో నీ అనుగ్రహాన్ని చక్కగా అనుభవిస్తూ ప్రారబ్ధానుసారంగా ప్రాప్తించే సుఖదుఃఖాలను నిర్వికారమైన మనస్సుతో అనుభవిస్తు ప్రేమ పరిపూర్ణమైన హృదయంతో గద్గదవాణితో పులకిత శరీరంతో తనను నీ చరణాల కర్పించుకొన్నవాడు తనతండ్రి ఆస్తికి పుత్రుడధికారియైనట్టు నీ పరమపదం పొందటానికి అధికారి అవుతాడు.

వితంతువు తన చరిత్ర విశేషించి రక్షించుకోవాలి. ఆమె వ్యభిచరిస్తే ఉభయవంశాల్ని కళంకితం చేస్తుంది. మర్యాద నశింపజేస్తుంది. మరణానంతరం ఘోర నరకానికి పోతుంది. కనుక ఆమె మర్యాదగా ఉండాలి. ధర్మవిరుద్ధమైన పనులు చేయకూడదు. కుంతీదేవివలె ఆమె తన వైధవ్యధర్మం పాటించాలి. కుంతీదేవిని తలచుకుంటే తన ధర్మపాలనచేసే బలం లభిస్తుంది.

ప్రశ్న: ఈరోజుల్లో స్త్రీకి పురుషుడితో సమానంగా అధికారమివ్వా లంటున్నారు. ఇది మంచిదేనా?

సమాధానము: ఇది సరియైనది కాదు. వాస్తవానికి స్త్రీకి సమానమైన అధికారం కాదు, విశేషాధికారముంది. ఎందుకంటే ఆమె

తల్లిదండ్రాదుల్ని విడిచిపెట్టి పతియింటికి వచ్చింది. అందుచేత యింటిలో ఆమెకు విశేషమైన అధికారముంది. ఆమె యింటికి యజమానురాలు. కోడలురాణి (బహూరాణి) అంటారు. బయట భర్తకి విశేషాధికారముంటుంది. రథం రెండు చక్రాలతో నడిచినట్లే. కాని రెండు చక్రాలు వేరువేరుగా ఉన్నట్లే. రెండు చక్రాలు ఒకేచోటతగిలిస్తే రథమెలా నడుస్తుంది. రెండు చక్రాలూ వేరువేరుగా వుండటంచేతనే రథంనడిచినట్లు పతికి పత్నికి వేరువేరు అధికారాలుండటంవల్లనే గార్హస్థ్యం నడుస్తుంది. సమానాధికారం ఇస్తే స్త్రీలాగ పురుషుడు గర్భధారణ ఎలా చేస్తాడు? అందువల్ల తమతమ అధికారాలే సమానాధికారం. ఇందులోనే ఇద్దరికీ స్వాతంత్ర్యం ఉంటుంది.

తమతమ అధికారాలే శ్రేష్ఠం, ఉత్తమం. మాకు స్వల్పాధికారాలు ఇచ్చి, పురుషులకు ఉన్నత అధికారాలు ఇచ్చారనే ఊహలో మాకూ సమానాధికారాలు కావాలి అనుకోవడం మూర్ఖత్వమవుతుంది. అర్థం చేసుకుంటే అధికారము కన్న కర్తవ్యమే మిన్న. అధికారము కర్తవ్యమునకు దాసుడు. కాని కర్తవ్యము అధికారమునకు దాసుడుకాదు. తన కర్తవ్యాన్ని తత్పరభావంతో పాటిస్తే ప్రపంచము, మహాత్ములు, శాస్త్రము భగవంతుడు కూడ (వీళ్లందరూ) అధికారం ఇస్తారు.

అధికారం కావాలనే కోరిక జనన మరణహేతువు. అది నరకానికి తీసుకువెళ్లేది. మేము చూచాం – ఒక పేటలోని కుక్క రెండోపేటలోకి వెడుతుంది. అలా వెడితే ఆ పేటలోకుక్క దాన్ని కరవటానికి పరుగెత్తుతుంది. రెండు కుక్కలు పోట్లాడుకుంటాయి. వచ్చిన కుక్క కిందపడి కాళ్లుపైకెత్తి ఓడిపోయినట్లు ఒప్పుకుంటే ఆ పేటకుక్క దానిమీద నిలబడి రాజీపడుతుంది కారణమేమిటి? అది ఆ పేటమీద తన అధికారం ఎంచుకుంటుంది. దానిముందు నమ్రభావాన్ని స్వీకరిస్తే పోరు నశిస్తుంది. అధికమైన తీధికారం కావాలనే ఆశ కుక్కల మనస్సుల్లోకూడ ఉంటుందనే సంగతి దీనివల్ల తేలుతుంది. ఇటువంటి ఆశే మనుష్యుల్లోనూ ఉంటే ఇంక మానవత్వం ఎలాటిది? అధికాధికారం పొందాలనే లాలస నీచమానవుల్లో ఉంటుంది. శ్రేష్ఠులైన మానవులు తమకర్తవ్యాన్నే ఉత్సాహపూర్వకంగా తత్పరతతో పాలిస్తారు. కర్తవ్యపాలనంవల్ల వారి అధికారం స్వతహాగానే

ఉన్నతమవుతుంది.

వాస్తవంలో గమనిస్తే స్త్రీలహక్కులు తక్కువేమీకావు. వారు యింటి యజమానురాలని, గృహలక్ష్మి అనీ పిలిపించుకుంటున్నారు. ఇంటిలో మనుష్యులెంతమంది బయట వ్యవహారాలు చేస్తున్నప్పటికీ వాళ్లింటికి వచ్చి స్త్రీలనే ఆశ్రయిస్తారు. స్త్రీలు తమ కుటుంబసభ్యులకు ఆశ్రయం ఇచ్చేవాళ్లవుతున్నారు. వారందరిసేవ చేస్తున్నారు. అందరినీ పాలిస్తున్నారు. కాబట్టి వారికే అధికారం ఎక్కువ. కాని వారు తమ కర్తవ్యంనుంచి చ్యుతి (భ్రంశం) పొందితే అప్పుడే వారిమనస్సుల్లో అధికమైన అధికారం (హక్కు) పొందాలనే లాలస పుట్టుకొస్తుంది.

ప్రశ్న: ఈకాలపు దుర్భిక్షపురోజుల్లో (costly days) స్త్రీకూడ ఉద్యోగము చేస్తే హాని ఏమిటి?

సమాధానము: స్త్రీ హృదయం కోమలంగా ఉంటుంది. కనుక ఆమె ఉద్యోగములో ఉండే సాదకబాధకాలను, తిరస్కారములను సహించలేరు. ఆమె వ్యక్తిత్వానికి వ్యతిరేకమైన ఏ చర్య జరిగినా భరించలేదు. నౌకరీని బానిసత్వం అనండి, దాసీతనం, దాసత్వం అనండి. తుచ్ఛత్వమనండి ఏదైనా ఒకటే. బానిసత్వాన్ని పురుషుడు సహించగలడేమో కాని స్త్రీ సహించలేదు. నౌకరీ, వ్యవసాయం, వ్యాపారం మొదలగు పనులు పురుషులు నిర్వర్తించవలసినవి. ఇంటి పనులు స్త్రీలవి. కాబట్టి స్త్రీల ప్రతిష్ఠ, ఆదరము, ఇంటిపని చేయటంలోనే ఉన్నాయి. బయటిపనులు చెయ్యటంలో స్త్రీలకు తిరస్కారముంది. స్త్రీ ప్రతిష్ఠతో ఉపార్జనం చేస్తే ఏమీ హానిలేదు. అంటే ఆమె తన యింటిలోనే ఉండి జీవికకోసం ఉపార్జనం చేసుకోవచ్చు. స్వెట్టర్లు మొదలైనవి అల్లటం, బట్టలుకుట్టటం, అల్లికలు, వత్తిపత్తీ చేసుకోవటం (దీపారాధనకి) దేవుడి బొమ్మలు అలంకరించటం మొదలైనవి. ఇలాచెయ్యటంవల్ల ఆమె ఎవరికీ దాసీకాదు. పరాధీనురాలుకాదు.

----oOo----

# 6. మహాపాపంనుంచి కాపాడుకో

బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః ।
మహాంతి పాతకాన్యాహుః సంసర్గశ్చాపి తైస్సహ ॥
(మనుస్మృతి. 11/54)

బ్రాహ్మణుని హత్యచేయటం, కల్లు(మద్యపానం) త్రాగటం, బంగారము మొదలైనవాటిని దొంగిలించటం, గురుపత్నితో వ్యభిచరించటం ఈ నాలుగు మహాపాపాలు. ఈ నాల్గింటిలో ఏ ఒక్కపాపం చేసేవాడితోనైనా ఎవరైనా మూడేళ్లు కలిసి ఉంటే ఆ మహాపాపికి చుట్టుకున్నపాపమే* అతనికి లభిస్తుంది –

## 1. బ్రహ్మహత్య

నాలుగువర్ణాలకి గురువు బ్రాహ్మణుడు "వర్ణానాం బ్రాహ్మణోగురుః" బ్రాహ్మణజాతివల్ల కలిగినంత శాస్త్రీయజ్ఞాన ప్రకాశం మరి యే జాతివల్లా కలుగదు. అందువల్ల బ్రాహ్మణహత్య చేయటం మహాపాపం. ఇలాగే ప్రపంచానికి మేలుచేసే మహాపురుషుల్ని, భగవద్భక్తుణ్ణి, గోవు మొదలైనవాటిని చంపటంకూడ మహాపాపమే. కారణమేమిటంటే ఎవరివల్ల పరులకెక్కువ ఉపకారం జరుగునో అలాంటి వారిని చంపితే అంతకంటే ఎక్కువ పాపం కలుగును.

## 2. మద్యపానం

మాంసం, గ్రుడ్లు, పొగాకు, భంగు మొదలైన అపరిశుద్ధమైన మత్తుకలిగించే అన్ని పదార్థాలనీ కూడ సేవించటం పాపం, కాని మద్యపానం మహాపాపం. మనుష్యునిలో ఉన్న ధార్మిక భావాలు,

---

* స్తేనో హిరణ్యస్య సురాం పిబంశ్చ గురోస్తల్పమావసన్బ్రహ్మహా చైతే పతంతి చత్వారః పంచమశ్చాచరంస్తైరితి ॥ (ఛాందోగ్య. 5/10/9).

ధర్మాభిరుచి సంస్కారాలు వీటినన్నిటినీ మద్యపానం నశింపచేస్తుంది. దీనితో మనిషి మనుగడ పతనానికి దారి తీస్తుంది.

మద్యం తయారు చెయ్యటంలో లెక్కకుమించి జీవులహత్య జరుగుతుంది. గంగ అన్నిటినీ పవిత్రంచేస్తుంది. కాని గంగలో మద్యపాత్ర పడేస్తే అది శుద్ధంకాదు. కల్లుకుండే (కల్లుపోసేపాత్ర) ఇంత (అశుద్ధం) అపవిత్రమైపోతే కల్లుతాగేవాడెంత అపవిత్రుడవుతాడు? దీనికేమీ హద్దులేదు. మహమ్మదీయమతంలో – "శరీరపు ఏ అవయవంలో మద్యం అంటుకుంటుందో ఆ అవయవపు చర్మంకోసి విసిరిపారెయ్యా"లనే మాటవిన్నాను.

ప్రశ్న: ఈరోజుల్లో చాల ఇంగ్లీషుమందుల్లో మద్యం కలిపి ఉంటుంది. స్వాస్థ్యం (ఆరోగ్యం) కోసం ఓషధిరూపంలో వాటిని సేవిస్తే మహాపాపం వస్తుందా?

సమాధానము: మద్యమున్న ఔషధాలు సేవించటంవల్ల పాపం వస్తుంది.

ప్రశ్న: పరివారంలో (కుటుంబంలో) ఒకడు మద్యపానం చేస్తే అతడి సాంగత్యంవల్ల కుటుంబానికంతకీ మహాపాపం చుట్టుకుంటుందా?

సమాధానము: లేదు – కుటుంబసభ్యుల దృష్టిలో అతడు కుటుంబమునకు చెందినవాడు. ఆ దృష్టితోనే వారాతనితో కలియుదురు. త్రాగుబోతుగా వారాతనిని దూరముగానే ఉంచుదురు. ఇలాగే భర్త మద్యపానం చేస్తుంటే భార్య రాత్రింబవళ్లు అతనితో ఉండవలసి వస్తుంది. అప్పుడు స్త్రీకి (భార్యకి) మహాపాపంరాదు. ఆమె మద్యపానం చేసేవాడితో సాంగత్యం చెయ్యటం లేదు. అంతేగాక గత్యంతరంలేక పతితో వివశురాలై సాంగత్యం చేస్తుంది. ఇష్టంతో బుద్ధిపూర్వకంగా సాంగత్యం చేయటంవల్లనే దుస్సాంగత్య దోషం కలుగుతుంది.

ప్రశ్న: పూర్వం తెలియని స్థితిలో మద్యపానం చేస్తున్నాడు. కాని యిప్పుడు తెలివివచ్చింది అతడు మహాపాపం నుండి ఎట్లా

శుద్ధుడవుతాడు?

సమాధానము: అతడు నిజమైన హృదయంతో పశ్చాత్తాపపడి మద్యపానం సర్వవిధాలా విడిచిపెట్టి నేటినుంచి నేనింకెప్పుడు మద్యపానం చేయనని నిశ్చయించుకుంటే అతని పాపమంతా క్షమింపబడుతుంది. జీవుడు స్వతఃశుద్ధుడు. "చేతన అమల సహజ సుఖరాసీ" అందువల్ల అశుద్ధినివిడిచి పెట్టగానే అతనికి నిత్యప్రాప్తమైన శుద్ధి ప్రాప్తిస్తుంది. అతడు శుద్ధుడవుతాడు.

## 3. దొంగతనం

ఏ వస్తువు దొంగిలించినా పాపమే. కాని బంగారం, వజ్రం మొదలైన బహుమూల్యవస్తువులు దొంగిలించటం మహాపాపం. ఎంత విలువైన వస్తువుని దొంగిలిస్తే అంత అధికపాపం చుట్టుకుంటుందని అర్థం.

## 4. గురుపత్నిసంగమం

రేతః పతనమునకు కారణమైనవన్నీ పాపాలే. వాటిలో గురుపత్నీ సంగమము ఘోరపాపము. మనకు విద్య గరపి, మన జీవితాలను సఫలీకృతం చేసుకోవడానికి సహాయపడి నిర్మలజీవితాన్ని ప్రసాదించిన గురువుగారి భార్య మన కన్నతల్లి కన్న ఉన్నతమైనది. * గురువుయొక్క

---

* వీర్యబిందువులో వేల జీవులుంటాయి. స్త్రీసంగమంలో నష్టమయ్యే వీర్యంలోనుంచి గర్భాశయంలో రజస్సుతో పాటుకలిసే జీవమే గర్భమవుతుంది. మిగిలిన అన్ని జీవులు మరణిస్తాయి. వాటిని పోషించిన పాపం తగులుతుంది. కేవలం సంతానోత్పత్తి కోసం ఋతుకాలంలో స్త్రీ సంగమంచేస్తే పాపంరాదు. (పాపం ఉంటుంది గాని అదిచుట్టుకోదు) అది శాస్త్ర-ధర్మానుసారంగా ఉంది కనక. స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ (గీత.18/47). ధర్మావిరుద్ధో భూతేషు కామోऽస్మి (గీత. 7/11). కాని కేవలం భోగేచ్ఛతో స్త్రీ సంగమంచేస్తే ఆ పాపం తగిలితీరుతుంది. అందుకే చెప్పారు –

ఏక బార భగ భోగ తే, జీవ హత్తై నౌ లాఖ ।
జన మనోర నారీ తజీ, సున గోరఖ కీ సాఖ ॥

పత్ని తల్లికంటెకూడ ఎక్కువది కనక. కాబట్టి ఆమెతో వ్యభిచరించటం మహాపాపం.

పరపత్నీ సంగమమూ మహాపాపమే. అందుకే దీనిని వ్యభిచారం అన్నారు. పురుషుడు పరస్త్రీ సంగమం చేసినా, స్త్రీపరపురుషసంగమం చేసినా తల్లిదండ్రులకి, సోదరీసోదరులకీ, అలాగే అత్తవారియింట పతికి, అత్తమామలకి మరదులు మొదలైనవారికి చాల దుఃఖం కలుగుతుంది. ఈ విధముగా నిషిద్ధ భోగమనుభవించి శాస్త్ర, ధర్మ, కులభ్రష్టులగుట, ఉభయ వర్గాలకి దుఃఖం కలిగించుట మహాపాపహేతువవుతుంది. ఒక విద్వాంసుడు తన అనుభవంచెప్పాడు–"పరస్త్రీ గమనంవల్ల హృదయంలో ఉన్న ఆస్తికభావం నశిస్తుంది. నాస్తిక భావం కలుగుతుంది. అది మహా అనర్థానికి మూలం".

హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవాదులు ఎవరైనప్పటికీ అందరూ ఈ మహాపాపాలు విడిచిపెట్టాలి. మానవ శరీరం లభించినప్పుడు కనీసం మహాపాపాలకైనా దూరంగా ఉండాలి. ముందు దుర్గతిలేకుండా భూతప్రేతాదియోనుల్లో పుట్టకుండా.

గర్భపాతం మహాపాపంకంటే రెట్టింపు పాపం. బ్రహ్మహత్య మహాపాపమయినట్లే గర్భపాతంకూడ మహాపాపం. శాస్త్రంలో బ్రహ్మహత్యకంటెకూడ గర్భపాతం రెట్టింపు పాపమని చెప్పబడింది.

యత్పాపం బ్రహ్మహత్యాయా ద్విగుణం గర్భపాతనే ।
ప్రాయశ్చిత్తం న తస్యాస్తి తస్యాస్త్యాగో విధీయతే ॥
(పారాశరస్మృతి. 4/20)

బ్రహ్మహత్యవల్ల కలిగే పాపంకంటె రెట్టింపుపాపం గర్భపాతం చేసుకోవటం వలన కలుగుతుంది. ఈ గర్భపాతరూపమైన మహాపాపానికే మీ ప్రాయశ్చిత్తంలేదు. ఇందులో అయితే ఆ స్త్రీని విడిచిపెట్టెయ్యటమనే విధానమే ఉంది.

భగవంతుడు విశేషమైన అనుగ్రహంతో జీవుడికి మనుష్య శరీరమిస్తాడు. కాని వ్యాసక్తమీ శస్త్రచికిత్స (ఆపరేషన్) గర్భపాతం, లూప్, గర్భనిరోధకౌషధాలు మొదలైనవాటిద్వారా ఆ జీవుణ్ణి మానవశరీరంలోకి రానివ్వకపోవటం. ఆ పరవశుడైన జీవుణ్ణి జన్మించనివ్వకనే పోవటం జన్మకుముందే అతన్ని నశింపచేయటం చాల పెద్ద పాపం. అతడేమీ అపరాధంకూడ చెయ్యలేదు. అయినప్పటికీ ఆ దుర్బల జీవుణ్ణి హత్యచెయ్యటం అతనికెంత గొప్ప అన్యాయం చేసినట్లు? ఆ జీవుడు మానవశరీరంలోకి వచ్చి ఏయే మంచి పనులు చేస్తాడో? సమాజసేవ చేస్తాడో, తననుద్ధరించుకుంటాడో చెప్పలేము. కాని జన్మించకముందే అతన్ని హత్య చెయ్యటం ఘోరమైన అన్యాయం. తనను తానుద్ధరించుకొనుట తన క్షేమం, తాను చూచుకోకపోవటం కూడ దోషమే. మరి యితరులు కూడ తమనుతాము ఉద్ధరించుకొనుటకు అవకాశము యీయకుండుట యెంత పాపం. ఇటువంటి మహాపాపం చేసే స్త్రీ పురుషులకు వచ్చే జన్మలో ఏమీ సంతానం కలగదు. వారు జన్మ జన్మాంతరాలవరకు సంతానం లేక రోదిస్తుంటారు.

మంచి నౌకర్లని తిరస్కరించిన యజమానికి మంచి నౌకర్లు దొరకరు. మంచియజమానిని కాదనుకొన్న తిరస్కరించిన నౌకరుకి మళ్లీ మంచి యజమాని దొరకడు. ఇది ప్రత్యక్షవిషయమే. మంచి మహాత్ముల సాంగత్యం లభించికూడ తననుద్ధరించుకోని వాడికి మళ్లీ అటువంటి సాంగత్యం లభించదు. లాభపడిన మంచి సత్పురుషుల్ని విడిచిపెట్టి వారిని నిందించి తిరస్కరించిన వాడికి మళ్ళీ అటువంటి సత్పురుషులు లభింపరు. తల్లిదండ్రులు సంతోషంతో పిల్లవాడికి తినుబండరాలు పెట్టినప్పుడు దాన్ని వాడుతినక మురికి కాలవలోకి విసిరేస్తే మళ్లీ తల్లిదండ్రులు వాడికి మిఠాయిపెట్టరు. ఇలాగే భగవంతుడు విశేషానుగ్రహంతో మానవదేహమిస్తే మనుజుడు దానితో పాపం చేస్తున్నాడు. ఆ దేహాన్ని దురుపయోగం చేస్తున్నాడు. అటువంటప్పుడు అతనికింక మానవశరీరం లభించదు. తల్లిదండ్రులు పిల్లవాడికి మళ్లీ మిఠాయిపెడతారు, వాడు తెలివితక్కువాడు కనక. కాని తెలిసుండి బుద్ధిపూర్వకంగా పాపంచేసే వాడికి భగవంతుడు మళ్లీ మానవ

శరీరమివ్వడు. ఇలాగే గర్భపాతం చేసుకొనేవాళ్లకి వచ్చే జన్మలలో సంతానం కలగదు.

బ్రహ్మవైవర్త పురాణం (ప్రకృతిఖండం–అధ్యాయం2)లో సృష్టి ప్రారంభంలో భగవంతుడైన శ్రీకృష్ణుని చిన్మయశక్తియైన మూలప్రకృతి (శ్రీరాధ) తన గర్భాన్ని బ్రహ్మాండగోళపుటగాధ జలంలోకి విసిరేసింది. ఇది చూచి భగవంతుడామెను శపించాడు – "నేటినుంచి నీకే సంతానమూ కలుగదు. ఇంతేకాదు "నీ* అంశతో ఉత్పన్నులయ్యే దివ్యస్త్రీలకికూడ ఏ సంతానమూ కలుగదు". తరువాత మూల ప్రకృతి దేవియొక్కనాలుక చివరనుంచి సరస్వతి ప్రకటమైంది. మరికొంచెం సమయమయ్యాక ఆ మూలప్రకృతి రెండు రూపాల్లోవ్యక్తమైంది. సగం ఎడమభాగం నుంచి లక్ష్మి, సగం కుడిభాగం నుంచి రాధ అయింది. భగవంతుడైన కృష్ణుడుకూడ ఆ సమయంలో రెండు రూపాల్లో కనిపించాడు. సగం ఎడమభాగంనుంచి ఆయన చతుర్భుజుడైన విష్ణువు, సగం కుడి భాగం నుంచి ద్విభుజుడైన కృష్ణుడు అయ్యాడు.+ అప్పుడు శ్రీకృష్ణభగవానుడు, లక్ష్మిసరస్వతుల

---

* దృష్ట్వా డింబంచ సా దేవీ హృదయేన విభూషితా ।
ఉత్ససర్జ చ కోపేన బ్రహ్మాండం గోలకే జలే ॥
దృష్ట్వా కృష్ణశ్చ తత్త్యాగం హాహాకారం చకార హ ।
శశాప దేవీం దేవేశస్తత్క్షణం చ యథోచితమ్ ॥
యతోऽపత్యం త్వయా త్యక్తం కోపశీలే సునిష్ఠురే ।
భవత్వమనపత్యాపి చాద్యప్రభృతినిశ్చితమ్ ॥
యా యాస్త్వదంశరూపా చ భవిష్యంతి సురస్త్రియః ।
అనపత్యాశ్చ తాః సర్వాస్తత్సమా నిత్యయౌవనాః ॥
(ప్రకృతి. 2/50–53)

\+ అథ కాలాన్తరే సా చ ద్విధారూపా బభూవ హ ।
వామార్ద్ధాంగా చ కమలా దక్షిణార్ద్ధా చ రాధికా ॥
ఏతస్మిన్నన్తరే కృష్ణో ద్విధారూపో బభూవ హ ।
దక్షిణార్ధశ్చ ద్విభుజో వామార్ద్ధశ్చ చతుర్భుజః ॥
(ప్రకృతి. 2/56–57)

నిద్దర్నీ విష్ణుసేవచేస్తూ ఉండమని ఆజ్ఞాపించాడు. మూల ప్రకృతి నుండి వ్యక్తమవటంవల్ల లక్ష్మీసరస్వతులకు కూడ ఏ సంతానమూ కలుగలేదు.* ఆ తరువాత శ్రీకృష్ణభగవానుని రోమకూపాలనుంచి లెక్కలేనంత మంది గోపాలురు వచ్చారు. రాధరోమకూపాలనుంచి లెక్కలేనంత మంది గోపకన్యలు బయలుపడ్డారు. భగవంతుని శాపం కారణంగా ఈ గోపకన్యలకు కూడ ఏసంతానమూ కలుగలేదు.+ ఈ కథవల్ల గర్భం పోగొట్టుకున్నస్త్రీ వచ్చే జన్మలో సంతానవతి కాలేదని ఋజువవుతోంది.

ప్రశ్న: గర్భపాతం చేసుకొన్న స్త్రీలుకూడ మళ్లీ గర్భవతులవుతున్నారు. వారికి సంతానము కలుగుతోంది. ఈ సంగతి చూస్తున్నాం కదా! గర్భపాతం చేసుకొన్నస్త్రీకి సంతానం కలగదనే దెలా ఒప్పుకుంటాం?

సమాధానము: ఈ జన్మకి మునుపే ప్రారబ్ధమేర్పడి ఉంది. కనుక ఆ పూర్వసంచిత పుణ్యమువలన వారికి సంతానం కలుగవచ్చు. కానివచ్చే జన్మలో క్రొత్తగా ప్రారబ్ధమేర్పడినవెన్క వారికి సంతానం కలుగదు. ఈ జన్మలో చేసుకొన్న గర్భపాతరూపమైన మహాపాపంయొక్క ఫలం వాళ్లు వచ్చే జన్మల్లో అనుభవించవలసిందే.

ప్రశ్న: గర్భస్రావం, గర్భపాతం, భ్రూణహత్య - ఈమూడింటికి తేడా ఏమిటి?

సమాధానము: గర్భంలో జీవుడికి శరీరం ఏర్పడటానికి ముందే రజోవీర్యమిశ్రమం పడిపోతే దానిని గర్భస్రావమంటారు. గర్భంలో శరీరం

---

* అనపత్యే చ తే ద్వే చ యతో రాధాంశసంభవాః ॥
(ప్రకృతి. 2/60)

\+ రాధాంగలోమకూపేభ్యో బభూవుర్గోపకన్యకాః ।
రాధాతుల్యాశ్చ సర్వాస్తాః రాధాతుల్యాః ప్రియంవదాః ॥
రత్నభూషణభూషాఢ్యాః శశ్వత్ సుస్థిరయౌవనాః ।
అనపత్యాశ్చ తాః సర్వాః పుంసః శాపేన సంతతమ్ ॥
(ప్రకృతి. 2/64-65)

తయారవటం ప్రారంభమయినప్పుడు దాన్ని పడగొట్టడం గర్భపాతం అనిపించుకుంటుంది. గర్భంలో ఉన్నజీవుడికి కాళ్లు, చేతులు తలమొదలైన అవయవాలు వ్యక్తమై ఆ పిండము ఆడశిశువో, మగశిశువో స్పష్టంగా తెలియ ప్రారంభించినప్పుడు దాన్ని పడగొట్టటం భ్రూణహత్య అనబడుతుంది. గర్భస్రావ, గర్భపాత, భ్రూణహత్యల్ని మూడింటినీ ఏ విధంగా చేసినా మహాపాపం సంక్రమిస్తుంది. తనంతట తానే గర్భంపడిపోతే అందుకు పాపంకలగదు. ప్రపంచంలో చాల జీవులు తమంతటతామే మరణిస్తున్నాయి. కాని వాటిపాపం మనకు తగలదు. వాటిని మనం చంపలేదు. చంపాలనుకోలేదు.

**ప్రశ్న: గర్భంలో జీవుడయితే ఉండటంలేదు. తరువాత వస్తాడు, అది గర్భపాతపాపమెట్లా?**

సమాధానము: పురుషవీర్యానికి చెందిన ఒక బిందువులో వేలకొలది జీవులుంటాయి. వాటిలోనుంచి స్త్రీ రజస్సుతో (శోణిత) కలుసుకుపోయిన జీవుడు గర్భాశయంలో ఉండిపోతాడు. అదే పెరిగి గర్భమవుతుంది. జీవుడు లేకుండా వీర్యం రజస్సుతో కలవదు. గర్భమూ పెరగదు. ప్రాణశక్తిలేనిదే గర్భం పెరగనేలేదు. జీవుడిలో ప్రాణశక్తి మొదట సూక్ష్మంగా ఉంటుంది. కాని గర్భంలోకి రాగానే ప్రాణశక్తి స్థూలమై పోతుంది. గర్భంపెరగటం మొదలుపెడుతుంది. గర్భంపెరిగినమీదట ప్రాణశక్తి విశేష రూపంగా ప్రస్ఫుటమవుతుంది. గర్భంలో కదలిక ప్రారంభమవుతుంది. ఇప్పుడు గర్భంలోకి జీవుడు వచ్చాడంటారు.

**ప్రశ్న: ఎవరి గర్భమైనా తనంతటతాను నిలవక పడిపోతే?**

సమాధానము: ఇది ఒక రోగము. దీనికి చికిత్సచెయ్యాలి. ఒక స్త్రీకి ఐదారుగర్భాలు పడిపోయినాయి. ఆమె గర్భంలో వేడి ఎక్కువగా ఉందని దానివల్ల గర్భం కరిగిపోయి పడిపోతుందని ఆమె కుటుంబసభ్యులతో ఒక సాధువు చెప్పాడు. ఆయనొక ఉపాయం చెప్పి అలా చెయ్యమన్నాడు. ఆమెకు గర్భంవచ్చాక ఒక గిన్నెమీద పాలువడబోసి గుడ్డవేసి, గుడ్డమీద సన్నని పంచదారవేసి దానిమీద ఆవుపాలు పితకండి. వాటితో ఆ పంచదార పాలతోకలిసి గిన్నెలోకి పోతుంది. ఈ గోరువెచ్చని (పితికేటప్పుడున్న

వేడితో) పాలు ఆ స్త్రీ అప్పుడే ఆవుముందే కూర్చుని ప్రతిరోజూ ఉదయం పరగడుపున ఏమీ భుజించకముందు ఒక నెలరోజులు త్రాగాలి" ఆయన చెప్పినట్టు ఆ స్త్రీ పాలు త్రాగింది. ఆమె గర్భంపోలేదు. ఆమెకు సంతానం కలిగింది. ఆ సంతానం ఇప్పటికీ జీవించి ఉంది.

ఈ రోగాన్ని నయంచేసే ఔషధాలు చాల ఉన్నాయి. వాటిని ఆయుర్వేదంలో నిష్ణాతుడైన అనుభవజ్ఞుడైన వైద్యుడివల్ల తీసుకోవాలి.

ప్రశ్న: ఏదైనా జబ్బుసంభవించి గర్భపాతం చేయించుకోవటం అనివార్యమైతే ఏమి చెయ్యాలి?

సమాధానము: గర్భపాతపు పాపం తగిలేదే - స్త్రీని కాపాడుటకోసం. జనం గర్భపాతం చేయిస్తున్నారు. కాని అలా చేయకూడదు. పైగా చికిత్స చేయించాలి. జరిగేది జరుగుతుంది. స్త్రీ మరణించేదయితే గర్భం పోగొట్టినా మరణిస్తుంది. ఆమెకు ఆయువు మిగిలి ఉంటే గర్భం పడగొట్టకపోయినప్పటికీ ఆమె మరణించదు. మృత్యుసమయమాసన్నమయినప్పుడు ఎలాగూ మరణము తప్పదు. కారణం ఏదైనాకానీ గర్భపాతం ఎప్పుడూ చేయించరాదు.

ప్రశ్న: కన్యగా ఉండగా గర్భమయితే దానిని పోగొట్టాలా? వద్దా?

సమాధానము: ఎవరివల్లయితే గర్భవతైందో వాడికిచ్చి పెళ్లిచెయ్యాలి. అలా వివాహం చేయించలేకపోయినప్పటికీ ఆ గర్భాన్ని మాత్రం పోగొట్టకూడదు. దాన్ని కాపాడాలి. బిడ్డనిపెంచాలి. కొంచెం పెద్దవాడయ్యాక ఆ పిల్లవాణ్ణి అనాథశరణాలయంలో చేర్చాలి. లేదా ఎవరైనా పెంచుకోదలిస్తే వాళ్లకివ్వాలి.

ఎవడైనా కన్యను బలాత్కరిస్తాడనుకోండి అలా బలాత్కరించినవాడికి మహాపాపం సంభవిస్తుంది. కన్యయూ ఆ కలయికలో సుఖపడితే ఆ పాపంలో భాగంగా ఆమెకూ పాపం కలుగుతుంది. ఎందుచేతనంటే అన్ని పాపాలు భోగేచ్ఛవల్లే వస్తాయి. అన్ని విధాలా భోగేచ్ఛలేకపోతే పాపం తగలదు.

అవివాహిత కన్యకు గర్భంవస్తే ఆమె తల్లితండ్రులకు కూడ అజాగ్రత్తవలన పాపం తగులుతుంది. కాబట్టి తల్లితండ్రులు మొదటినుంచీ చాలా జాగ్రత్తతో తమ కన్యను రక్షించుకోవాలి. ఆమెకు స్వాతంత్ర్యం ఇవ్వకూడదు.

ప్రశ్న: ప్రజలకుతెలిస్తే ఆ కన్యకు చెడ్డపేరు వస్తుంది. ఇంక ఆమెనెవరూ పెళ్లి చేసుకోరు. అప్పుడామె ఏం చెయ్యాలి?

సమాధానము: పాపం చేసింది · అపకీర్తిని సహించాలి. గర్భం పోగొట్టుకోవటం, ఆత్మహత్య చేసుకోవటం, ఇంటినుంచి పారిపోవటం ఈ మూడు పాపాల నుండీ తప్పించుకోటానికి అపకీర్తిని సహించటం మంచిది. ఆ కన్యను పెళ్లి చేసుకోవటాని కెవరూ అంగీకరించకపోతే ఆమె యింటిలోనే కూర్చుని భజన స్మరణ చేసుకోవాలి. దానితో ఆ పాపానికి ప్రాయశ్చిత్తం కూడ అవుతుంది.

ప్రశ్న: ఎవరైనా వివాహితస్త్రీని బలాత్కరించిన గర్భమయితే ఏం చెయ్యాలి?

సమాధానము: వీలయినంతవరకు స్త్రీ మాటలాడకుండా ఉండటమే శ్రేష్ఠం. భర్తకి తెలిసినా అతడుకూడ మౌనంగా ఉండాలి. ఇద్దరూ మాటలాడకుండా ఉండటంవల్లే లాభముంది. వాస్తవానికిక మునపటికంటె కూడ జాగ్రత్తగా ఉండాలి. అటువంటి సంఘటన జరగనే లేదన్నట్టు. గర్భం పోగొట్టుకోవటానికి మనకు సమ్మతిలేదు. ఎందుకంటే గర్భహత్య మహాపాపం.

ప్రశ్న: స్త్రీ పురుషులు సంతాననిరోధం కోసం శస్త్రచికిత్స (ఆపరేషన్) చేయించుకుంటే ఏమి హాని?

సమాధానము: ఆపరేషన్ చేయించుకొన్న పురుషులలో చాలామందికి శరీరం, గుండె బలహీనమవటం ప్రత్యక్షంగా కనిపిస్తోంది. వారి శరీరంలో రోగాలు చాల పుట్టాయి. పుడుతున్నాయి. ఆబోతుల్నిచేసిన గిత్తల పురుషత్వం నష్టమవటంవల్ల అలా చెయ్యని గిత్తలలో ఉన్న శక్తి చేసిన గిత్తలలో ఉండటం లేదు. అటులనే మనుషులలోకూడ "వ్యాసక్తమీ"

ద్వారా పురుషత్వం అవరోధించుటవల్ల, నష్టపరచినందువల్ల శారీరక శక్తి, ఉత్సాహం, నిర్భయత మొదలైన మానసిక శక్తి కూడ నష్టమవుతుంది.

వాసెక్టమీద్వారా తన పుంసత్వాన్ని నష్టపరచుకొన్న వారు నపుంసకులు. వారిద్వారా పితృదేవతలకు పిండోదకాలు లభించవు.* ఇటువంటి పురుషుణ్ణి చూడటంకూడ అశుభంగా భావించబడింది. ప్రయాణ సమయంలో ఇటువంటి వాణ్ణి చూడటం అపశకునం.

కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకొన్న స్త్రీలలో చాలమందికి ఎరుపు, తెలుపు (white & red discharge) వచ్చింది. దానికి చికిత్సలేదు. రాజస్థాన్‌లోనే ఈ శస్త్రచికిత్స వలన ఇప్పటికి వందలమంది స్త్రీలు మృతిచెందారు. చాలమందికి డాక్టర్లు నయము చెయ్యలేని రోగాలు వచ్చాయి. ఈ విషయం వార్తా పత్రికలలో ప్రచురితమైనది కూడ. ఆపరేషన్ చేయించుకోవటంవల్ల స్త్రీల శరీరములలో బలహీనత వస్తోంది. లేచేటప్పుడు, కూర్చునేటప్పుడు, కళ్లుచీకట్లు కమ్మటం, గుండెలోను, ఛాతీలోను వెన్నులోను బాధకలగటం, పనిచేసే ధైర్యం లేకపోవటం జరుగుతోందని మేము డాక్టర్లు చెప్పగా విన్నాం.

కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకొన్న స్త్రీలకు స్త్రీత్వం అంటే గర్భధారణశక్తి నశిస్తుంది. ఇటువంటి స్త్రీలదర్శనం కూడ అశుభం, అపశకునమూను. భగవంతుడిచ్చిన శక్తిని నాశనంచేసుకొనే అధికారమెవరికీ లేదు. దాన్ని నశింపచేయటం అనధికార చేష్ట. అపరాధం. ఆపరేషన్ ద్వారా స్త్రీత్వం నష్టపరచుకొన్న స్త్రీలు పాపానికి పాత్రులవుతారనేది ఖాయమే. ఆ పైన ఇతరుల్ని ఆపరేషన్ చేయించుకోమని ప్రేరేపించేవారు, పట్టుపట్టేవారు క్రొత్తపాపం చేస్తున్నారు. ఉదా:- గీతాధ్యయనానికి గొప్ప మాహాత్మ్యం ఉంది. కాని అంతకంటెకూడ ఎక్కువది గీతాప్రచార మాహాత్మ్యం(గీత. 18/69) ఇలాగే ఇతరులకు ఆపరేషన్ చేయించుకోమని

---

* అంగహీనాశ్రోత్రియషండశూద్రవర్జమ్ ।
(కాత్యాయనశ్రౌతసూత్రం. 1 /1/5)

ప్రచారంచేసే స్త్రీలు చాల గొప్పపాపం చేస్తున్నారు. గోఘాతకులసంఖ్య పెంచటంలో సహాయపడుటవల్ల గోహత్యాపాపంలో భాగం పంచుకుంటారు. అమాయకులైన సోదరీమణులకు ఈ సంగతి తెలియదు. ఇందుచేత వారు అజ్ఞానంలోపడి చాల పెద్దతప్పు, పాపము చేస్తున్నారు. వారిని పాపం నుండి రక్షించాలి.

ఎవరైనప్పటికీకూడ ఏరకమైన అపరాధం చేసినా వాని ప్రాణశక్తి వేగంగా నశిస్తుంది. అతనికి మృత్యువు త్వరగా సంభవిస్తుంది. అపరాధం, పాపం చేసినమీదట లేదా అవి చెయ్యాలని మనస్సులో ఊహాకలిగినమీదట శ్వాస వేగంగా చురుగ్గా వస్తుంది. ప్రాణం క్షోభపడుతుంది. ఇది ప్రత్యక్షవిషయం. ఎవరైనా సరే దీనిని అనుభవంతో చూడవచ్చు.

కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకోవటం వ్యభిచారానికి ప్రత్యక్షంగా అవకాశమివ్వటమే. అదిచాల పెద్దపాపం. పశుబలిని, పశువధని అభిచారమంటారు. దానికంటె విశేషమైన అభిచారాన్ని వ్యభిచారమంటారు. దీనివల్ల మానవుని ధార్మిక, పారమార్థిక భావన నష్టమైపోతుంది. అతడు మహాపతనాన్ని పొందుతాడు.

మానవశరీరం కేవలం పరమాత్మప్రాప్తికోసమే లభించినది. మరి దానిని పరమాత్మవైపు లగ్నము చేయక కేవలం భోగవిలాసాలలోనే లగ్నంచేయటం ఇంతేకాక భోగాలనుభవించటంకోసం మహాపాపాలు చెయ్యటం, గర్భపాతం, ఆపరేషన్ చేయించుకోవటం ఎంత అనర్థం? గర్భపాతం, ఆపరేషన్, కాక భోగాలనుభవించటాని కింకేమున్నాయి? ఆపరేషన్‌వల్ల ఎవరికైనా ఏమైనా ధార్మికపారమార్థిక లాభం కలిగిందా? కలుగుతుందా? కలుగగలదా? కుటుంబ నియంత్రణవల్ల కేవలం భోగపరాయణత మాత్రమే పెరుగుతుంది. ఈనాడు మనుష్యులలో ఉన్నంత భోగపరాయణత్వం పశువులలో కూడలేదు. మీకు సంతానమక్కరలేకపోతే సంయమం పాటించండి. దానివల్ల మీ శరీరంలో బలముంటుంది. ఉత్సాహముంటుంది. మీలో ధర్మపరాయణత్వం, ఈశ్వరపరాయణత్వం కలుగుతాయి. మీ మనుష్యజన్మ సఫలమవుతుంది.

ఆది శంకరులు ఇట్లనిరి –

కే శత్రవః సంతి విజేంద్రియాణి తాన్యేవ మిత్రాణి జితాని యాని ।

అనగా మనిషి ఇంద్రియాలకి లొంగిపోతే ఆ ఇంద్రియాలు అతనికి శత్రువులవుతాయి. దానితో అతనికి ఇహపర లోకాలు చెడిపోతాయి. కాని అతడుకనుక జితేంద్రియుడయితే ఇంద్రియాలతనికి మిత్రులవుతాయి. దానితో అతనికి ఇహపర లోకాలు బాగుపడతాయి.

గీతలో ఈ విధముగా చెప్పబడినది –

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥

(గీత. 6/5)

"తననుతానే సంసారసాగరమునుండి ఉద్ధరించుకొనవలెను. తనను తానే అధోగతిలోనికి త్రోసికొనరాదు. ఎందుకనగా ఈ మనుష్యుడు తనకుతానే బంధువు, మిత్రుడు మరియు తనకుతానే శత్రువు అగుచున్నాడు.

ప్రశ్న: గర్భపాతం చేసుకొంటే హానేమిటి?

సమాధానము: గర్భపాతంవల్ల ఒక్క హాని కాదు కృత్రిమగర్భస్రావం, గర్భపాతం చేసుకోవటంతో స్త్రీశరీరం పాడయిపోతుంది. బలహీనమవుతుంది. యువావస్థలో బలహీనత కలుగరాదు. దానిచే కొంతవయస్సు పడలిన మీదట దాని చిహ్నం కనిపించటం మొదలుపెడుతుంది. శరీరములో దారుఢ్యమున్నంతవరకు బలహీనత దరిచేరదు. కాని వయసుడిగిన పిదప దాని చిహ్నాములు బయటపడును. గర్భపాతంవల్ల చాలమందికి ప్రదరం (Discharge) వస్తుంది. ఇంతేకాకుండా గర్భపాతంవల్ల రక్తంపడటానికొక దారియేర్పడుతుంది.

బిడ్డకు జన్మనిచ్చినందువలన స్త్రీశరీరం పాడవదు. ఎందుచేతనంటే

మాతృత్వం ప్రతిస్త్రీ సహజ ధర్మం. అది సమయానికి జరుగుతుంది. సహజ విషయాలవల్ల స్వాభావికంగానే చెడుకలగదు. పాడవటమనేది కృత్రిమ వస్తువులవలన జరుగుతుంది.

ప్రశ్న: ఒకటిరెండుసార్లు సంతానం కలిగితే స్త్రీ తల్లి అయింది. ఇప్పుడామె ఆపరేషన్ చేయించుకొంటే ఏమిహాని?

సమాధానము: ఆమె తల్లి ముందే అయింది. ఇప్పుడు ఆపరేషన్ చేయించుకొన్నాక ఆమెకు 'స్త్రీ' అనే పేరులేదు పోయింది. కారణమేమిటంటే శుక్రశోణితాలు కలిసి ఎవరి ఉదరంలో గర్భరూపం ధరిస్తాయో ఆమె పేరు స్త్రీ * గర్భధారణచేయలేని యామె పేరు స్త్రీకాదు. గర్భస్థాపనచేయలేని వాడిపేరు పురుషుడుకాడు. ఆపరేషన్ ద్వారా సంతానోత్పత్తిచేసే శక్తి నష్టమైనాక పురుషుడిపేరు "నపుంసకుడు" అవుతుంది. కాని స్త్రీపేరెలా మార్పుచెందుతుందో మాకు తెలియదు.

కుటుంబ నియంత్రణ స్త్రీజాతికి ఘోరావమానం. ఎందుకంటే దీనివల్ల నారీజాతి కేవలం భోగవస్తువుగ మిగులుతుంది. వేశ్యదగ్గరకు వెళ్ళేవాడు సంతానప్రాప్తికోసం వెడతాడా? స్త్రీవల్ల సంతానం పొందాలనే కోరికలేక కేవలం భోగించేవాడు స్త్రీని వేశ్యనే చేశాడు. ఇది నారీజాతికి సన్మానమా? నారీ జాతిగౌరవం తల్లి అవటంలోనే ఉంది. భోగ్యవస్తువు కావటంలో లేదు. స్త్రీ ఆపరేషన్ మొదలైనవాటి ద్వారా తనమాతృశక్తిని నష్టపరచుకుంటే, ఆమె కాలిచెప్పులాగ కేవలం భోగ్యవస్తువుగా ఉండిపోతుంది. ఇది స్త్రీజాతికెంత గొప్ప అవమానం. నిరాదరణం.

ప్రశ్న: స్వాభావికంగానే సంతానం కలగనివారికి దోషం తగులుతుందా? లేదా?

సమాధానము: ఎవరికైనా స్వాభావికంగానే సంతానం కలగకపోతే అది వారి దోషంకాదు. కృత్రిమోపాయంతో మాతృశక్తిని సంతానోత్పత్తిచేసే

---

* "స్త్యై శబ్దసంఘాతయోః" స్త్యాయతః సంగతే భవతః అస్యాం శుక్రశోణితే ఇతి స్త్రీ ॥ (సిద్ధాంతకౌముదీ) బాలమనోరమా.

జరుపబడుతుంది. ఆ హింసకు ప్రతిఫలం వారు అనుభవించాల్సిందే. ఇందుచేతనే ఇంద్రుడికీ ఆపద కలుగుతుంది. అతడూ ఓడిపోతాడు. అతడూ భయంవల్ల పరుగులెత్తుతుంటాడు, దాక్కుంటాడు. అతని హృదయంలో మంట మండుతూ ఉంటుంది. కనుక హింసాఫలమునతడు పొందవలసియే ఉంటుంది. ఎవడైనా హింసని ఒప్పుకొనీ ఒప్పుకోకపోనీ, ధర్మశాస్త్ర అర్థశాస్త్రాలవచనాలున్నచోట ధర్మశాస్త్రవచనాలే సాటిరావాలని దీని తాత్పర్యం. అర్థశాస్త్రం కంటె ధర్మశాస్త్రం శ్రేష్ఠమైనదీ, బలమైనదీ. *

ప్రస్తుతం ప్రభుత్వం గర్భం పోగొట్టుకోవటం నేరంగా పరిగణించటంలేదు. కాని అలా పరిగణించనంత మాత్రాన పాపం కలగదనేమాట లేదు. ఎవరు అంగీకరించినా లేక అంగీకరించకపోయినా పాపఫలమును అనుభవించవలసినదే. ఎలాగంటే పూర్వం రాజులు నిషిద్ధకార్యాలు చెయ్యమని ప్రజల నాజ్ఞాపిస్తూ, ప్రేరేపించేవారంటే ఆ పాపం రాజు, ప్రజలూ ఇద్దరికీ తగిలేది. ఉదాహరణకి, వేనరాజు తానూ నిషిద్ధకృత్యాలు చేశాడు. ప్రజలచేతా చేయించాడు. ఇలాగే ఈ వేళ ప్రభుత్వం గర్భపాతాది నిషిద్ధకార్యాలు చెయ్యమని ప్రేరేపిస్తోంది అంటే ఆ పాపములో ప్రజలతో పాటుగా ప్రభుత్వముకూడా పాలుపంచుకొనవలసినదే.

ప్రశ్న: "రామచరితమానస్"లో ఈ విధముగా చెప్పబడింది – "సమరథ్ కహుఁ నహిఁ దోషు గోసాఈఁ రబి పావక సురసరి కీఁ నాఈఁ ॥" (బాల. 69/4) కాబట్టి రాజ్యము గొప్పపదవి లభించినవారు (రాజు, ప్రభుత్వం) సమర్థులు మరి వారికి పాపమెలా వస్తుంది?

సమాధానము: వారు సమర్థులుకాదు. ఇతరుల దోషాల్ని నశింపజేసే శక్తి కలవారు సమర్థులు. ఉదా:- సూర్యుడు వేడిమివలన ఆవిరయ్యేటట్లచేసి మురికిని తొలగిస్తాడు. అపవిత్రమైనదాన్ని పవిత్రంగాను శుద్ధంకాని దాన్ని శుద్ధంగాను చేస్తాడు. అన్నిటిలోనున్న నీటిభాగాన్నీ

---

* స్మృత్యోర్విరోధే న్యాయస్తు బలవాన్వ్యవహారతః ।
అర్థశాస్త్రాత్తు బలవద్ధర్మశాస్త్రమితి స్థితిః ॥

లాక్కుంటాడు. సముద్రపు ఉప్పునీటిని స్వీకరించి తియ్యటి నీరుగా చేస్తాడు. ఇలా చేసినప్పటికీ సూర్యుడు తానెప్పుడూ అపరిశుద్ధుడు అపవిత్రుడు కాడు. అగ్ని అపవిత్రములను దగ్ధం చేస్తాడు, వ్యర్థాలను భక్షిస్తాడు, అన్నిటినీ పవిత్రమొనరిస్తాడు. కాని అగ్నికి ఆ దోషమంటదు. గంగ మురికి నీటిని పవిత్రం చేస్తుంది. పాపాలు పోగొడుతుంది. కాని ఆమెకు దోషం తగలదు. అశుద్ధమైన దానిని శుద్ధంచెయ్యటం, దాని దోషాల్ని నశింపజేయటం, తాను మాత్రం యథాతథంగానే ఉండటం, ఇది సామర్థ్యం. రాజ్యము, వైభవము సంప్రాప్తించిన వాడు సమర్థుడనుట అవివేకము.

లౌకికమైన పదవి, అధికారం, వైభవం మొదలైనవి లభించినందువల్ల మనుష్యుడు సమర్థుడుకాడు. ఎందుచేతనంటే అతని సామర్థ్యం పదవి, అధికారము మొదలైన వాటికధీనమై ఉంది. అతడు మాత్రం పదవి, అధికారము మున్నగు వాటికి బానిస, పరాధీనుడు. అందువల్ల అతడు స్వయంగా సమర్థుడెలా అవుతాడు. లభించినదానివల్ల తనని సమర్థుడనని భావించేవాడు వాస్తవానికి అసమర్థుడే. వాడిలో కనిపించే సామర్థ్యం ఆ లభించిన వస్తువుది అతని సొంతంకాదు. వాస్తవంగా సమర్థుడైన వాడి సామర్థ్యం ఎవరికీ అధీనమై ఉండదు. సూర్యుడు, అగ్ని, గంగ – వీరి సామర్థ్యం ఎవరికీ అధీనమైనదికాక స్వీయమైనదైనట్లే. కనుక రాజ్యమదంలో పడి పాపం చేస్తూ చేయిస్తూండేవారు తమ సామర్థ్యాన్ని మహాదురుపయోగం చేస్తున్నారు. దానిశిక్ష వారనుభవించవలసినదే. వారి సామర్థ్యం పాపాల్ని దూరంచేసేదికాక పాపాల్ని చేయించే దవుతుంది. ఇందువల్ల అసమర్థ ప్రభుత్వాన్ని సమర్థమైనదని భావించి, దాని ప్రేరణతో మానవుడెప్పుడు పాపంచేయకూడదు.

ప్రశ్న: ప్రభుత్వపుటాదేశంవల్ల డాక్టర్లు గర్భపాతము, శస్త్రచికిత్సలు చేస్తున్నారు కదా. మరి వారికి మహాపాపం వస్తుందా?

సమాధానము: వారికి తప్పకుండా మహాపాపం వస్తుంది. లోభము పాపానికి తండ్రి. కొద్దిలో లోభవశులై వారెన్ని జీవుల్ని చంపుతున్నారు?

ఇటువంటి నింద్యమైనపని చేసి, పాపంచేసి సంపాదించిన డబ్బులతో వచ్చిన అన్నం తిన్నందువల్ల వారికి గొప్ప దుర్దశ ప్రాప్తిస్తుంది.

గర్భపాతం చేసుకొన్న స్త్రీయొక్క దృష్టికూడ అన్నంమీద పడితే ఆ అన్నం తినరానిదని శాస్త్రంలో చెప్పబడింది.

భ్రూణఘ్నావేక్షితం చైవ సంస్పృష్టం చాప్యుదక్యయా ।
పతత్రిణావలీఢం చ శునా సంస్పృష్టమేవ చ ॥
(మనుస్మృతి. 4/208)

"గర్భహత్యచేసేవాడు చూచినది, రజస్వల అయిన స్త్రీ ముట్టుకున్నది, పక్షితిన్నది, కుక్కముట్టుకున్న అన్నం తినకూడదు"

నౌకరీలో తన సమయంవెచ్చించి పనిచేసి డబ్బులు తీసుకోవటం జరుగుతోంది. తన ధర్మం, కర్తవ్యం, సత్కర్మయిచ్చి డబ్బులు తీసుకోబడటంలేదు. పాపం, అన్యాయం, హత్య, హింస మొదలైనవి చేసి డబ్బు తీసుకోవటం పాపమే. అందువల్ల యజమాని ఎవరినైనా పాపం, అన్యాయం చెయ్యమని చెపితే నౌకరు ఆ యజమానితో వినయంగా, "నేను మీ పనిలో గంటో రెండుగంటలో ఎక్కువసమయం ఉండగలనుగాని నా ధర్మం నాశనం చేసుకొని పాపం, హింస, చెయ్యటానికి నేను ఇష్టపడను. మీరు ఉద్యోగములో కొనసాగించినా లేక పదవీచ్యుతుణ్ణి కావించినా సరే అది మీ నిర్ణయం అని చెప్పాలి.

ఒక పెద్దమనిషి గర్భపాతం, కుటుంబనియంత్రణ కార్యం చెయ్యనందుకు ఒక సజ్జనుని నౌకరీ నుంచి వెళ్లగొట్టాడు. అతడు కోర్టులో కేసు వేశాడు. అందులో నెగ్గాడు. కాబట్టి అతన్ని మళ్లీ నౌకరీలో పెట్టుకోవలసివచ్చింది.

ప్రభుత్వపు చట్టములు ఉంటే అది క్రైస్తవులు, మహమ్మదీయులు, పార్సీలు మొదలైన వారికందరికీ ఉండాలి. కేవలం హిందువులకోసమే

కాదు. ఏదో ఒక జాతి మీద, ఒక వర్ణసముదాయం మీద ఆధిపత్యం చేయటం, దానిని పాపంచేసేందుకు బాధ్యురాలిని చేయటం, పాపంచేసే చట్టం చేయటం ప్రభుత్వానికి ఉచితంకాదు.

ప్రశ్న: ఎవరైనా పొరపాటున, తెలియక కుటుంబ నియంత్రణ ఆపరేషన్ చేయించుకుంటే ఇప్పుడతడేమి చెయ్యాలి?

సమాధానము: ఆపరేషన్‌లో కేవలం నరమే కత్తిరింపబడుతుందని డాక్టర్లు చెపుతారు. అవసరమైతే అది మళ్ళీ అతకవచ్చు. కాని గర్భాశయమే తీసేస్తే వాళ్లకింక చికిత్సలేదు. కాబట్టి కేవలం నరం కత్తిరించి ముడివేయటమే జరిగితే దాన్ని మళ్లీ సరిచేయించాలి. ఇటువంటి పని జరిగింది కూడ. ఇలా చేసిన వాళ్లకి సంతానం కూడ కలిగింది.

ఈ విధముగా కత్తిరించిన నరాన్ని సరిచేయించుకొని తమ పురుషత్వాన్నీ, స్త్రీత్వాన్నీ సరిచేయించుకొని మునుపుచేసిన అపరాధానికి పశ్చాత్తాపపడితే, అతని చేతితో పితృదేవతలకు పిండోదకాలు కూడ లభిస్తాయి. బ్రహ్మచర్యం పాటిస్తే తేజస్సు పెరుగుతుంది. ఓజోశక్తి ఉత్సాహం వృద్ధిపొందుతాయి.

ప్రశ్న: ఎవరైనా తెలియక గర్భపాతం చేయించుకుంటే ఇప్పుడామె దానికేం ప్రాయశ్చిత్తం చేసుకోవాలి?

సమాధానము: ఆమె ఒక సంవత్సరంపాటు ప్రతిరోజు ఒక లక్ష రామనామ జపం చెయ్యాలి. కాని తెలిసి గర్భపాతం చేసుకొన్నవాళ్లు ఈ విధంగా నామజపం చేసినప్పటికీ వాళ్లపాపానికి ప్రాయశ్చిత్తం కాదు. వాళ్ల పాపానికి శిక్ష ననుభవించవలసే వస్తుంది. కారణమేమిటంటే మహాపాపాన్ని నాశనంచేసే నామంయొక్క ఆసరాతీసుకొని ఎవరైనా పాపంచేస్తే అతన్ని నామం రక్షించదు. కాబట్టి అతని పాపాలు నశించవు. పైగా ధృడమవుతాయి. నామము తెలియకముందు అతడు పాపము చేయుటకు భయపడేవాడు. ఇప్పుడు భయపడకపోగా, దుర్వినియోగపరచి నామాపరాధమునకు కారకుడగుచున్నాడు. దానికి శిక్ష నతడు అనుభవించవలసినదే.

ప్రశ్న: జనాభాను అరికట్టకపోతే జనసంఖ్య చాలా పెరిగిపోతుంది. దానివల్ల జనానికి అన్నం లభించదు. మరి జనమెలా జీవించెదరు?

సమాధానము: ఈ ప్రశ్న సర్వవిధాలా తగనిది. యుక్తియుక్తంకాదు. కారణం? మనిషి పుట్టినచోటే అన్నమూ పుడుతుంది. మనిషి పుట్టి అన్నం పుట్టకుండా ఉండేలాంటి అంధకారం భగవంతుడి దగ్గరలేదు.

ప్రారబ్ధ పహలే రచా, పీఛే రచా సరీర్ ।
తులసీ చింతా క్యోం కరే, భజ లే శ్రీరఘువీర ॥

తల్లిస్తనాల్లో పాలు ముందేర్పడతాయి. బిడ్డ తరవాత పుడతాడు. దీనితో ఏం తెలుస్తుంది? బిడ్డ పుట్టినప్పుడు తల్లులు స్తనాలలోనుంచి మునుపటిపాలు పిండేసి బిడ్డకు క్రొత్తపాలు త్రాగిస్తారు. మనంకూడ ఎక్కడికైనా వెడితే అక్కడ యేర్పాట్లుముందే జరుగుతాయి. మనం తరవాత చేరుకుంటాం. ఉపన్యాసం తర్వాత పందిరి వేయటం జరగదు. పెళ్లివారు విడిది చేసేచోటు ముందే ఏర్పాటు చేయబడుతుందా? పెళ్లివారు వచ్చాకనా? ఏదైనా ఉత్సవమవుతుందంటే దాని యేర్పాటు ముందే జరుగుతుంది. ముందు ఉత్సవం తరవాత ఏర్పాట్లు జరగవు. ఇలా మనం చూస్తూనే ఉన్నాం, వైజ్ఞానికులు చెపుతున్నారు కూడ. ఏమని? చెట్లెక్కువగా ఉన్నచోట వర్షం అధికంగా పడుతుందని. చెట్లులేనిచోట వర్షం తక్కువగా ఉంటుంది. అలాగే మనుష్యులెక్కువుంటే ఆహారముకూడ ఎక్కువ పండుతుంది. అన్నానికి లోటెలా వస్తుంది? మనుషులు చెట్లకంటే నీచులా, తక్కువవారా?

ప్రశ్న: ఇప్పుడాహార మెందుకింత ఖరీదైనది? (costly)

సమాధానము: ఆలోచించిచూస్తే కుటుంబనియంత్రణం జరుగుతున్నప్పటి నుంచి ఆహారంకూడ ఖరీదెక్కువవుతూ వచ్చింది. తక్కువ పండుతూ వచ్చింది. మనుషుల సంఖ్య తక్కువయితే పంట ఎందుకెక్కువ పండుతుంది? కుటుంబనియంత్రణ నడవటంవల్లనే ఈ దశ వచ్చింది.

ఇప్పుడు - "మాంసం, చేపలు, గ్రుడ్లుతిను" అని ప్రచారం జరుగుతుంది. అయితే ఇంక వానెందుకు? వ్యవసాయమెందుకు? కారణమేమిటంటే - మాంసం తినటంవల్ల పశువులుండవు. అందుచేత వాటికి గడ్డి అవసరంలేదు. అలాగే మనుషులు మాంసంతింటే వాళ్లకోసం అన్నం అవసరంలేదు. అలాంటప్పుడు అనవసరంగా గడ్డి ధాన్యం ఎందుకు ఉత్పత్తికావాలి?

మనుష్యులధికమై వస్తువులుతక్కువైతే ధరల పెరుగుదల జరుగుతుంది. మనుషులు పనిచేయక సోమరులయినప్పుడే వస్తువులు తక్కువవుతాయి.

ప్రస్తుతం ఇదే దశ నడుస్తున్నది. జనం పని తక్కువ చేస్తున్నారు. ఖర్చు ఎక్కువ పెడుతున్నారు. ఇందువల్లనే ఇంత దుర్భిక్షం ధరలపెరుగుదల కలుగుతుంది. పని తక్కువ చేస్తే వస్తువులు తక్కువగానే ఉత్పత్తి అవుతాయి. కనుక దుర్భిక్షానికి కారణం జనాభా పెరుగుదలకాదు. మనుష్యులలో సోమరితనం ప్రమత్తత మొదలైన దోషాలు పెరుగుచున్నాయి. ప్రభుత్వాపు టవ్యవస్థ కూడ ఇందుకు కారణము.

**ప్రశ్న: మాకు వృత్తి - పని దొరకటంలేదు మరి మేమేం చెయ్యాలి?**

సమాధానము: పని దొరక్కపోవటానికి కారణం - మనిషి తానుచేరిన క్షేత్రంలో తన కర్తవ్యాన్ని సరిగా నెరవేర్చటంలేదు. పైగా అలసత్వము, నిర్లక్ష్యములో తన కాలం పాడుచేస్తున్నాడు. వాస్తవానికి పనికి లోటులేదు. కాని పనిచేసేవాళ్ల లోటుంది, పనిచాల ఉంది. కాని నమ్మకంగా ఆసక్తితో మనస్సుంచి పనిచేసేవాళ్లు తక్కువున్నారు. ఎవరైనా నమ్మకస్థుడుంటే అతనికి పని దొరకకపోవటం ఉండనే ఉండదు. అలసత్వము (సోమరితనం) నిర్లక్ష్యము, పని చెయ్యాలనే ఆశయం లేకపోవటం, మొదలైన దోషాలుండటం చేతనే అతనికి పని దొరకటంలేదు.

**ప్రశ్న: ఈ దుర్భిక్షపు రోజుల్లో (కరువురోజులు) అధికసంతానం**

కలిగితే దానిపోషణ మొదలైన వెలా చేస్తాం?

సమాధానం: మీరు ఆలోచించండి "అవసరమే ఆవిష్కారానికి తల్లి " (Necessity is the Mother of Invention). కాబట్టి జనసంఖ్య పెరిగి సంతానమధికమైతే దాని పోషణవ్యవస్థకూడ తప్పక ఏర్పడుతుంది. పూర్వకాలంలో మనం చూచిన విషయం:- తూనీగలు ఎక్కువైన సంవత్సరం పంట బాగా ఉంటుంది కరువురాదు. తూనీగలు వచ్చినప్పుడు జనం ఉత్సాహంతో "ఈ సారి వర్షం బాగా కురుస్తుంది" అనేవారు. ఎందుకంటే ఇన్ని ప్రాణులు వచ్చాయంటే వాటితిండికి ఏర్పాటు కూడ ఎక్కువవుతుంది. భగవంతుడి పూర్వవ్యవస్థే ఇప్పుడూ తప్పకుండా ఉంటుంది. మీరు కుటుంబ నియంత్రణ చేస్తున్నారు, వ్యవస్థయొక్క భారం మీ మీద వేసుకుంటున్నారు, ఈ విధముగా చేస్తున్నదాని పరిణామమే ఈనాడు వ్యవస్థ ఏర్పరచటం కష్టమయిపోతోంది. కనుక మీరు మీమీద భారం వేసుకోకండి. మీరు కర్తవ్యంలో నిమగ్నులై ఉంటే మీయొక్క మీ కుటుంబంయొక్క యోగక్షేమ వ్యవస్థ భగవంతునివైపునుంచి తప్పక జరుగుతుంది.

పూర్వం రాజుల, మహారాజుల ఇళ్లలో వేలకొలది సంతానాలు కలుగుతుండేవి, వాళ్లపోషణా జరిగేది. ఉదా:- సగరచక్రవర్తికి అరవైవేలమంది కొడుకులు. రాజు అగ్రసేనుడికనేకులు పుత్రులు వారి వంశీకుల్నే ఇప్పుడు "అగ్రవాల్" అంటున్నారు. ధృతరాష్ట్రుడికి వందమంది కొడుకులు ఇలా ఒక్కొక్కడికి వందలు వేలు సంతానం కలిగింది. ఎవరైనా తెలుసుకోవాలనుకుంటే నేను చెప్పగలను. ఊళ్లకి ఊళ్లే ఒక్కొక్కడి సంతతితో యేర్పడ్డాయి. మనం చూస్తూ ఉంటాం వాస్తవంలో విరక్తులై తమపొట్టగడుపుకొనే సంగతే పట్టించుకోక, అందుకేమీ కృషిచేయక ఉంటున్న సాధుపురుషుల "జీవనవ్యవస్థ ప్రజలే చేస్తున్నారు. తమ జీవికకోసం తంటాలుపడే వాళ్లకంటె ఆ విరక్తులైన సత్పురుషులకి జరిగే ఏర్పాటే బాగుంటుంది.

మీరు కొంచెం ఆలోచించండి. మహమ్మదీయ సోదరులు నాలుగేసి పెళ్లిళ్లు చేసుకుంటున్నారు. ఒక భాయికి నూటయాభైమంది సంతానం

కలిగిందని మేం విన్నాం. ఒక సోదరుడికి పంథొమ్మిది మంది బాలురు కలిగారు. వారిలో ఇద్దరు చనిపోయారు. మిగిలిన పదిహేడుగురున్నారు. వారు సాధారణముగా కుటుంబ నియంత్రణం చేసుకోరు. అయినా వారి సంతానపోషణ జరుగుతుంది. కేవలం హిందువులే అన్నం తింటున్నారా? వస్త్రములు ధరిస్తున్నారా? చదువుకుంటున్నారా? మిగిలినవాళ్లు అన్నం తినటంలేదా? బట్టలుకట్టుకోవటం లేదా? చదువుకోవటంలేదా? సంతానం కలగటమనేది దైవంయొక్క విధానమంటారు మహమ్మదీయ సోదరులు. దాన్ని మార్చే అధికారం మనిషికిలేదు. ఆ విధానాన్ని మార్చే వారు అనధికారచేష్ట చేస్తున్నారు. వాస్తవానికి కుటుంబ నియంత్రణ చేసుకొనే వాళ్ల జనసంఖ్య తగ్గిపోతోంది. అందుకే కుటుంబ నియంత్రణ పాటించకపోతే మన జనసంఖ్య పెరుగుతుందని అలా పెరగటంవల్ల మనదే రాజ్యమవుతుందనీ మహమ్మదీయులనుకొన్నారు. ఓట్లు కాలంకదా! అందుచేత వారు తమ సంఖ్య పెంచుకొనే ఆలోచనలో ఉన్నారు. కాని హిందువులు కేవలం తమ కొద్దిసౌకర్యం, సుఖంకోసం ఆపరేషన్, గర్భపాతం మొదలైన మహాపాపాలు చెయ్యటం మొదలుపెట్టారు. తమ సంఖ్య వేగంగా తగ్గిపోతోంది. ఈ వైపుకూడా వారి దృష్టిలేదు. పరలోకంలో భయంకరమైన దండన ఈ మహాపాపానికి అనుభవించవలసి వస్తుందని కూడా వాళ్లాలోచించటం లేదు. కేవలం తినటం సుఖానుభవం వైపు దృష్టయితే పశువులకీ ఉంటుంది. ఇదే దృష్టి మనిషికి కూడ ఉంటే అది మానవత్వంకాదు.

హిందూ ధర్మంలో మనుష్యజన్మ దుర్లభమని చెప్పబడింది. శ్రేయోమార్గం సుగమమని చెప్పబడింది. కనుక ఏ జీవుడైనా మనుష్యజన్మలోకి హిందుధర్మంలో వస్తుంటే అతనిని ఆపకూడదు. మీరు కనుక అతన్నాపితే ఆ జీవుడు ఇతర మతస్థుల ఇంట పుడతాడు. మీ మతాన్ని హిందువుల్ని నాశనం చేస్తాడు. ఎందుచేతనంటే జీవుడి ఋణానుబంధం కేవలం ఒక్కడితోటే ఉండదు. చాల మందితో ఉంటుంది?

కౌరవులకి పాండవులకి ఇద్దరికీ తొమ్మిదేసి అక్షౌహిణుల సేనలున్నాయి. కాని ఒక అక్షౌహిణి నారాయణి సేన ఒక అక్షౌహిణి శల్యుని సేన కౌరవులవైపు వెళ్లటంచేత కౌరవులసేన పాండవుల సేనకంటె నాలుగు

అక్షౌహిణులు పెరిగింది. అనగా పాండవుల సేన ఏడక్షౌహిణులు కౌరవులసేన పదకొండక్షౌహిణులు అయింది. ఇలాగే హిందువులు నరం కత్తిరించుకోవటం, ఆపరేషన్ ద్వారా సంతాననిరోధం చేయించుకుంటే వారికి పుట్టవలసిన సంతానం అన్యమతస్థులయిళ్లలో పుడుతుంది. ఎలాగయితే ఇప్పటికి హిందువులలో దాదాపు పన్నెండుకోట్ల శిశువులజన్మ అరికట్టబడిందో అలాగ. * కనుక ఆ పన్నెండు కోట్లశిశువులు గోఘాతకులైన అన్యమతస్థుల యిండ్లలో పుడుతుంటే ఇతరమతస్థులసంఖ్య హిందువులసంఖ్యకంటే ఇరవైనాలుగు కోట్లు పెరుగుతుంది. ఇతరమతస్థుల సంఖ్య పెరిగిందంటే వాళ్లు హిందువుల్నే నాశనం చేస్తారు. కాబట్టి హిందువులు తమ సంతానపరంపరని నష్టపరచకూడదు. గోఘాతకుల సంఖ్య పెంచి గోహత్యా పాపంలో భాగస్థులుకారాదు.

ప్రశ్న: సంతానం తక్కువుంటే వారి పెంపకంకూడ బాగుంటుంది. కుటుంబమూ సుఖంగా ఉంటుంది. కనుక కుటుంబ నియంత్రణంలో హానేముంది?

సమాధానము: తక్కువ సంతానం వల్ల కుటుంబం సుఖంగా ఉంటుందనేది సరికాదు. సంతానంలేని వాళ్లూ దుఃఖపడుతున్నారు. తక్కువ సంతానమున్నవాళ్లు దుఃఖితులవుతున్నారు. అధిక సంతానమున్న వాళ్లు కూడా దుఃఖిస్తున్నారు. మేము సంతానం లేనివాళ్లనీ చూచాం తక్కువ సంతానమున్నవాళ్లనీ చూచాం. అధిక సంతతి కలవాళ్లనీ చూచాం. వాళ్లతో మాటలాడాం. వాస్తవానికి సంతానం ఎక్కువ తక్కువ, ఉండటం సుఖదుఃఖాలకి కారణంకాదు. తక్కువ సంతానమున్నందుకు సంసారంలో ఒక్కడైన సుఖంగా ఉంటే చెప్పండి. సంసారంలో ఏమిటి? సృష్టిలోనేలేదు. దుఃఖానికి కారణం భోగపరాయణత్వం. "యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే" (గీత. 5/22) భోగపారాయణుడైనవాడు ఎప్పుడు

---

* సంతాన నిరోధంచేయించుకొన్నవారికి ముందు కలుగబోయే సంతానము కూడ స్వయంగా నిరోధమైంది. ప్రత్యేకవ్యక్తికి ముందుకలుగబోయే ఇద్దరుముగ్గురు సంతానం కూడ నిరోధమైందనుకుంటే ఈ సంఖ్య ఇరవైనాలుగు లేక ముప్పయ్యారుకోట్లకు చేరుకుంటుంది.

సుఖంగా ఉండలేడు. అది సంభవమే కాదు. భోగపరాయణుడైన వాడికి సంతానమెక్కువున్నా, తక్కువున్నా అసల్లేకపోయినా అతడు దుఃఖితుడుగానే ఉంటాడు.

వివాహానంతరం ఆరంభంలో స్త్రీకి పురుషుడి మీద, పురుషుడికి స్త్రీమీద ఆకర్షణ ఉంటుంది. ఇందువల్ల మొదట కలిగిన సంతానం కేవలం భోగేచ్ఛవలన కలుగుతుంది. భోగేచ్ఛవలన కలిగినసంతానం సాధారణంగా మంచిదిగా ఉండదు. భోగిగానే ఉంటుంది. ఇప్పుడు జరిగిన మంచి భావాల ప్రచారము, సంఘసంస్కారము అదంతా మంచి వ్యక్తులద్వారానే జరిగింది. భోగలాలసులు, చోరులు, దోపిడివాళ్లయిన వ్యక్తులద్వారా సంఘసంస్కార మెప్పుడైనా జరిగిందా? వాళ్లద్వారా సమాజం బాగుపడుతుందని ఊహించటానికైనా ఉందా? కనుక సంతానం తక్కువైనందువల్ల భోగిదైన సంతానమే కలుగుతుంది. దానివల్ల సమాజపతనమే జరుగుతుంది.

**ప్రశ్న: భగవంతుడైన రాముడు, భరతుడు మొదలైనవారు కూడ కుటుంబ నియంత్రణ చేశారు - "దుఇ సుత సుందర సీతాఁ జాఏ,' 'దుఇ దుఇ సుత సబ భ్రాతన్హ కేరే" (మానస. ఉత్తర. 25/3-4) కనుక ఇప్పుడు కూడ ఇద్దరే సంతానాన్ని కలిగి ఉంటే ఏం హాని?**

సమాధానము: ఏ రామాయణములోనూ శ్రీరాముడుగాని, సీతగాని సంతాననిరోధక శస్త్రచికిత్స (ఆపరేషన్) చేయించుకున్నారని వ్రాయలేదు. ఈ కుటుంబ నియంత్రణ ఆపరేషన్ మొదలైనవి మనం చూస్తూ చూస్తూ ఉండగా ఇప్పుడు ప్రారంభమయ్యాయి. ఇది విదేశీయులపని. మనదేశపు పనికాదు. శ్రీరామ భరతాదులు నలుగురు సోదరులు. శ్రీకృష్ణభగవానుడి పదహారువేల నూట ఎనిమిది మంది భార్యలలోనూ ఒక్కొక్కరికి పదేసిమంది కొడుకులు ఒక్కొక్క కూతురు కలిగారు. ఒక్కొక్కరికి సహజంగానే సంతానం తక్కువ ఒక్కొక్కరికి ఎక్కువ ఉంటుంది.

**ప్రశ్న: అధిక సంతానమున్నచో వారిని పోషించుటకే కాలమంతా గడిచిపోతుంది. ఇక భగవద్భజన ఎలా చేస్తారు?**

సమాధానము: మీరు ఎక్కువ సంతానవంతులు కావాలనేది మా

ఉద్దేశ్యం కాదు. అదీకాక మా ఆశయమేమంటే – మీరు కృత్రిమమైన ఉపాయంతో సంతాన నిరోధం చేసినకొద్ది సుఖంకోసం మీ శరీరమును, బలమును, ఉత్సాహమును నష్టపర్చుకోకండి. సేద్యమయితే చేస్తారు. నాగలితో దున్నుతారు. కాని విత్తనాలు చల్లరు. ఇది తెలివైన పనేనా? "హతం మైథునమప్రజమ్" సంతానం కలుగకపోతే స్త్రీ సంగమం వ్యర్థం. అందువల్ల మీరు ఇంద్రియాలకి దాసులుకాకండి. వాటికి పరవశులవకండి – మరిస్వతంత్రులుగా ఉండండి" అనేదే మా ఆశయం.

ప్రశ్న: అధికసంతానం ఇష్టపడటంలేదు. సంయమనం పాటించ లేకపోతున్నారు. ఇటువంటి స్థితిలో ఏం చెస్తారు?

సమాధానము: ఆలాకాదు. మీరు సంయమంతో, ఇంద్రియనిగ్రహంతో ఉండదలచుకొంటే సంయమం తప్పకుండ ఉంటుంది. నేను చాలకాలంక్రితం "బ్రహ్మచర్యమే జీవనం" అనే ఒక పుస్తకం చదివాను. దాని రచయిత "శివానంద". ఆయన ఆ పుస్తకంలో ఇలా వ్రాశారు – "నేను వివాహితుణ్ణి కాని ఉభయులమూ బ్రహ్మచర్యం పాటించాము. దానివల్ల నాకు చాల లాభం కలిగింది. ఒక తల్లి మాతో చెప్పింది" మా పొరుగున ఒక జైన కుటుంబముంది. రోజూరాత్రి వారు మాటలాడుకొనే చప్పుడు వినిపిస్తుంది. ఒకరోజున నేను – "మీరు రాత్రి మాటలాడుకుంటారు. నిద్రపోరా?" అని వారినడిగాను. వారిట్లనిరి –"పెళ్లికి ముందే మా ఇద్దరిలోనూ ఒకళ్లం కృష్ణపక్షంలోను, ఇంకొక్కరం శుక్లపక్షంలోను బ్రహ్మచర్యం పాటించాలని శపథం చేసుకొన్నాం. ఇప్పుడు మూడోపక్షం ఎక్కడినుంచి తెస్తాం? కనుక ఒక గదిలో ఉన్నప్పటికీ మేము పరస్పరం ధర్మచర్చ చేసుకుంటుంటాం" అని. దీని తాత్పర్యమేమిటంటే –మీరు గృహస్థాశ్రమంలో ఉండికూడ సంయమం పాటించగలరు. మీరు ఉత్సాహం నిలబెట్టుకోండి. ధైర్యం కోల్పోకండి. మనవల్ల సంయమమనేది జరగదని అనుకోవద్దు. మీరు ఇంద్రియనిగ్రహం పాటించకపోతే ఇంకెవరు పాటించగలరు. ధైర్యం కోల్పోకపోతే అసంభవంకూడ సంభవమవుతుంది.

హిమ్మత మత ఛాఁడో నరాఁ, ముఖ తే కహతాఁ రామ్ ।
హరియా హిమ్మత సే కియా, ధ్రువ కా అటల ధామ్ ॥

అందువల్ల ఉత్సాహం ఉంచుకోండి. భగవంతుడిమీద భారం వేయండి. ఆయన్ని ప్రార్థించండి - "హే నాథా! మేము సంయమం నిలుపుకొనే నియమం తీసుకుంటున్నాం. నీవు మాకాశక్తిని ప్రసాదించుము." ఇలా మీరెంత తత్పరులై ఉంటే, భగవంతుడిమీద భారం ఉంచితే అంతే మీకు అలౌకిక చమత్కారం కనపడుతుంది. చేసి చూచుకోండి.

పూర్వకాలంలో ఈ ఆపరేషన్లు ఉండేవికావు. ఆ రోజుల్లో జనం నిగ్రహంతో ఉండేవారు. ఇప్పుడు కూడ నిగ్రహం పాటించాలి. ప్రస్తుతం సంయమాదిగుణాలు దైవీసంపత్తి స్వాధీనపరుచుకోవటంలో కాఠిన్యం అనుభవమవుతోంది. దానికి కారణం ముందు అసంయమాదికమైన ఆసురీ సంపత్తియొక్క స్వభావం ఏర్పరచుకోవటం జరిగింది.

ఆలోచించండి - సత్యంపలికేవాడితో "మీరబద్ధమాడితే మేము మీకొక వేయి రూపాయలిస్తాం" అంటే కూడ అతడసత్యమాడడు. కాని సత్యాసత్యాల విచక్షణ లేని వాడితో "మీరు నిజం చెప్పితే అయిదు రూపాయలిస్తా" అంటే ఆయన నిజం చెప్పేస్తాడు. మాంసం తినని వాడితో "మీరు మాంసం తింటే ఒక వేయిరూపాయలిస్తా"మంటే ఆయన చని పోతాడుగాని మాంసం తినడు. కాని మాంసం తినేవాడితో మీరు మత్స్య మాంసాలు తినకండి. ఇంకోచోట భోజనం చేయక కేవలం మా యింటిలోనే శాకాహార భోజనం చేశారంటే మేము మీకు రోజూ ఒకరూపాయి ఇస్తాం" అంటే ఆయన నెలరోజులు మీయింటిలోనే భోజనం చేస్తాడు. మద్యపానం మొదలైన వ్యసనం లేనివాడిని భయపెట్టి, ప్రలోభపెట్టి మద్యం తాగమంటే ఆయన మద్యపానం చేయలేడు. కాని మద్యపాన వ్యసనమున్న వారు కూడ మహాత్ముల సాంగత్యంలోకి వచ్చి రోగంలేక పోవటం మొదలైనవాటి లోభంలోపడి వ్యసనం విడిచిపెట్టేస్తారు. సత్యం చెప్పటం, మాంసాదులు విడిచిపెట్టటం అయితే తేలిక, కాని అసత్యం చెప్పటం మద్యపానం చేయటం కఠినమన్నమాట. అలాగే సంయమత్యాగం కఠినం. సంయమం పాటించటం కఠినం కాదు. ఇది అనుభవసిద్ధమైన విషయం.

ఇంకో సంగతి – సంయమం స్వతస్సిద్ధం. అసంయమము కృత్రిమంగా తెచ్చిపెట్టుకొన్నది. స్వతస్సిద్ధమనేది కఠినమెందుకవుతుంది? దీనిమీద కొంచెం ధ్యానముంచండి. సంయమత్యాగం చేసి తమ జీవనం సంయమహీనంగా, క్రమశిక్షణలేకుండా చేసుకొన్నవాళ్లు మళ్లీ సంయమవంతులవటం కఠినమైపోతుంది. మొదటినుంచీ సంయమన జీవనం గడిపితే దుర్వ్యసనాలు, దుర్గుణాలు దరిచేరవు. మనిషిలో కూడ శూరవీరత్వమూ ఉత్సాహమూ శాంతీ ఉంటాయి. సంయమముగా ఉండటంవల్ల కలిగేటంత ప్రసన్నత, ఆరోగ్యం, బలం, ధైర్యం ఉత్సాహం నియమరహితంగా ఉండటంవల్ల ఉండవు. మీరు కొన్నాళ్లు సత్సంగంలో ఉండి సంయమం పాటిస్తే దానివలన ఎంతలాభముందో మీకనుభవమవుతుంది. సంసారంలో ఉన్నరోగాలన్నీ సాధారణంగా అసంయమంవల్లే వస్తున్నాయి. ప్రారబ్ధజన్యరోగాలు చాలతక్కువ ఉంటాయి. సంయమవంతులైన వారికి చాల తక్కువరోగాలుంటాయి. సంయమవంతుడు నిర్భయంగా ఉంటాడు. అసంయమియైన వాడికి, చింత, భయం మొదలైనవి చాల ఎక్కువుంటాయి. ఉదా:– అసంయమియైన రావణుడు సీతను తీసుకురావటానికి వెళ్లేటప్పుడు భయంతో నలుదిక్కుల చూస్తాడు –"సో దససీస స్వాన కీ నాఈఁ । ఇత ఉత చితఇ చలా భడిహాఈఁ ॥" (మానస. అరణ్య. 28–5) కాని సంయమవంతురాలైన సీత రాక్షసుల నగరంలో రాక్షసుల మధ్యకూర్చొని కూడ నిర్భయంగా ఉంది. ఒంటరిది. స్త్రీ అయినప్పటికీ కూడ ఆమె కెవరివల్ల భయం లేదు. ఎంతవరకంటే ఆమె రావణుణ్ణికూడ అధముడా! సిగ్గులేనివాడా! అంటూ ఇలాంటి మాటలతో అదిలించింది –

సఠ సూనేఁ హరి ఆనేహి మోహీ ।
అధమ నిలజ్జ లాజ నహిఁ తోహీ ॥

(మానస. సుందర. 9/5)

మన శాస్త్రములలో బ్రహ్మచర్యమునకు చాలా మాహాత్మ్యమున్నది. విదేశీ సజ్జనులుకూడ దీనినాదరించారు. "జీవితంలో పురుషుడు ఒక్కసారే తన స్త్రీతో సంగమం చెయ్యాలి" అని వారన్నారు.

ఒకసారి కుదరకపోతే సంవత్సరానికొకసారి చెయ్యండి. సంవత్సరానికొకసారి కూడ ఉండలేకపోతే నెలకొకసారి సంగమం చెయ్యండి. అంటే కేవలం ఋతుగామి (ఋతుకాలంలో కలవటం) అని అర్థం. ఇందులో కూడ ఉండలేకపోతే మీ శవంమీద కప్పే గుడ్డ కొని ఉంచుకోండి. కారణం? మాటిమాటికి సంగమం చేయటంవల్ల ఆయువు త్వరగా నశిస్తుంది. మనిషి త్వరగా మరణిస్తాడు. ఇట్లా అయితే అల్పాయుష్కుడుగా మరణించటాని కనేక కారణాలున్నాయి. కాని వాటిలో వీర్యనాశనం చేసుకోవటం ముఖ్యకారణం. కనుక దీర్ఘాయువు కావటానికి, ఆరోగ్యం కోసం, రోగాలు లేకుండా ఉండటానికి బ్రహ్మచర్యపాలనం చాల అవసరం. సింహం జీవితంలో కేవలం ఒక్కసారే సింహినీ సంగమం చేస్తుంది.* అందుచేత దానిలో వీర్యరక్ష అధికంగా ఉండటంచేత విశేషమైన ఓజో బలముంటుంది. అందువల్ల అది తనకంటే ఆకారములో పెద్దదైన ఏనుగుని కూడ చంపేస్తుంది. కాని మాటిమాటికీ స్త్రీ సంగమం చేసే మనిషిలో ఓజోశక్తి కలుగదు. పైగా నిర్బలత్వం వస్తుంది. ఓజోశక్తి బ్రహ్మచర్యపాలనంవల్లనే ఉత్పన్నమవుతుంది.

బ్రహ్మచర్యం పాటించటంవల్ల పెద్దపెద్ద రోగాలు రావు. బ్రహ్మచర్య పాలనం చేసేవారి సంతానం తేజస్వంతము రోగహీనమయి ఉంటుంది. కాని బ్రహ్మచర్యపాలనం చేయనివారి సంతానం తేజస్సుకలిగి, రోగరహితముగా ఉండదు. ఎందుకంటే పలుమార్లు సంగమించటం వల్ల రజోవీర్యాలలో ఆశక్తి ఉండదు. భోగాసక్తివలన కలిగే సంతానం భోగిగానూ, రోగిగానూ ఉంటుంది. కనుక ధర్మానికి ప్రాధాన్యమిచ్చే సంతానోత్పత్తి చెయ్యాలి. దానివల్ల సంతతి ధర్మాత్మకముగానూ రోగరహితముగానూ పుడుతుంది. భగవంతుడు కూడ ధర్మపూర్వకమైన కామం తన స్వరూపమన్నాడు.

"ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ" (గీత. 7/11)

---

* సింహ గమన, సజ్జన బచన, కదలి ఫలై ఇక బార ।
తిరియా తేల, హమ్మీర హఠ, చఢై న దూజీ బార ॥

కేవలం శాస్త్రమర్యాదానుసారంగా సంతానోత్పత్తికోసం ఋతుకాలంలో భార్యతో కలిసేవాడు గార్హస్థ్యంలో ఉంటూ కూడ బ్రహ్మచారిగా పరిగణింపబడతాడు. కాని కేవలం భోగేచ్ఛ, సుఖేచ్ఛతో తన స్త్రీని కలిసేవాడు పాపం చేస్తున్నాడు. గీత విషయభోగచింతన మాత్రంచేతనే పతనమవటాన్ని చెప్పింది (గీత. 2/62–63) కామము సంపూర్ణ పాపాలకి మూలమనీ నరకానికి ద్వారమని చెప్పింది. (3/36, 16/21). అనగా భోగేచ్ఛతో తన స్త్రీని కలవటం నరకానికి ద్వారము, పాపాలకి అనర్థాలకి హేతువూను.

దృఢంగా ఆలోచించినమీదట బ్రహ్మచర్యపాలనం కఠినం కాదు. బ్రహ్మచర్యం పాటించటం మనుష్యుడికి ముఖ్యమైన విషయం. మనుష్యుడు సంయమం చూపకపోతే ఆతడు పశువుకంటే కూడ హీనుడు. పశువులలో గాడిద, కుక్క నీచమైనవిగా పరిగణింపబడతాయి. కాని సంవత్సరంలో ఒక నెలే వాటికి ఋతువు. ఆ నెలలో వాటిని రక్షిస్తే వాటికి సంయమం కలుగుతుంది. ఎలాగంటే – "శ్రావణమాసంలో గాడిదని, కార్తీకంలో కుక్కనీ, మాఘమాసంలో పిల్లినీ రక్షిస్తే వాటిచేత బ్రహ్మచర్యం పాటింపచేస్తే వాటికి నిగ్రహం వస్తుంది. కాని మనిషికి పన్నెండు నెలలూ తెరుచుకునే ఉన్నాయి. కనుక మరొకరెవరూ వారిని రక్షించలేరు. తలచుకుంటే అతడు తనను తానే రక్షించుకోగలడు. అందుకే శాస్త్రాలలో మనిషికి బ్రహ్మచర్యపాలనకి ఆజ్ఞ ఇవ్వబడింది. బ్రహ్మచర్యపాలనం చేయటంవల్ల బ్రహ్మవిద్యాప్రాప్తి కలుగుతుంది. మహానందప్రాప్తి కలుగుతుంది.

ప్రశ్న: పురుషుడు నిగ్రహం పాటించి, మరి స్త్రీ నిగ్రహం చూపకపోతే ఏం చెయ్యాలి?

సమాధానము: స్త్రీకింద్రియ నిగ్రహముంటుంది. వాస్తవానికి పురుషుడే స్త్రీని పాడుచేస్తున్నాడు. స్త్రీలలో ఉన్నంత కామవేగనిరోధకశక్తి పురుషులలో లేదు.

మొదటినుండి సంయమం పాటిస్తే అది తేలికగా ఉంటుంది.

భోగప్రవృత్తి అధికమైనాక సంయమం పాటించటం కఠినమైపోతుంది. కనుక కామం వేగం కలుగనప్పుడు స్త్రీ పురుషు లుభయులు శాంతచిత్తులై- "మనం అధికసంతానం కోరకపోతే సంయమం పాటించాలి. దానివల్ల మన శరీరము ఆరోగ్యముగా ఉంటుంది" అని ఆలోచించుకోవాలి. ఇలా అనుకొని ఇద్దరు రాత్రి వేరువేరుగా ఉండాలి.

మనిషి సంయమమయితే యెల్లప్పుడు పాటించగలడు కాని భోగం ఎల్లప్పుడు అనుభవించలేడు. ఇది స్వతస్సిద్ధం. కాబట్టి సంయమం విషయంలో ధైర్యం కోల్పోకూడదు. గర్భపాతం, శస్త్రచికిత్స వంటి మహాపాపాల నుంచి కాపాడుకోవాలి.

ఈ హిందూ సమాజం గర్భపాతంవంటి మహాపాపాలనుంచి తప్పుకోనంత వరకు ఇది ఉద్ధరింపబడటం కష్టం. ఎందుచేతనంటే తన పాపమే తనని తినేస్తుంది. ఈ జాతి తమ ఉన్నతిని, అభివృద్ధిని కోరితే ఈఘోరమైన మహాపాపం నుండి బ్రహ్మహత్యకంటే రెట్టింపైన పాపం నుంచి తప్పించుకోవాలి. గతసంవత్సరం భారతదేశంలో దాదాపు ఇరవైయొక్క లక్షల గర్భపాతాలు చేయబడ్డాయని ఒక సోదరుడు మాతో చెప్పాడు. ఇటువంటి ఇహపరలోకనాశకారకమైన మహాహత్యలవలన సమాజం గతి ఏమవుతుందో భగవంతుడికే తెలియాలి? ధర్మపరాయణమైన భారతదేశంలో ఎంత ధర్మవిరుద్ధమైన పని జరుగుతోంది? దీనికంతులేదు. దీని పరిణామం చాల భయంకరంగా ఉంటుంది. ఇందుచేత సమయముండగానే జాగ్రత్తపడాలి.

కా బరషా సబ కృషీ సుఖానేం ।
సమయ చుకేం పుని కా పఛితానే ॥

మా ఉద్దేశం ఒకర్ని నిందించటం, ఒకర్ని నీచంగా చూపించటం కానేకాదు. మేము చెప్పేదేమనగా మానవశరీరంలోకి వచ్చి కనీసం గర్భపాతం వంటి మహాపాపాల్నుంచి మాత్రం తప్పుకోండి..

బడే భాగ మానుష తను పావా ।
సుర దుర్లభ సబ గ్రంథహ్ని గావా ॥
(మానస. ఉత్తర. 43/4)

కబహుఁక కరి కరునా నర దేహీ ।
దేత ఈస్ బిను హేతు సనేహీ ॥
(మానస. ఉత్తర. 44/3)

దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః ।
(శ్రీమద్భా. 11/2/29)

లబ్ధ్వా సుదుర్లభమిదం బహుసంభవాన్తే ।
మానుష్యమర్థదమనిత్యమపీహ ధీరః ॥
(శ్రీమద్భా. 11/9/29)

ఈ విధంగా మనుష్యశరీరం ఇంత దుర్లభమని చెప్పబడింది. ఆ మనుష్యశరీరంలోకి జీవుణ్ణి రానివ్వకపోవటం, జీవుడికిటువంటి దుర్లభశరీరం లభింపనివ్వకపోవటం ఎంత మహాపాపం! ఇటువంటి మహాపాపాల నుంచి రక్షించుకోండి.

-----oOo-----

# 7. కలహ నివృత్తి

**ప్రశ్న: కుటుంబంలో తగువు, కలహం, అశాంతి మొదలైనవి జరగటానికి కారణమేమిటి?**

సమాధానము: ప్రతిప్రాణి తన మనస్సుకి తోచింది చేద్దామనుకుంటాడు. తన అనుకూలత కోరతాడు. తన సుఖం, విశ్రాంతి కోరతాడు. తన మహిమ వాంఛిస్తాడు. తన స్వార్థం సిద్ధింప చేసుకుందామనుకుంటాడు. ఇటువంటి వ్యక్తిగత స్వార్థం కారణంగానే కుటుంబంలో తగువు, కలహం, అశాంతి మొదలైనవి జరుగుతాయి. కుక్కలు వాటిలో అవి చాలప్రేమతో ఆడుకుంటాయి. కాని రొట్టెముక్క ముందుకిరాగానే పోట్లాట ప్రారంభమయినట్లే. కనుక పోట్లాటకి కారణం రొట్టెముక్కకాదు. వ్యక్తిగత కారణం.

కుటుంబంలో కేవలం తన సుఖం ఆనందం కోరుకొనేవాడు కుటుంబి కాడు. ఒకవ్యక్తి అవుతాడు. కుటుంబంలో పెద్ద, చిన్న, అందరూ సమానులే. అందరి మేలుకోరుతూ అందరికీ మేలుచేస్తూ ఉన్నవాడే కుటుంబీకుడవుతాడు. కనుక కుటుంబంలో శాంతి కోరుతూ కలహం ఇష్టపడనివాడు తన కర్తవ్యం ఇతరుల అధికారం చూడాలి. అంటే తన కర్తవ్యం పాలించాలి. ఇతరులకు మేలు చేయాలి. ఆదరసత్కారాలు, సంతోషాలు కలిగించాలి.

ప్రశ్న: అన్నదమ్ములు తమలోతాము పోట్లాడుకుంటే తల్లిదండ్రులేం చెయ్యాలి?

సమాధానము: తల్లిదండ్రులు న్యాయం చెప్పాలి. చిన్న కొడుకుతో "నీవు భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల్ని చూడు వారు శ్రీరాముడితో ఎలా ప్రవర్తించేవారో. భీమార్జునాదులు తమ అన్న ధర్మరాజు యెడల ఎలా నడచుకొనేవారో"* అని చెప్పాలి. పెద్దవాడితో శ్రీరామచంద్రుడు తన తమ్ముళ్లనెలా చూచేవాడో చూడు. యుధిష్ఠిరుడు తన సోదరులతో ఎలా ప్రవర్తించేవాడో చూడు. కనుక మీరందరు వారి చరిత్ర లాదర్శంగా తీసుకొని మీ ఆచరణలో పెట్టాలి" అని చెప్పాలి.

ప్రశ్న: అన్న – చెల్లెలు లేక అక్క, తమ్ముడు తమలో తాము పోట్లాడుకుంటే తల్లిదండ్రులేం చెయ్యాలి?

సమాధానము: తల్లిదండ్రులు ఆడపిల్లపక్షం వహించాలి. ఎందుచేతనంటే అది సువాసిని. దానానికి పాత్రురాలు+ కొద్దిరోజులుండేది. కనుక ఆమె ఆదరించదగినది. పిల్లవాడయితే ఇంటికి యజమాని. ఇంటిలోనే ఉండేవాడు. పిల్లవాడికి ఏకాంతంలో "బాబూ!

---

* ఇందుకు గీతాప్రెస్ ప్రచురించిన తత్త్వచింతామణి రెండవ భాగంలో "రామాయణంలో ఆదర్శభ్రాతృప్రేమ" అనే వ్యాసం మననపూర్వకంగా చదవాలి.

\+ సోదరి, కూతురు, మేనకోడలు వీరికి భోజనంపెట్టటం బ్రాహ్మణునికి భోజనం పెట్టటంతో సమానమైన పుణ్యంగా భావింపబడింది.

చెల్లాయిమీద నిరాదరంచూపకు. ఆమె ఇక్కడుండేది కాదు. తనయింటికి వెళ్లిపోతుంది నీవయితే యిక్కడి యజమానివి" అని తెలియపరచాలి.

సోదరి సోదరుడి దగ్గరనుంచి యేమీ ఆశించకూడదు. సోదరుడెంతిస్తే అందులో నుంచి కొంచెమే తీసుకోవాలి. "అన్నయ్య (తమ్ముడు) ఇంటినుంచి తీసుకొన్నందువల్ల మన జీవనము గడవదు. మనయింటితోటే గడుస్తుంది" అని ఆమె యోచించాలి.

ప్రశ్న: కొడుకు కోడలు యిరువురు పోట్లాడుకుంటే తల్లిదండ్రులేం చెయ్యాలి?

సమాధానము: "మేమెంతకాలం కూర్చుని ఉంటాం? ఈయింటి యజమానులు మీరే. మీరే పరస్పరం పోట్లాడుకుంటే ఈ కుటుంబపాలనం ఎవరు చేస్తారు? భారమంతా మీ మీదే ఉంది కదా!" అని తల్లితండ్రులు వాళ్ల కిద్దరికీ తెలియజెప్పాలి.

కుర్రాడితో వేరుగా – "బాబూ! నీ కోసమే నీ భార్య తన తల్లిదండ్రాదులందరినీ విడిచిపెట్టింది. నీవు మాత్రం నీ తండ్రి సింహాసనము మీద కూర్చున్నావు. నీవేం త్యాగం చేశావు? కనుక ఇటువంటి త్యాగమూర్తియైన స్త్రీని తను, మనో, ధనాదులచేత ప్రసన్నురాలినిగా ఉంచాలి. ఆమెను పాలించటం నీ ముఖ్యకర్తవ్యం. కాని ఇది గుర్తుంచుకోవాలి. నీవు పతివి. కనుక స్త్రీదాసత్వంలో చిక్కుకోకూడదు. ఆమెకు బానిసవు కారాదు. ఆమెకు మేలుకలిగే పనినే ఆసక్తిరహితంగా చెయ్యి. జీవమాత్రానికి హితవు చేయటమనేది మనుష్యమాత్రుడి కర్తవ్యం. నీవు భార్య కొక్కదానికే మేలు చేయలేకపోతే ఇంకేం చేస్తావు? అని చెప్పాలి. " నీ తల్లిదండ్రుల్ని, అన్నవదినెల్ని, మేనల్లుళ్లు మొదలైనవాళ్లనందరినీ విడిచిపెట్టావు. ఇప్పుడు భర్తను కూడ రాజీపరచలేకపోతే, అతన్నికూడ సేవించలేకపోతే ఇంకేం చేయగలవు? ఎవడైనా సముద్రందాటి ఒడ్డుకి వచ్చి అక్కడ మునిగితే అదెంత సిగ్గుచేటు? నీవు ఒకే వ్రతాన్ని నిర్వహించాలి" అని కోడలికి తెలియజెప్పాలి.

ఏకఇ ధర్మ ఏక బ్రత నేమా। కాయఁ బచన మన పతి పద ప్రేమా ॥
(మానస, అరణ్య 5/4)

ప్రశ్న: ఆడుపడుచు, వదినగారు ఒకరితో ఒకరు పోట్లాడుకుంటే తల్లిదండ్రులేం చెయ్యాలి?

సమాధానము : తల్లి తన కూతురుతో చూడమ్మాయీ ఈ వదినె ఈ కాలపు పిల్ల. ఈమె ఏం చెప్పినా దాన్ని గొప్పదని నీవు అర్థంచేసుకొని ఆదరించాలి. ఈమె యింటి యజమానురాలు. కాబట్టి నీవు నాకంటె కూడ ఎక్కువ విశేషంగా ఈమెనాదరించు. నాకు గౌరవలోపము జరిగినకూడ నేనేమీ బాధపడను. ఎందుచేతనంటే నీవు నా కూతురు వవటంవల్ల నామీద నీకు మమకారముందని చెప్పాలి.

వదినెగారెలా ఉండాలి? ఆమె ఆడపడుచునెక్కువ గౌరవించాలి. ఎందుచేత? ఆమె అతిథిలా వచ్చింది. ఆడుపడుచు పిల్లల్ని తన పిల్లలకంటెకూడ ఎక్కువ ప్రేమగా చూడాలి.* పిల్లలు సంతోషపడితే వాళ్ల అమ్మకూడ సంతోషిస్తుంది. ఇది సిద్ధాంతం. ఇలా ఆడపడుచుకు నచ్చచెప్పాలి. ఇతరులను సమాధానపరచి సంతోషపెట్టటం శ్రేయస్కరం.

కూతురిమీద మోహం ఉండటంవల్ల తల్లికూతురికేదైనా ఇవ్వదలచుకుంటే కూతురు తీసుకోకూడదు. కూతురు తల్లితో– "మావదినగారిస్తే అప్పుడు తీసుకుంటాను. నీవిస్తే వదినకది చెడుగా తోస్తుంది. నీతో పోట్లాడుతుంది. మీకు కలహము కలిగించుటకు నేనిక్కడికిరాలేదు. అమ్మా! నీ విచ్చినది స్వీకరిస్తే కొద్దిరోజులే లభిస్తుంది. కాని వదినె చేతుల్లోంచి తీసుకుంటే చాలరోజులవరకు లభిస్తుంటుంది. కనుక త్యాగదృష్టితోను, వ్యవహారదృష్టితోను, స్వార్థదృష్టితోను చూచిన వదినెచేత

---

* కోడలు అందరికంటే ఎక్కువగా (మొదటిశ్రేణిలో) ఆడుబడుచుపిల్లల్ని ప్రేమించాలి. ఇలాగే తోడికోడలుపిల్లల్ని రెండవస్థాయితోను, మూడవ నెంబరుగా జ్యేష్ఠుని భార్యపిల్లల్ని (మరిది భార్య) నాల్గోనెంబరుగా అత్తపిల్లల్ని, ఐదవస్థానంలో తన పిల్లల్ని ప్రేమించాలి.

ఇచ్చింది తీసుకోవటమే ఉచితము" అని చెప్పాలి.

ప్రశ్న: (పెద్ద)అన్నయ్య తల్లిదండ్రులతో పోట్లాడితే తమ్ముళ్లు ఏమిచెయ్యాలి?

సమాధానము: తమ్ముడు అన్న పాదములమీదపడి నమస్కరించి ప్రార్థించాలి. అన్నయ్యా నీవిలాప్రవర్తిస్తే మేమెవర్ని ఆదర్శంగా భావిస్తాం? అందువల్ల నీవు మామీద దయయుంచి తల్లిదండ్రులతో ఉత్తమోత్తమ ప్రవర్తనతో మెలగాలి. ఇలా చేయటంవల్ల మీకు రెండురకాల లాభం కలుగుతుంది. ఒకటి మీ సత్ప్రవర్తన ప్రభావం కుటుంబంమీద పేటమీద (కాలని) బాగా పడుతుంది. రెండు – మీ ఆచరణలను మేము ఆదర్శంగా తీసుకుంటాము. అలాగే ఆచరిస్తాం. దానివల్ల మీకు పుణ్యం వస్తుంది. కనుక మీ ఆచరణం ఆదర్శం కావాలి. మేము మిమ్మల్ని కేవలం ప్రార్థిస్తున్నాం. ఎందుచేతనంటే నీవు మాకు తండ్రితో సమానుడవు కదా.

ప్రశ్న: సోదరులు తల్లిదండ్రులతో పోట్లాడితే అన్న ఏంచెయ్యాలి?

సమాధానము: అన్న తమ్ముళ్లకి తెలియచెప్పాలి – "చూడండి తమ్ముళ్లూ! నేనూ మీరు అందరం పిల్లలం. తల్లిదండ్రులు మనకి అన్నివిధాలా ఆదరణీయులు, పూజ్యులూను. భగవత్ప్రాప్తి పొందగలిగిన శరీరం మనకి తల్లిదండ్రుల దయవల్లనే లభించింది. మనం వాళ్ల ఋణం నుంచి యెప్పుడూ విముక్తులం కాలేము. మనం వాళ్లకనుకూలంగా ఉంటే వాళ్లు తృప్తి పొందటంవల్ల ఆ ఋణం క్షమింపబడుతుంది. మనము మన చర్మంతో చెప్పులు కుట్టించి తల్లిదండ్రులకి తొడిగినప్పటికీ వాళ్ల ఋణం తీరదు. ఎందుచేత? ఆ చర్మం వచ్చిందెక్కడినుంచి? వారివస్తువే వారికిచ్చామన్నమాట. మనది మనమేమిచ్చాం? వారి వస్తువుని మనం మనదనుకొంటున్నాం. ఇది పొరపాటు. వాళ్లు మననెలా ఉంచటానికైనా వాళ్లకి మనమీద పూర్తి అధికారం ఉంది" అని చెప్పాలి.

ప్రశ్న: సోదరి తల్లిదండ్రులతో పోట్లాడితే సోదరుని కర్తవ్యం యేమిటి?

సమాధానము: సోదరుడు న్యాయంచూచి న్యాయంలోకూడ అతడు

సోదరియొక్క పక్షం వహించాలి. తల్లిదండ్రులతో - "చెల్లెలు అతిథిలా వచ్చింది. దీనిని ప్రేమతోచూడాలి" అని చెప్పాలి. కాని సోదరిదే అన్యాయమైతే ఏకాంతంగా సోదరితో - పరస్పర ప్రేమకే మహిమ ఉంది. కలహానికి లేదు. తల్లిదండ్రులు గౌరవించదగినవారు. అందుచేత మనమందరం మాతాపితరులను ఆదరిద్దాం. అల్ప విషయాలకోసం వారినెందుకు నిరాదరించాలి?" అని సౌమ్యముగా నచ్చచెప్పాలి.

ప్రశ్న: తమ్ముడు వదినగారితో పోట్లాడితే అన్న ఏమి చెయ్యాలి?

సమాధానము: అన్న తమ్ముణ్ణి మందలించాలి. "నీవేం చేస్తున్నావ్? శాస్త్రం దృష్టితో అన్న భార్య తల్లితో సమానం. లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు సీతయెడల ఎలా మెలిగారు? వారి చరిత్ర మళ్లీ మళ్లీ చదువు. మననం చెయ్యి. దానివల్ల నీలో నిర్మల భావాలు కలుగుతాయి. నీ బుద్ధి సహజంగానే శుద్ధమవుతుంది".

ప్రశ్న: అన్న భార్య, తమ్ముని భార్య పరస్పరం తగువులాడుకుంటే అన్నదమ్ము లేం చేయాలి?

సమాధానము: వారు తమతమ భార్యలకు తెలియచెప్పుకోవాలి. తమ్ముడు తన భార్యతో - "నీవు మా అన్నయ్యను తండ్రితో సమానంగాను మా వదినెను తల్లితోసమానంగాను భావించి వారినాదరించాలి". పెద్దవాడు తన భార్యకు నీకు నా తమ్ముడు కొడుకు లాంటివాడు. వాడి భార్య కూతురు లాంటిది. కాబట్టి నీవు వాళ్లని ప్రేమతో చూడాలి. అతని భార్య ఏదైనా అన్నప్పటికీ నీవు ఆమెను క్షమించాలి. నీవు పెద్దదానవు కదా! నీవామె మాట సహించటంవల్ల ఆమెను ప్రేమగా చూడటంవల్ల నీస్థాయి ఉన్నతమవుతుంది. ఆగ్రహించేవాడు చివరికి ఓడిపోతాడు. ఇతరుని కోపాన్ని ధైర్యంతో సహించేవాడు జయిస్తాడు.

వారు ఆడవారి కలహాన్ని తమదాకా రానీయకుండా సోదరులిద్దరు జాగ్రత్తపడాలి. స్త్రీలలో సహనశక్తి తక్కువుంటుంది కాబట్టి సోదరులు చాల జాగ్రత్తగ మెలగాలి. ఉభయులలో ఒకరిపై వేరొకరికి నమ్మకము లేకుంటే,

అలాగే స్త్రీలలో ఓర్పునశిస్తే వేరే ఉండాలి.* కాని వేరు పడి ఉండటం కూడ ప్రేమకోసమే జరగాలి. విడిపోయాక కూడ పరస్పరం పోట్లాటలుంటే ఇంకవేరుపడి లాభమేమిటి? కాబట్టి ప్రేమకోసమే కలిసుండాలి. ప్రేమకోసమే వేరుపడాలి. వేరుపడ్డాక తమ భాగంకోసం పోట్లాడుకోకూడదు. అలాగే చిన్నవాడు అన్న ఎంతిస్తే అంతే తీసుకోవాలి. అన్న తన దృష్టితో తమ్మడికెక్కువివ్వాలి. వాడుచిన్నవాడు కనక. ప్రేమ పాత్రుడు. తనంతట తానెక్కువిచ్చినా తమ్ముడు (తనదృష్టికి) సరిగా లేదనుకొంటే అన్న తమ్ముని ఉద్దేశ్యంనే ఆదరించాలి. మన్నించాలి. తన దృష్టినికాదు.

త్యాగమే గొప్పది. తుచ్ఛమైన వస్తువులకోసం రాగద్వేషాలు చూపటం చాలపెద్దతప్పు. ఎందుకంటే విషయాలు వస్తువులు ఇక్కడే ఉంటాయి. కాని రాగద్వేషాలు కూడ వస్తాయి. కనుక మనిషి ఎప్పటికప్పుడు జాగ్రత్తగ ఉండాలి. తన అంతఃకరణనెప్పుడూ కళంకితం చేసుకోకూడదు.

ప్రశ్న: కొడుకులు పరస్పరం పోట్లాడుకుంటే అన్నదమ్ములేం చెయ్యాలి?

సమాధానము: వీలయినంతవరకు తన కొడుకుపక్షం వహించకూడదు. సోదరుడి కొడుకు పక్షాన్నే మాటలాడాలి. సోదరుడి కొడుకుది అన్యాయమైతే వాడికి శాంతంగా తెలియచెప్పాలి. అంటే తన స్వార్థం, అభిమానం విడిచిపెడితే అందరితోటి మంచినడవడి యేర్పడుతుందన్నమాట.

ప్రశ్న: తల్లి – భార్య (అత్త–కోడలు) పోట్లాడుకుంటే పుత్రుడేం చెయ్యాలి?

సమాధానము: ఇటువంటి స్థితిలో కొడుక్కి పెద్ద ఆపదే (ఇబ్బంది)

---

* "నిత్యమూ పోట్లాడు కొనుటకంటే ప్రేమతో వేరు పడుట మేలు".

కలుగుతుంది. అతడు తల్లిపక్షాన మాటలాడితే భార్య ఏడవటం మొదలెడుతుంది. భార్యపక్షాన మాటలాడితే – "వీడు భార్య మనిషయిపోయాడు నావాడు కాడని" తల్లి దుఃఖితురాలవుతుంది. ఇటువంటి సమయంలో పుత్రుడు విశేషించి తల్లినే ఆదరించాలి. తల్లిమాటే నిలబెట్టాలి. మా అమ్మతో సమానంగా ఆదరించదగిందీ, పూజించదగింది ఇంకెవరూ లేరు. ఆమెలాగ మనయిద్దరిమేలు కోరేదేకాని, హితంచేసేదిగాని మరొక వ్యక్తిలేదు, అమ్మ నీతో కఠినంగా మాటలాడినప్పటికీ అంతర్యంలో ఎప్పుడూ నీ అహితం(కీడు) కోరదు. పైగా ఎల్లప్పుడు మేలే కోరుతుంది. నన్ను కనక నీవు రాజీపరచదలచుకొంటే అమ్మని ఒప్పించు. కొడుకు స్త్రీకి వశుడై ఆవిడ చెప్పుడు మాటల్లోపడి ఎవరితోటి కలహం, తగువు, ద్వేషం కలిగించుకోకూడదు. భార్య మాటలువిని తల్లి, సోదరి మొదలైనవారిని తిరస్కరించటం, అవమానించటం చాలా పెద్దతప్పు".

తల్లికి కూడ ఒంటరిగా తెలియజెప్పాలి – "అమ్మా! పాపం ఈమె తన అమ్మానాన్నని, అన్నవదినెల్ని అందర్నీ వదిలిపెట్టి వచ్చింది. కనక నీవే ఈమెను ప్రేమాదరాలతో చూడగలవు. దీనికష్టం వినిపించుకొనే పట్టించుకొనే వారింకెవరు? ఈమె తన కష్టసుఖాలెవరితో చెప్పుకుంటుంది? నీవే ఈమెకు తల్లివి. ఈమె నీ మనస్సును బాధపెట్టినా, వ్యతిరేకముగా ప్రవర్తించినా సహించి ఈమెను సన్మార్గురాలిని చేయాలి. మనమిద్దరమూ ఈమె ఉద్దేశ్యం పట్టించుకోకపోతే ఈమె ఎక్కడికి వెడుతుంది? కనుక, అమ్మా! ఈమెను క్షమించు. నేను చిన్నప్పుడు చాలాసార్లు నీ ఒడిలో మలమూత్రాలు వదిలాను కాని నీవు నన్ను నీ శరీరంగానే భావించి నామీద ఎప్పుడూ కోపపడలేదు. పైగా క్షమించావు. అది నా అపరాధమని అనుకోనేలేదు. ఇలాగే ఈమెనుకూడ నీ శరీర భాగమే అనుకొని క్షమించు. పళ్లతో నాలుక కొరుక్కుంటే దంతాలతో విరోధం కలగనట్లే, వాటిమీద కోపంరానట్లే, ఈమెవల్ల ఏదైనా పొరపాటు జరిగితే నీకు కోపం రాకూడదు. ఈమె నీ శరీరమే కనుక. నేను నీ అంగాన్నయినట్లే ఈమె నాకు అర్ధాంగి అవటంవల్ల ఈమెకూడ నీ అవయవమే అయింది.

ప్రశ్న: భార్య, కొడుకుభార్య ఒకరితో ఒకరు పోట్లాడుకుంటే భర్త

(మామగారు) ఏం చెయ్యాలి?

సమాధానము: భర్త తన భార్యను మందలించి కోడలుకు నచ్చచెప్పాలి –"నేను మీ అత్తకు తెలియ జెప్పుతానులే!" అని. తన భార్యతో ఒంటరిగా "చూడు! నీవే ఈమెకు తల్లివి. ఈమె తన వాళ్లందరిని విడిచిపెట్టి మన యింటికి వచ్చింది కాబట్టి నీవామెను నీ కూతురులా చూచుకుంటూ ప్రేమగా ఉండటం నీ కర్తవ్యం. ఈమె తన కష్టం నీతోతప్ప ఇంకెవరికి చెప్పుకుంటుంది? తనకాధారమైనా, ఆశ్రయమైనా నీవే.

కోడలికి బోధించాలి – "చూడమ్మా! అత్త చేసేది కోడలు మంచికే చేస్తుంది. కొడుకు పుట్టినప్పటినుండి ఆమె ఆశ పెట్టుకుంటుంది ఏమని – "మా కోడలు వస్తుంది. నేను చెప్పినట్లు చేస్తుంది. నన్ను సేవిస్తుంది. ఇలా ఆశపడే అత్త కోడలి కన్యాయమెలా చేయగలదు? చిన్నతనం చేత నీ మనస్సు కనుకూలంగా ఉండకపోవటంచేత నీ అత్తగారిమాట నీకు చెడ్డదనిపిస్తుంది. అమ్మా! నీవు అమ్మా నాన్న మొదలైన వాళ్లనందర్నీ విడిచి యిక్కడికి వచ్చావంటే ఒక్క అత్తగారిని సమాధానపరచలేవా? అత్త ఎన్నాళ్లుంటుంది? ఇక్కడి యజమానురాలివైతే నీవే. మీ యిద్దరిమధ్యనా తగువు ఎవరైనా పెద్దమనుషులు వింటే ఇందులో తప్పు నీదే అనుకొంటారు. వృద్ధులు, పిల్లలు పోట్లాడుకుంటే తప్పు పిల్లలదైనట్లే పెద్దలది కానట్లు, కనుక ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని నీవు నీ "ప్రవర్తన సరిదిద్దుకోవాలి. నీ ప్రవర్తన నీ అత్తకి చెడుగా అనిపించకుండా ఉండేలాగ. ఎప్పుడైనా నీతో కఠినంగా సంచరించినప్పటికీ అత్తగారి కాళ్లమీద పడి ఏడ్చి క్షమించమని కోరాలి. అత్తగారిమీద దీని ప్రభావం బాగా పడుతుంది. దానితో మీ ఇద్దరికి, యింటికి శోభకలుగుతుంది. ఇల్లు సుఖశాంతులతో వర్ధిల్లుతుంది. ఒక్క నీవు చెడటంవల్ల ఇల్లు అశాంతమవుతుంది. ఇంటిలోని అశాంతికి నీవెందుకు కారణమవుతావు? నీవు పెద్దవాళ్లమాటవిను. ప్రాతస్సాయంకాలాలలో పెద్దల పాదాలకు నమస్కరించు. అత్తగారేమన్నాసరే ఆమె ముందు ఏమీ మాటలాడకు. ఆమె శాంతించాక నీమనస్సులో మాట చాల శాంతంగా ఆమెతో చెప్పు. ఆమె ఒప్పుకుంటే సరే! ఒప్పుకోకపోయినా సరే నీ తప్పేమీ ఉండదు".

ప్రశ్న: తల్లి తండ్రి తమలోతాము పోట్లాడుకుంటే కొడుకేం చెయ్యాలి?

సమాధానము: సాధ్యమైనంతవరకు కొడుకు తల్లిపక్షం వహించాలి. కాని తండ్రికి వీడు తన తల్లిపక్షం వహిస్తున్నాడనే సంగతి తెలియకూడదు. తండ్రితో నాన్నా! మీరు మా అందరికి యజమాని. అమ్మ ఏదైనా చెప్పాలంటే మీతోటే చెపుతుంది. మీరుతప్ప ఆమె మాట వినేదెవరు? వివాహ సమయంలో మీరు అగ్ని, బ్రాహ్మణ సమక్షంలో చేసిన వాగ్దానం పాటించాలి. అమ్మ తన మాట పాటిస్తోందా లేదా, అనేది పట్టించుకోకుండా మీరు మీ కర్తవ్యం నెరవేర్చాలి. మీరు మర్యాదకాపాడితే అమ్మయొక్క ఇహపరలోకాలు బాగుపడతాయి. లేకపోతే మేమెక్కడికి పోతాం? మీరు లేకపోతే మాగతేమవుతుంది? నేను మీకేమీ బోధించటం లేదు. కేవలం జ్ఞాపకం చేస్తున్నాను. నేనేమైనా అనుచితంగా మాటలాడితే మీరు నన్ను క్షమించండి. ఎందుచేతనంటే మీరు పెద్దవారు – "క్షమా బడనకో చాహియే, ఛోటనకో ఉత్పాత । కహా విష్ణుకో ఘట గయో, జో భృగు మారీ లాత ॥" భృగువు తన్నితే విష్ణుభగవానుడికి తరిగిందేమీ లేదు. పైగా మహిమ పెరిగింది. కాబట్టి మీరు స్వయంగా ఆలోచించండి మీరు తెలిసినవారు. మీకు నేనేం తెలియజెప్పను?".

కుటుంబంలో కలహం రాకుండా ఉండటానికి ప్రతివ్యక్తి తన అధికారం త్యాగంచేసి ఇతరుల అధికారం కాపాడటం కర్తవ్యం. ప్రతివాడు తాను ఆదరగౌరవాలు కోరుకుంటాడు కనక ఇతరులకు గౌరవమర్యాదలివ్వాలి.

ప్రశ్న: అత్త కొడుకుపక్షం వహించి ఇబ్బందిపెడితే కోడలు ఏ విధముగా ప్రవర్తించాలి?

సమాధానము: కోడలు ఇది తెలుసుకోవాలి – "వీరు యింటి యజమానులు. నేను మరొక ఇంటినుంచి వచ్చాను. కనుక వీరేమన్నప్పటికి, ఏం చేసినప్పటికి నేనది - సహించాలి. దానితో వీరు రాజీపడతారు. కోడలు అత్తతో మంచిగా మెలగాలి. ఆమెను ద్వేషించకూడదు. ఆమె తన భావాల్ని కాపాడుకోవాలి. తన భావాలు

చెడిపోనివ్వకూడదు. ఆమె భగవంతుణ్ణి – "ఓ ప్రభూ! వీరికి సద్బుద్ధిని ప్రసాదించు. నాకు సహనం ఇయ్యి" అని ప్రార్థించాలి.

ప్రశ్న: భర్త, మామగారు పోట్లాడుకుంటే స్త్రీ కర్తవ్యమేమిటి?

సమాధానము: స్త్రీ తన భర్తకు తెలియజెప్పాలి –"ఇక్కడున్నదంతా మీ నాన్నగారిదే. మీ అమ్మగారినికూడ తండ్రిగారే తీసుకువచ్చారు. ధనసంపద, భూమి, ఆస్తి, ఇల్లు వైభవం మొదలైనదంతా తండ్రిగారి స్వార్జితం కనుక ఆయనని అన్నివిధాలా గౌరవించాలి. ఆయనమాట మన్నించటం న్యాయం, ధర్మం, మీ కర్తవ్యంకూడాను. ఏమీ చదువుకోకుండానే మీరాయన సంపదకు స్వతఃసిద్ధంగానే వారసులు. కనుక వారేం చెప్పినా అదంతా మీకు మన్నింపదగినది కావాలి. మీరు మనోవాక్కాయములతో త్రికరణశుద్ధిగా అన్నివిధాలా ఆయన్ని గౌరవించాలి. ఆయనకెప్పుడైనా కోపంవచ్చి ఏమైనా అన్నప్పటికీ మీరు–"ఆయనతో సమానంగా నామేలు చేసే వారింకెవరు లేరు. అందుచేత ఆయన మనస్సునెప్పుడూ కష్టపెట్టకూడదు" అని ఆలోచించాలి. నేను కూడ ఏమైనా తగనిమాటలంటే మీరది లెక్కచేయకుండా తండ్రిగారి మాటనే గౌరవించాలి".

ప్రశ్న: భర్త పుత్రుడు పరస్పరం కలహించుకుంటే స్త్రీ ఏం చెయ్యాలి?

సమాధానము: స్త్రీ మాత్రం భర్తపక్షమే వహించి కొడుక్కి తెలియజెప్పాలి – "బాబూ! మీ నాన్నగారేంచెప్పినా, ఏం చేసినా, వాస్తవానికాయన హృదయం స్వతహాగా నిన్ను గురించి మంచి భావమే ఉంది. ఆయన ఎప్పుడు నీకు కీడుచేయలేరు. అందుచేత ఈ విషయాలు మనసులో ఉంచుకొని తత్పరభావంతో నాన్నగారి సేవచెయ్యాలి. నీవు నన్ను తక్కువగా చూచినా సరే, కాని నాన్నగారిని మాత్రం బాగా గౌరవించు. నిజానికి మన యజమాని ఆయనే. నీవు నన్ను తక్కువగా గౌరవించినా నేను కోప్పడను. కాని మీ నాన్నగారు ఆగ్రహించెదరు. నేను ఆయన ఎల్లప్పుడు సంతోషంగా ఉంచాలనుకొంటున్నాను. ఆయన్ని ప్రసన్నులుగా ఉంచటం నీ కర్తవ్యం".

ప్రశ్న: భార్య కొడుకు పరస్పరం పోట్లాడుకుంటే పురుషుడి కర్తవ్యమేమిటి?

సమాధానము: అతడు కొడుక్కి తెలియజెప్పాలి - "బాబూ! అమ్మని సంతోషపరచటం నీ విశేషకర్తవ్యం. ప్రపంచంలో ఉన్న సంబంధాలన్నిటిలోను తల్లియొక్క సంబంధం ఉన్నతమైనది. అందుచేత మీ ఆవిడకిలొంగిపోయి నీవు మీ అమ్మమనస్సు దుఃఖపెట్టకూడదు".

భార్యతో - "నీవు వీడికి జన్మనిచ్చావు. నీ పాలిచ్చి పోషించావు. బాల్యమందు నీ ఒడిని తడిపినా ఆనందమును పొందితివి. కాని వానిపై ఆగ్రహించలేదు. ఇప్పుడు కూడ వీడు నీయెడల కఠినంగా మాటలాడి నప్పటికీ నీ ప్రియపుత్రుడనుకొని వీణ్ణి క్షమించు. ఎందుచేతనంటే నీవు తల్లివి. కొడుకు దుష్టుడు కావచ్చు. కానితల్లి దుష్టురాలు కాజాలదు. "కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి" అని నచ్చజెప్పాలి.

ప్రశ్న: కుటుంబంలో ప్రేమ, సుఖశాంతులు ఎలా ఉండాలి?

సమాధానము: మనిషి తన ఉద్దేశ్యాన్ని మరచిపోయినప్పుడే అన్ని బాధలు, ఆపదలు వస్తాయి. అతడు జాగరూకుడై ఏమైనా సరే "నేను (నా) ఆధ్యాత్మిక ఉన్నతిని సాధించాలనుకుంటే" ఇంక అతడు సుఖదుఃఖాల్ని లెక్కచేయడు. "మనస్వీ కార్యార్థీ న గణయతి దుఃఖం న చ సుఖమ్" అప్పుడు తన స్వార్థాన్ని, అభిమానాన్ని త్యాగం చేయటంలో అతనికేమీ కష్టంకూడ ఉండదు. స్వార్థాభిమానాల త్యాగం జరగటంవల్ల వ్యవహారంలో ఏ బాధ, కాఠిన్యం రాదు. వ్యవహారంలో మనిషి తన మీసం మెలెయ్యాలని, తనమాటే నెగ్గాలని, తన స్వార్థం సిద్ధించాలనీ అనుకొన్నప్పుడే పరస్పరం ప్రేమకు బాధకలుగుతుంది.

ఇతరులకు మంచి ఎలా జరుగుతుంది? క్షేమం శ్రేయస్సు ఎలా కలుగుతుంది? వారికి గౌరవసత్కారాలు ఎలా జరుగుతాయి? సుఖసంతోషాలెలా లభిస్తాయి? అనే ఊహలెప్పుడైతే ఆచరణలోకి వస్తాయో అప్పుడు కుటుంబసభ్యులందరు ప్రసన్నులవుతారు(సంతోషపడతారు). ఎప్పుడైనా ఒకసారి ఏఒక్కరైనా అప్రసన్నులైనప్పటికీ అతడి అసంతృప్తి

నిలబడదు. స్థాయిగా ఉండదు. ఎందుకంటే ఎప్పుడో ఒకప్పుడు అతడు తనకోసం సరిగా ఆలోచిస్తే అప్పుడతని కర్థమవుతుంది. తన మేలు ఆ విషయంలోనే ఉందని. పిల్లవాణ్ణి చదివిస్తుంటే వాడి దృష్టి ఆటలమీద ఉండటంవల్ల వాడికి చదువు చెడుగా తోస్తుంది. కాని పరిణామంలో వాడికి మేలే కలుగుతుంది. అలాగే ఏదైనా సంగతి సరిగా ఉన్నప్పటికి ఒకడికి చెడ్డదిగా కనిపిస్తే ఆ సమయంలో అతనికర్థం కాకపోవచ్చు. కాని భవిష్యత్తులో తప్పక అర్థమవుతుంది. ఒకవేళ అతడికర్థమే కాకపోయినప్పటికీ మనకి మన ఆశయం మీద ఆచరణమీద సంతోషం కలుగుతుంది. "మనం అందరిమేలుకోరుతున్నాం. మనలో ఒక బలముంటుంది. మనమాట నిజమైనదీ, దృఢమైనదీను" అని.

పరస్పరం ప్రేమ ఉండటంవల్లనే కుటుంబంలో సుఖము శాంతి ఉంటాయి. స్వార్థం, అభిమానం త్యాగం చేయటంవల్ల ప్రేమ కలుగుతుంది. స్వార్థాభిమానాలుండనప్పుడు ప్రేమలేకపోతే మాత్రమేమవుతుంది. మరొకడు తన స్వార్థానికి వశమై మనతో కఠినంగా ప్రవర్తిస్తే అప్పుడప్పుడు మనం ఇతనితో మంచిగా ఉంటున్నప్పటికీ ఇతడు సంతోషంగా ఉండటంలేదు, మనమేం చేస్తాం" అనిపిస్తుంటుంది. ఇలా అనిపించటానికి కారణం మనసూక్ష్మమైన సుఖలోలత్వమే. ఎందుచేతనంటే ఎదుటివాడు తత్కాలంలో సుఖంగా ప్రసన్నంగానుండటంవల్ల ఒక సుఖం లభిస్తుంది. కనుక ఈ సుఖ లోలత్వంయొక్క జాడ కనిపించగానే దీనిని త్యజించాలి. మనం కేవలం మన కర్తవ్యం నిర్వహించాలి. ఎదుటివాణ్ణి గౌరవించాలి. అతనియెడల ప్రేమ చూపాలి. ఇది మన కర్తవ్యం కనుక, మన భావాల ఆచరణయొక్క ప్రభావం అతడిమీద పడిపోతుంది. అంతఃకరణలో కఠోరత్వం ఉండటంవల్ల అతడిమీద ప్రభావం పడకపోయినప్పటికీ మనం మన తరపున మంచి చేశాం" అనే దానితో మనకి సంతోషం కలుగుతుంది. సంతోషం కలగటంవల్ల మన ప్రేమతరగదు. కుటుంబంలో కూడ సుఖశాంతులుంటాయి.

----oOo----